డిసెంబరు 2013
రూ. 12/-

# చతుర



# SUPER SAVER OFFERS

**Sunflame®** THE CLEAR CHOICE

**Suction** 850 m³/hr | **Fusion 60 BF**



LIFE TIME WARRENTY

MRP. (₹16,990/-)

**SPECIAL FESTIVE OFFER PRICE ₹8,990/-**

**Exchange your old gas stove, any make, any condition, for a sparkling new Sunflame Cooktop and**



**SAVE UPTO ₹3000***

* Offer on MRP

**Buy a Sunflame Geyser**

Installation free

AND GET OPAL IRON (₹890)*



ABSOLUTELYFREE



EVA

* Offer on MRP

**Buy a Sunflame Mixer Grinder and**

POWERFUL 750 Watts Motor



**SAVE UPTO ₹1200***

* Offer on MRP

QUANTUM

**Hurry! Offers valid for a limited period.** **www.sunflame.com**

**HYDERABAD: BRAND STORE AT HYDERABAD TWIN CITIES:** Anandbagh Cross Road - 9866835952, A S Rao Nagar(Beside Anutex) - 040-6529 8888, Gachibowli Main Road - 72072 65598/9966264403, Kukatpalli Rd. No. 1 - 99594 46838, Nagole Cross Road - 99661 54575. **SUNFLAME OFFICIAL FOR BRAND STORE:** Santosh Patil - 9885511777 For **Distributor** for OTG, Cooking Range, Crystal & Traditional Cooktop Series: Sun Enterprises - 040-2754 0056. **Sunflame Official:** M Srinivas Rao - 7569033133. **Distributor** for Shakthi, Euro Cooktop Series & Mixer Grinder: Hyderabad Distributor - 040-6450 9450. **Sunflame Official:** Md Jawed-9032077806. **Distributor** for Classic Cooktop Series & Small Home Applainces: Sri Rama Marketing: 040-6555 1979. **Sunflame Official:** Aditya - 9000505432 . **Distributor** for Geysers, Chimneys & Hobs: Sri Gajanand Enterprises 040-6515 6030. **Sunflame Official:** Naresh - 9866002852, Naveen - 99851 43064. **Distributor** for **Rangareddy District:**Hyderabad Distributors - 040-6450 9450. **Sunflame Official:** Md Jawed - 9032077806. **DISTRIBUTOR FOR MEHBOOBNAGAR, KARIMNAGAR, WARANGAL, MEDAK, NIZAMABAD& ADILABAD DISTRCITS:** Hyderabad Distributors - 040-6450 9450. **Sunflame Official:** VVSM Srinivas - 9246914556. **DISTRIBUTOR FOR KHAMMAM & NALGONDA DISTRICTS:** BPR Industries Pvt Ltd - 08742-656789/9866394567. **Sunflame Official:** Srinadh - 8790806368. **DISTRIBUTOR FOR KRISHNA DISTRICT:** Teja Sai Agencies 0866-2524551. **Sunflame Official:** Ravi Kishore - 94943 42456. **DISTRIBUTOR FOR WEST GODAVARI:** Sri Ganesh Electronics - 9848376695/08332466977. **Sunflame Official:** Ravi Kishore - 94943 42456 **DISTRIBUTOR FOR GUNTUR & PRAKASAM:** A R Enterprises -9849456062/9396666688. **Sunflame Official:** Srinadh - 87908 06368. **DISTRIBUTOR FOR EAST GODAVARI DISTRICT:** SRI GANESH ELECTRONICS - 9848376695/08332466977. **SUNFLAME OFFICIAL:** Ravi Kishore - 94943 42456 **DISTRIBUTOR FOR VIZAG, VIZIANAGARAM & SRIKAKULAM DISTRICTS:** SRI TIRUMALA AGENCIES - 9246528333. **SUNFLAME OFFICIAL:** SHIVA - 92468 97666. **DISTRIBUTOR FOR CHITOOR DISTRICT:** SHYAM ENTERPRISES - 8686339062. **SUNFLAME OFFICIAL:** VINOD - 99664 92665. **DISTRIBUTOR FOR KADAPA DISTRICT:** JUTUTRU AGENCIES - 9866282122. **SUNFLAME OFFICIAL:** VINOD - 99664 92665 **DISTRIBUTOR FOR MEHBOOBNAGAR, KURNOOL & ANANTHPUR DISTRICTS:** HYDERABAD DISTRIBUTORS - 040-6450 9450. **SUNFLAME OFFICIAL:** SYED ZAKIR 9866244689 **ALSO AVAILABLE AT ALL LEADING STORES**

**SUNFLAME CUSTOMER CARE : 040-6554 6553, 9032005021**

# అమ్మానాన్నలకు అందమైన కానుక



కన్నవారికి తోడు ఉండాలన్నా
వీలుకాని ఉద్యోగజీవితమా మీది?

మీరు నగరంలో ఉంటే
అమ్మా నాన్నా ఒంటరిగా పల్లెలో ఉన్నారా?

కన్నవారితో గడపలేక పోతున్నామనేగా మీ దిగులు?
వారికి తోడుండలేక పోతున్నామనేగా మీ చింత?

మీకా దిగులు అక్కర్లేదు
అమ్మనాన్నలకు చక్కని కాలక్షేపాన్నందించే
ఏకైక మార్గం ఇదిగో!

వెంటనే మీ తల్లిదండ్రుల పేరుమీద
కేవలం రూ. 280/- మాకు పంపండి చాలు
నెలనెలా క్రమం తప్పకుండా
తలుపు తట్టిమరీ వారిని పలకరిస్తాయి

# చతుర విపుల



నవలలు.. కథలు.. మరెన్నో ఆత్మీయానుభూతులతో
అమ్మానాన్నలకు రోజంతా ఆహ్లాదం
మానసిక వికాసం... ఉత్సాహం...

మరి చేయకండేం ఆలస్యం?



**డీడీ లేదా ఎం.ఓ పంపవలసిన చిరునామా :**
**వసుంధర పబ్లికేషన్స్, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.**
**ఆన్‌లైన్ చందా చెల్లింపునకు** (యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, సైఫాబాద్,
హైదరాబాద్ ఆన్‌లైన్ అకౌంట్ నెం. 370605010044015)
వివరాలకు : ✆ 040-23318181 ఎక్స్‌టెన్షన్ 6441
vipula.chatura@gmail.com కు మెయిల్ కూడా చేయొచ్చు

సంపుటి -36 సంచిక - 11
431వ సంచిక, పేజీలు : 132
డిసెంబరు 2013

# చతుర





'సుబ్బారావ్!
ఏమిటలా ఉన్నావు?'
ముఖమంతా చెమటలు పట్టి
కంగారుగా ఉన్న అతడ్ని
అడిగింది మార్గరెట్.
'నా కూతురు స్వాతిని ఎవరో
కిడ్నాప్ చేశారు!'
వణుకుతున్న కంఠంతో చెప్పాడు
సుబ్బారావు.
'వాట్? మీ స్వాతిని కిడ్నాప్
చేశారా? పెద్దపిల్లే కదా!
కిడ్నాప్ ఎలా జరిగింది?'
అన్నది మార్గరెట్.
'ఏమో.. రెండు కోట్లు డిమాండ్
చేస్తున్నారు. మళ్లీ ఫోన్ చేస్తారట'
చెప్పాడు సుబ్బారావు.
'పోలీస్ కంప్లైంట్ ఇవ్వు'
సలహా ఇచ్చింది మార్గరెట్.
'కిడ్నాపర్లు స్వాతినేమైనా చేస్తే?'
ఆందోళనగా అన్నాడు.
ఆ తర్వాతేం జరిగింది?
సుబ్బారావు పోలీసులకు కంప్లైంట్
ఇచ్చాడా? కిడ్నాపర్ల చెర నుంచి
స్వాతి విడుదలయిందా?
ఆద్యంతం ఉత్కంఠగా చదివించే
**వాణిశ్రీ** నవల **జారుడుమెట్లు**
6వ పేజీలో...
బొమ్మలు : పిన్నాడ రవి

# ప్రపంచంలోనే మొట్టమొదటి సారిగా SUGAR ను తగ్గించుటకు చికిత్స !!

**1.** SUGAR అనేది ఒక వ్యాధి కాదు. SUGAR అనేది హార్మోన్ సమస్య!! (DIABETIC IS A METABOLIC DISORDER) జీవక్రియ సరిగా లేకపోవుట వలన SUGAR వస్తుంది. 1 నెల మందు వాడి SUGARను పరీక్షించుకొని ఫలితాన్ని చూడండి! Type-II 12-18 నెలలు Type-I - 24-36 నెలలు - Type - II వారు ఇప్పుడు మీరు వాడుచున్న ఇంగ్లీషు మందులు (Tab) 12 నెలలకు మానివేయవచ్చును. Type - I వారు 24 నెలలకు INSULIN మానివేయవచ్చును. కోర్సు అనంతరము మందులతో పనిలేకుండా అన్ని రకముల తీపి పదార్థములు తినవచ్చును. నెలకు రూ॥ 4000/-

**1 A.** షుగర్ వలన దీర్ఘకాలముగా మానని పుళ్ళు - గాయములు - గాంగ్రీన్ లాంటివి మాన్పించుటకు 100ml Oil రూ॥ 1000/-

**2.** నూతన యవ్వన శక్తికి : నపుంసకత్వము (IMPOTENCY) - శీఘ్రస్కలనము - నరాల బలహీనత - సంతానం లేని (Infertility-Sterility) దంపతులకు సంతానోత్పత్తి కణాలు తక్కువగా వున్న (OLIGOSPERMIA) మగవారికి కణాలలో కదలిక (MOTILITY) లేని వారికి కణాలు పూర్తిగా లేనివారికి (Azoospermia) వెరికోసిల్‌వీన్స్ (Varicoseviens). Per month Rs. 6000/-) Course : 6-9 Months. **2A.** స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదలకాక పోవుట, అండవాహికలు మూసుకొని పోవుట (Fallopian Tubes Block), ఎండోమెంట్రియాసిస్, అండములు చాలా చిన్నవిగా వున్నా, గర్భాశయ లోపములకు (PCOD)

**3.** (Hepatitis) లివర్ వాచుట - లివరు గట్టిపడుట (Cirrhosis) లివర్‌లో పుండు (Abscess) (Per month Rs. 6000/-)

**4.** హెర్పిస్ సింప్లెక్స్ (HERPES SIMPLEX) హెర్పిస్ జోస్టర్ **5.** సోరియాసిస్ (Psoriasis) **6.** బొల్లి (Vitiligo) **7.** మూర్ఛ (Fits) - అపస్మారకము **8.** స్త్రీల శరీరముపై వచ్చు అవాంఛిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు **9.** Prostate Enlarge (ఆపరేషన్ లేకుండా) **10.** Kidney Stones - Gall Blader Stones (ఆపరేషన్ లేకుండా) (Per Month Rs 5000/-) **11.** బరువు తగ్గుటకు (Obesity) **12.** బరువు పెరుగుటకు **13.** తుంటి నొప్పి (Sciatica) (ఆపరేషన్ లేకుండా) **14.** భగంధరము (Fistula) (ఆపరేషన్ లేకుండా) **15.** థైరాయిడ్ (Thyroid) (ఆపరేషన్ లేకుండా) **16.** నత్తిని తగ్గించుటకు (Stammering) **17.** క్షయ (T.B.) (Per Month Rs 4000/-) **18.** ఆల్కహాల్ - త్రాగే వారికి తెలియకుండా మాన్పించుటకు !! **19.** సుఖవ్యాధులు : గనేరియా - సిఫిలిస్ **20.** కొలెస్ట్రాల్‌ను తగ్గించుటకు (Cholestrol) **21.** ముక్కులో కండరాలు పెరిగి శ్వాస తీసుకొనుటకు కష్టముగా ఉండుట (Nose Polyps) (ఆపరేషన్ లేకుండా) **22.** జ్ఞాపకశక్తిని పెంచుటకు (Per Month Rs 3000/-) **23.** కీళ్ళు - కండరాల నొప్పులకు (Rheumatis Arthritis) **24.** ఆస్తమా - అలర్జీ (Asthma-Allergy) **25.** రక్తమొలలు, అర్శమొలలు :Piles - Fissures **26.** గ్యాస్ ట్రబుల్, ఎసిడిటి, అల్సర్, అజీర్ణము **27.** బట్టతల !! **28.** రక్తపోటు (B.P.) **29.** చర్మ వ్యాధులు (Skin Deseases) **30.** ఆకర్షణీయమైన అందమునకు **31.** స్త్రీల వ్యాధులు **32.** స్త్రీల స్తనముల సైజు పెంచుటకు **33.** స్త్రీల పొత్తికడుపు మీద (SCRATCH MARKS) చారలు, గీతలు పోవుటకు **34.** చెవి సమస్యలు చెవుడు - చెవినుండి చీము కారుట - చెవిలో హోరు శబ్దము (ఆపరేషన్ లేకుండా) **35.** పళ్ళ సమస్యలు పళ్ళు - చిగుళ్ళు గట్టి పడుటకు - పళ్ళ రంగు మార్చుటకు - నోటి దుర్వాసన (ఆపరేషన్ లేకుండా) **36.** నిద్రలేమి (Per month Rs.1500/-)

**38.** పులిపిర్లు (Warts) **39.** మలబద్ధకం (Per month Rs.1000/-) అన్నిరకముల దీర్ఘకాల వ్యాధులకు కేరళ వారి ప్రత్యేక

## మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు

40 సం॥ల అనుభవజ్ఞులైన డా॥ మల్లు లక్ష్మీనారాయణ రెడ్డి **9866155109**




## కేరళ ఆయుర్వేద వైద్యశాల **9392355590**

చందనా బ్రదర్స్ దగ్గర - నందిని సుధాహోటల్ ప్రక్కన - చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్ - 20.

Note: పోస్టు ద్వారా కూడా చికిత్స కలదు. ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియజేసి, మీ దగ్గర ఉన్న రిపోర్ట్సు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు ఏపీలో పోస్టల్ / కొరియర్ ఛార్జీ రూ.100/-, ఇతర రాష్ట్రాలవారు రూ. 250/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా పంపువారు KERALA AYURVEDA VAIDYASALA పేరు మీద ఇక్కడ రాసినట్లుగా డ్రాఫ్ట్ పంపవలెను. మీ ఫోన్ నెంబర్‌తో సహా పంపించండి. ఫోన్ ద్వారా సంప్రదించువారు 10 A.M. - 8.P.M. Sunday 10 A.M. - 2 P.M.

"సార్.. వీడు చిన్నప్పటినుంచీ సినిమా వాతావరణంలో పెరిగాడు. కాబట్టి హీరో అయిపోవాలని కలలు కంటున్నాడు.. ఇంజనీరింగ్‌లో చేర్పించినా వీడి మనసు మారడం లేదు" అన్నాడు త్యాగరాజు.

"ఔనంకుల్.. నాకు హీరో కావడమే ఇంట్రస్ట్" అన్నాడు రవీంద్ర.

"బాగానే ఉంది.. నిన్ను హీరోగా పెట్టి సిన్మా ఎవరు తీస్తారు?"

"ఇంకెవరు? మీరే" టపీమని చెప్పాడు రవీంద్ర.

తన కూతుర్ని రవీంద్రకు ఇవ్వాలని వచ్చిన సుబ్బారావుకు రవీంద్ర ధోరణితో చిర్రెత్తుకొచ్చింది. దాంతో అతనేం చేశాడు? ఆద్యంతం ఉత్కంఠగా చదివించే కౌటుంబిక నవల

వాణిశ్రీ జారుడుమెట్లు

ఈనెల చతుర కానుక!

వాణిశ్రీ

# జారుడుమెట్లు

డాక్టర్ గారూ! నాదొక వింత సమస్య. కొందరిదృష్టిలో అసలు ఇది సమస్య కాకపోవచ్చును. మావారు రియల్ ఎస్టేట్ బిజినెస్‌లో వున్నారు. ఆయన జూనియర్ ఇంజనీర్‌గా పనిచేస్తున్నప్పుడు వారితో నా పెళ్ళయింది. తర్వాత ఉద్యోగం మానేసి కాంట్రాక్టర్‌గా రియల్ ఎస్టేట్ వ్యాపారంలోకి దిగారు. ఉద్యోగం చేస్తున్నప్పుడు మేమెంతో అన్యోన్యంగా వున్నాం. బిజినెస్‌లోకి దిగాక ఆయన ఇంటిని పట్టించుకోవడం మానేశారు. పిల్లల చదువులు, ఇంటి సంగతులు చూసుకోవడం నా మీదకే నెట్టేశారు. పిల్లల బర్త్‌డేలకు గూడా ఇంటి పట్టున వుండరు. మా పుట్టింటి తరపు వారి పెళ్ళిళ్ళు, శుభకార్యాలకు నన్నే వెళ్ళమంటారు. మా వారి తరపు బంధువుల పెళ్ళిళ్ళకు గూడా కేవలం తప్పనిసరై వెళ్ళి వస్తుంటారు. పిల్లలు పెద్దవాళ్ళయ్యారు. బాధ్యతలు పెరిగాయి. అయినా ఆయన ఏమీ పట్టించుకోరు. రాత్రి బాగా పొద్దుపోయి వస్తారు. ఉదయం లేచిన దగ్గర్నుంచి ఫోన్‌లో మాట్లాడుతూనే వుంటారు. ఎప్పుడో గాని లంచ్‌కి గూడా ఇంటికి రారు. నాకు రాను రాను యాంత్రిక జీవితం మీద విసుగు పుడుతోంది. డబ్బే ధ్యేయంగా బతుకుతున్న ఆయన్ని మార్చేది ఎలా? సలహా ఇవ్వండి.

- హేమలత, హైదరాబాద్

ఉదయం కాఫీ తాగుతూ యాధృచ్ఛికంగా సైకాలజీ కాలమ్‌ని డైలీ పేపర్లో చదివిన సుబ్బారావు భ్రుకుటి ముడిపడింది. అదంతా తన గురించే రాసినట్లుగా తోచింది. హేమలత అంటే ఇంకెవరు? తన భార్య. హైదరాబాద్‌లో ఎందరో హేమలతలు వుండొచ్చు. కాని అదంతా తన వ్యవహారమే అనిపిస్తోంది.

హేమలత సమస్యకు సైకాలజీ ప్రొఫెసర్ ఏమి సలహాయిచ్చాడో చదివాడు-

'హేమలత గారూ! మీ సమస్య చాలా కుటుంబాలలో సర్వసాధారణమే. మీ వారు బిజినెస్ చేస్తున్నారని రాశారు. అందువల్ల వారికి ఒక టైమ్ షెడ్యూల్ అంటూ వుండదు. ఇరవైనాలుగు గంటలు వారి దృష్టి వ్యాపారం, లావాదేవీల మీదే కేంద్రీకృతమై వుంటుంది. బిజినెస్‌లో ఎంతో కాంపిటీషన్ గూడా వుంటుంది. దాన్ని ఎలా ఎదుర్కోవాలో అనే విషయాలు ఆలోచిస్తూ ఒత్తిడికి గురవుతూ వుంటారు. ఉద్యోగం చేసేటప్పుడు మీరు అన్యోన్యంగా వుండటానికి కారణం- టైమ్ ప్రకారం వెళ్ళడం, రావడం, మీతో సమయం గడపడానికి అవకాశం వుండడం, ప్రత్యేకంగా సెలవులు వుండటం వల్ల మీరు సంతోషంగా వుండగలిగారు. ఆయన బిజినెస్ చేస్తూ డబ్బు గడించడం మీదే దృష్టి పెట్టడం వలన కుటుంబం నడిపే బాధ్యత మీ మీదే మోపారు. మీ మీద ఆయనకు ఎంతో నమ్మకం వుందన్న విషయం అర్థమవుతుంది. ఇది ఆనందించాల్సిన విషయమే. కాని పిల్లలు పెద్దవాళ్ళవడం వలన కుటుంబ భారం జటిలమవుతుండడం మామూలే. ఇప్పటి సమస్యలు వేరే వుంటాయి. యుక్తవయసులోకి వచ్చిన పిల్లలకు సొంత భావాలు, అభిప్రాయాలు ఏర్పడి పెద్దవాళ్ళని లెక్కజేయరు. అది ప్రకృతి సహజమే. వారిని అర్థం చేసుకుని సక్రమ మార్గంలో నడిపించవలసిన బాధ్యత మీతో పాటు మీవారిది గూడా. కుటుంబ బాధ్యతలు భార్యాభర్తలు ఇద్దరూ మోయడం వలన మీ పిల్లలకు మనోబలం ఏర్పడుతుంది. అదుపులో వుంటారు. తండ్రి అండదండలు పిల్లలకు చాలా అవసరం. తల్లిదండ్రులు సఖ్యతగా, కలసిమెలసి వుంటేనే పిల్లల్లో మానసిక

వికాసం పరిపుష్టమవుతుంది. వ్యాపారం సాకుగా చూపించి ఇంటి సంగతి పట్టించుకోకపోవడం మీ వారికి కూడా మంచిది కాదు. సమయం చూసి మీ వారితో పిల్లల సంగతులు చెబుతూ మనసువిప్పి మాట్లాడండి. ఆయనలో మార్పు వచ్చే అవకాశం వుంది'

సైకాలజీ ప్రొఫెసర్ హేమలతకు యిచ్చిన సలహా చదివి, సుబ్బారావు ఆ పత్రికను టీ-పాయ్ మీద పడేసి ఆలోచనలో పడ్డాడు. అతనికి హేమలత మీద కోపం వచ్చింది.

తను ఏం చెడిపోయాడని మార్పు రావాలనుకుంటోంది? అసలు ఆమె సమస్య ఏమిటి? స్వంత ఇల్లుంది. ఎక్కడికైనా వెళ్లడానికి కారుంది. పనులు చేయడానికి మనుషులున్నారు. ఏ అవసరానికైనా డబ్బుంది. ఇంకేంటి?

తను వ్యాపారం చేస్తున్నాడు. ఆమె ఇంటి అవసరాలు చూసుకోలేదా? ప్రాబ్లమ్ ఏంటి?

అన్నీ వున్నప్పుడు వాటి విలువ తెలియదు. అద్దెకొంపల్లో వుంటూ, అన్ని పనులూ చేసుకుంటూ, డబ్బుకోసం ఇబ్బందులు పడే ఇల్లాళ్ల సంగతేమిటి? తాగొచ్చి చితకబాదే భర్తలతో ఎట్లా వేగుతున్నారు?

అటువంటివి హేమలతకి ఎదురైతే ఇంకెంత బాధపడుతుంది? ఏ సమస్యలూ లేకపోతే ప్రతిదీ ఒక సమస్యగా కనిపిస్తుందేమో?

అటువంటి పరిస్థితులూ హేమలతకు మరీ కొత్తవికావు. ఆమె అవన్నీ పూర్తిగా మర్చిపోయింది.

సుబ్బారావుకి తన పెళ్ళయిన కొత్త రోజులు గుర్తొచ్చాయి. హేమలత వాళ్ళది తెనాలి. వాళ్ళనాన్న కొలసాని సుబ్బారాయుడుకి కిరాణా స్టోర్ వుంది. ఆయన కొడుకు రమణ కాంట్రాక్టులు చేస్తుండేవాడు. తమ పెళ్ళయిన తర్వాత హేమలత శ్రీశైలం వచ్చింది. అక్కడ సున్నిపెంట క్వార్టర్స్‌లో వుండేవాళ్ళు. అప్పుడు హేమలత చాలా సంతోషంగా వుండేది. కాలనీలో చాలామంది కొలీగ్స్ కుటుంబాలతో సత్సంబంధాలుండేవి. తమ చిలుమూరు నుంచి, వాళ్ళ తెనాలి నుంచి ఎవరు శ్రీశైలం వచ్చినా వెతుక్కుంటూ క్వార్టర్‌కి వచ్చేవాళ్ళు. చుట్టాలతో ఇల్లంతా సందడిగా వుండేది. వచ్చిపోయే వాళ్ళకి మర్యాదలు చేయలేక చిరాకుగా వుండేది. బంధువులకి తిండీతిప్పలు చూడ్డమే కాకుండా గుడికి తీసుకెళ్ళి దర్శనం చేయించడం, డ్యామ్ దగ్గరికి తీసుకెళ్ళడం వంటివి తలనొప్పిగా వుండేవి. కొందరు దగ్గరిబంధువులు 'వెళ్ళక వెళ్ళక ఇంటికి వెళ్తే తిండి పెట్టి పంపించారు. చీర కాదు గదా జాకెట్ ముక్కయినా పెట్టలేదు' అని ఈసడింపుగా అనేవారు.

ఇక హేమలత తండ్రి 'మీ ఆయన ఏం సంపాదిస్తున్నాడు? జీతం మొత్తం ఖర్చు పెట్టుకుంటూపోతుంటే ఎలా? ముందు ముందు పిల్లలకి చదువులవీ ఎలా చెప్పిస్తారు? ' అంటూ వుండేవాడు కూతురితో.

ఒకవైపు జీతం సరిపోయేది కాదు. ఇంటి దగ్గర్నుంచే బియ్యం, పప్పులు వంటివి తెప్పించుకుంటేనే అంతంత మాత్రంగా నెల గడిచేది. అప్పుడప్పుడూ కొలీగ్స్ దగ్గర అప్పులు చేయాల్సి వచ్చేది కూడా.

'జీతంతో ఏం కూడబెడతాను? మీ నాన్నను తెనాలిలో సెంటర్ చూడమను, కిరాణా కొట్టు పెట్టుకుంటాను, వుద్యోగం మానేసి' అని హేమలతను ఆటపట్టించేవాడు.

'కిరాణాకొట్టు పెట్టుకోదల్చుకుంటే ఇంతోటి చదువులు ఎందుకు చదివినట్టో? ' అనేది హేమలత.

'తెలివి తక్కువై చదివాలే' అనేవాడు.

డబ్బు మిగలడం లేదనే గాని సంసారం హాయిగా సాగుతూనే వుంది. జీతం ఎంతో కొంత పెరుగుతున్నది. అదిగో ఇదిగో అని పదేళ్ళు ఇట్టే గడిచిపోయాయి. ఇద్దరు కొడుకులు మహేశ్వర్, కార్తీక్ పుట్టాక ఇక చాలు అనుకుంటూ వుండ గానే, తనకు కూతురు కావాలని కోరిక వెళ్ళబుచ్చింది హేమలత.

'మళ్ళీ కొడుకు పుడితే ఏం చేస్తావు?' అని అడిగితే తాను నవ్వి, 'వెధవని ఆపరే షన్ చేయించి అమ్మాయిగా మార్పిస్తా' అనేది.

ఎట్లాగయితేనేం హేమలత కోరిక తీరింది. స్వాతి పుట్టింది. మామగారి సణుగుడు ఎక్కువైంది.

'ముగ్గురు పిల్లల్ని ఎట్లా పెంచి పెద్ద జేస్తారు? పెద్ద చదువులేం చదివిస్తారు? పెళ్ళిళ్ళు ఎట్లా చేస్తారు? పదేళ్ళ నుంచి ఏం వెనకేశారు? రూపాయి మిగలడం లేదు' అనేవారు ఆయన.

సుబ్బారావుకి ఏం చెప్పాలో అర్థం కావడం లేదు. వచ్చే జీతం ఇంటి ఖర్చు లకు సరిపోతున్నది అని చెప్తే ఆయన వూరుకోవడం లేదు.

'పైడబ్బులు ఏం చేస్తున్నాడు?' అంటాడు.

పైడబ్బులంటే లంచాలు. ఉద్యోగంలో చేరినప్పటి నుంచి తాను ఆఫీసుకే పరిమి తమయ్యాడు. లంచాల గొడవ లేదు. డిజైన్లు గీసుకుంటూ, ఎస్టిమేట్లు తయారు చేస్తూ హాయిగా వుంటున్నాడు. డబ్బు సంపాదించాలంటే ఫీల్డులోకి వెళ్ళాలి. అధి కారుల సతాయింపు, రాజకీయ నాయకుల పెత్తనం వలన తాము క్వాలిటీ వర్కు చేయించలేక పోతున్నామని అప్పటికే ఫీల్డు స్టాఫ్ మొత్తుకోవడం అతనికి తెలుసు. మాటపడే స్వభావం కాదు తనది. ఆఫీసర్లని కాకా పట్టడం, పొలిటీషి యన్ల అడుగులకు మడుగులొత్తడం చేత గాదు. డబ్బు సంపాదించిన వాడికే ఈ సొసైటీలో గౌరవం వున్న విషయం గ్రహించినా, అవినీతి సంపాదన అనే రొచ్చులోకి దిగదల్చుకోలేదు.

శ్రీశైలంలో కాంట్రాక్టు పనులు గూడా పెద్దగా లేవు. డ్యామ్ పూర్తయినందున కేవలం మెయింటెనెన్స్ మాత్రమే మిగి లింది. సంవత్సరానికొకసారి బకెట్ పోర్షన్‌లో దెబ్బతిన్న ప్రాంతాల్ని గుర్తించి రిపేర్లు చేయడమే పెద్దపని. దానికే కాంట్రాక్టర్లు పోటీలు పడుతుండేవాళ్ళు. ఎస్టిమేట్ నిజాయితీగా తయారు చేసి టెండర్లు పిలిస్తే, వర్కు చేయడానికి ఎవరూ ముందుకు వచ్చేవాళ్ళు కాదు. అంచనాలు పెంచమంటూ మంత్రుల దగ్గ ర్నుంచి సిఫార్సులు, లాలూచీలు. మెయిం టెనెన్స్ డివిజన్‌లో పనిచేసే కిరణ్‌రావు ఒళ్ళుమండి రాజీనామా చేసేశాడు.

కిరణ్‌రావు కూడా జూనియర్ ఇంజనీరే. క్షేత్రస్థాయిలో పని చేయించాల్సింది, క్వాలిటీవర్క్స్ మెజర్‌మెంట్‌ను నమోదు చేయాల్సిందీ అతనే. రాజకీయ నాయకుల దౌర్జన్యాలకు విసిగిపోయి ఉద్యోగాన్ని వదులుకున్నాడు. అతను సుబ్బారావుతో పాటే చేరాడు. మంచి స్నేహితుడు కూడా.

అతని తెగువ చూసి సుబ్బారావు ఆశ్చ ర్యపోయాడు.

'బోడి ఉద్యోగం! నువ్వు గూడా రిజైన్ చెయ్యి సుబ్బూ! కాంట్రాక్టులు చేద్దాం' అన్నాడు కిరణ్‌రావు.

'కాంట్రాక్టులు చేద్దామా? మనం గెటాన్ అవుతామా?' అని సందేహం వెలిబు చ్చాడు సుబ్బారావు.

'కాంట్రాక్టులంటే గవర్నమెంట్ వర్క్సు మాత్రమేనా? బోలెడు ప్రైవేట్ వర్క్సు వుంటాయి. మనమే రియల్ ఎస్టేట్




# స్వాతంత్ర్యానికి హద్దు!



ఒక ఆంగ్లేయ పౌరుడు మంచు పడుతున్న సమయంలో రోడ్డుమీద నడుస్తూ చేతికర్ర తిప్పు కుంటూ విలాసంగా నడుస్తున్నాడు.

వెనుకనే నడిచి వస్తున్న జార్జి బెర్నార్డ్‌షా అతడిని ఆపి 'ఎందుకు చేతికర్ర అలా తిప్పుతావు?' అని అడిగాడు.

'నేను స్వతంత్రుడను. నా ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించడానికి నాకు స్వేచ్ఛ ఉంది' అన్నాడు పౌరుడు.

వెంటనే షా 'జ్ఞాపకం ఉంచుకో. నా ముక్కు ప్రారంభమయ్యే చోట నీ స్వాతంత్ర్యం అంతమవుతుంది' అన్నాడు.

## శాస్త్రవేత్త సరళత్వం!



ఆల్బర్ట్ ఐన్‌స్టీన్‌కి పారిస్‌లో సోర్బాన్ యూనివర్సిటీ డిగ్రీని ఇచ్చి గౌరవించింది. మరునాడు అతని బంధువు ఒకడు చిన్న హోటల్‌లో దిగిన ఐన్‌స్టీన్‌కు ఫోన్ చేశాడు.

'నేను ప్రొఫెసర్ ఐన్‌స్టీన్‌తో మాట్లాడాలి' అన్నాడు హోటల్ మేనేజర్‌తో.

దానికి 'ఇక్కడ ప్రొఫెసర్ ఐన్‌స్టీన్ లేడు' అని జవాబు వచ్చింది.

'లేదు అక్కడే ఉన్నాడు. నేను నిన్న అక్కడికి వచ్చాను' అని అతను అన్నాడు.

'నీవు ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ సుప్రసిద్ధ వైజ్ఞానికుడి గురించి మాట్లాడుతున్నావా?' అని హోటల్ మేనేజర్ ఆశ్చర్యంతో అడిగాడు.

తర్వాత కాస్త తేరుకుని 'ఇక్కడ ఐన్‌స్టీన్ అని ఒకతను ఉన్నాడు. అతడ్ని నేను ట్రావెలింగ్ సేల్స్‌మెన్ అనుకున్నాను' అని మేనేజర్ బదులిచ్చాడు.

## టోపీ కంటే తలలు గొప్పవి!



ఒకప్పుడు అహ్మదాబాద్‌లో జరిగిన ఒక కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ మీటింగ్‌లో ఖాదీ దుస్తులు ధరించి ఉన్న సభ్యులనుద్దేశించి మాట్లాడుతూ జవహర్‌లాల్ నెహ్రూ ఇలా అన్నారు. 'ఖాదీ టోపీ అంటే నాకు గౌరవమే! అయితే ఖాదీ టోపీ కంటే దానిని ధరించే తల మరింత ముఖ్యం. ఆ టోపీ ధరించే వారందరూ స్వయంగా ఆలోచించగలవారయి ఉండాలి'.

## సంతోషానికి కారణం!



మర్నాడు పార్లమెంటులో చేయవలసిన ఉపన్యాసాన్ని ప్రసిద్ధ ఆంగ్ల రాజకీయవేత్త, బ్రిటన్ ప్రధానమంత్రి విలియం గ్లాడ్‌స్టన్ సిద్ధం చేసుకుంటున్నాడు. అయితే తను చేస్తున్న రాతపనిని మధ్యలోనే ఆపి వేసి, మరణోన్ముఖంగా ఉన్న ఒక బాలుడిని చూసేందుకు వెళ్లాడు. అక్కడి నుంచి తిరిగొచ్చిన తర్వాత మళ్లీ తన రాతపని ప్రారంభిస్తూ, "ఈ ఉపన్యాసం విజయం పొందనీ, పొందకపోనీ నాకే చింత లేదు. ఎందుకంటే నేనొక జబ్బుపడ్డ బాలుడిని పరామర్శించి, తను పడుతున్న బాధనుంచి కాస్తయినా మనశ్శాంతి కలిగించేందుకు ప్రయత్నించడం ద్వారా అమితానందాన్ని అనుభవించాను" అన్నాడు.

సేకరణ : ఎ. రాంబాబు

కంపెనీ ప్రారంభిద్దాం. మనకేం తక్కువ?' అన్నాడు కిరణ్‌రావు.

అతను బాగా స్థితిమంతుడు గూడా! అందుకే ఉద్యోగాన్ని లెక్కచేయకుండా ఎడమకాలితో తన్నేశాడు.

సుబ్బారావు డైలమాలో పడిపోయాడు. ఎంతకాలం ఉద్యోగం చేసినా తను డబ్బు సంపాదించలేడు. ఏదైనా చేయాల్సిందే! కాని కలిసిరాకపోతే?

'బోడి మేస్త్రీగాళ్ళు మన కళ్లముందు కాంట్రాక్టర్లుగా అవతారమెత్తి కోట్లు కూడబెట్టుకుంటున్నారు. రాళ్ళు కొట్టుకునేవాళ్ళు, తట్టలు మోసినవాళ్ళు, అక్షరం ముక్కరాని నిరక్షరకుక్షులు గుత్తేదార్లయిపోయి మన మీద పెత్తనం చేస్తున్నారు. రాజకీయనాయకుల అవతారాలెత్తుతున్నారు. మనమేనా వెర్రోళ్లం?' అన్నాడు కిరణ్‌రావు.

'నిజమే కిరణ్! ఏం చెయ్యాలన్నా పెట్టుబడి ఉండాలిగా?' అన్నాడు సుబ్బారావు.

కిరణ్ నవ్వాడు 'వ్యాపారం చేయదల్చుకున్నవాడికి పెట్టుబడి లేకపోవడం సమస్యే కాదు. అదే వస్తుంది. నేను చూసుకుంటాగా? నీకు అంతగా భయమైతే, నువ్వు సెలవుపెట్టి నాతో వుండు. పార్ట్‌నర్‌షిప్ మీ ఆవిడ పేరుతో వుంటుంది. ఏం?' అన్నాడు.

కిరణ్‌రావు చెప్పింది బాగానే వుందనుకున్నాడు. ఉద్యోగానికి సెలవు పెట్టాడు. హేమలత బంగారాన్ని బ్యాంక్‌లో తాకట్టు పెట్టాడు. మరికొంత మొత్తాన్ని ప్రామిసరీ నోటు మీద ఒక ఫైనాన్స్ కంపెనీలో కిరణ్‌రావు అప్పు ఇప్పించాడు. ఇద్దరూ పార్ట్‌నర్స్‌గా కంపెనీ మొదలు పెట్టారు.

సుబ్బారావు ఆఫీసువర్క్, కిరణ్‌రావు ఫీల్డులో కష్టపడి పని చేశారు. హైదరాబాద్‌లోని ప్రముఖ కంపెనీల్లో ఒకటిగా వారిది పేరు పొందింది. ప్రస్తుతం తమ కంపెనీ కోట్ల రూపాయల టర్నోవర్‌తో నడుస్తోంది.

ఇప్పుడు సుబ్బారావుకి జూబ్లీహిల్స్‌లో ఇండిపెండెంట్ బంగ్లా వుంది. హేమలతకు మొయ్యలేనంత బంగారం, ఇంటిల్లిపాదికీ కార్లు, నౌకర్లు. ఐశ్వర్యం తాండవిస్తోంది. కానీ వారికి లేనిదల్లా మనశ్శాంతి, తృప్తి.

హేమలత సైకియాట్రిస్ట్‌కి రాసిన లెటర్ పేపర్లో యాదృచ్ఛికంగా చదివిన సుబ్బారావులో ఆత్మ పరిశీలన మొదలైంది. హేమలత తనను సైకోపేషెంట్ అనుకొంటోందా? ఇంటిబాధ్యత ఆమెకు వదిలి, తాను డబ్బు సంపాదించడంలో మునిగిపోవడం తప్పా?

★ ★ ★

సుబ్బారావు తొమ్మిదింటికే ఇంటి నుంచి బయల్దేరి ఆఫీసుకి వెళ్లిపోతాడు. అప్పుడు పిల్లలు తమగదుల్లో నుంచి వచ్చి హడావుడి చేస్తారు. వాళ్ళు తండ్రి ఎదుట పడటం గూడా అరుదు.

డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్న మహేశ్వర్ దోశెలు తింటూ చట్నీలో ఉప్పు తక్కువైందని అలిగి వెళ్లిపోయాడు. హేమలత వాడిని బతిమాలి తీసుకొచ్చింది. చట్నీలో సరిగా ఉప్పు వేయనందుకు వంటామెను కోప్పడింది.

## కొత్తగాలి...

**ఎసెమ్మెస్, ట్విట్టర్లు**
**జోరందుకుంటుంటే**
**కనుమరుగయ్యే బాటలో**
**బక్కచిక్కిన పోస్టుకార్డు!**

– బి.వి. నరసింహారావు,
చీరాల, ప్రకాశం జిల్లా

"అయ్యగారు ఉప్పు తక్కువగా వెయ్య మంటారమ్మా!" వంటామె సంజాయిషీ ఇచ్చుకుంది.

"అయ్యగారికి వేరే డిష్‌లో ఉప్పు తక్కువ వేసి ఉంచు. ఉప్పు తక్కువైతే పిల్లలు ఎట్లా తింటారు?" హేమలత కొడుకుని వెనకేసుకొచ్చింది.

చిన్న కొడుకు కార్తీక్ తనకి ఆకలిగా లేదని వెళ్లిపోతుంటే, మహేశ్వర్ కామెంట్ చేశాడు.

"వీడు రాత్రి ఏ పార్టీకో వెళ్లి బాగా మెక్కివుంటాడు మమ్మీ! వీడు రాత్రి ఎన్నింటికి ఇంటికొచ్చాడో తెలుసా? పన్నెండైంది. ఇక ఏం అరుగుతుంది? ఆకలి లేదని పెద్దపోజు!"

"పార్టీలకెళ్లేది నేనేనా? నువ్వు వెళ్లడం లేదా? అయినా నా ఫ్రెండ్స్ పార్టీలకి వెళ్తాను. వద్దనడానికి నువ్వెవడివి?" అంటూ అన్నమీద విరుచుకుపడ్డాడు కార్తీక్.

"ఎందుకురా అట్లా పోట్లాడుకుని చస్తారు?" విసుక్కుంది హేమలత.

స్వాతి డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని డిష్‌లన్నీ తెరిచి చూసింది. ముఖం చిరాగ్గా పెట్టింది.

"ఇడ్లీ, దోశ, వడ! ఛీ.. రోజూ ఇవేనా? తినబుద్ధి కావడంలేదు" అన్నది.

"ఇంకేం తింటావే? చద్దన్నం తింటావా ..పెరుగు వేసుకుని, మామిడికాయ పచ్చడి నంజుకుని? ఎంతో బాగుంటుంది. మేం చిన్నప్పుడు రోజూ అట్లాగే తినేవాళ్ళం" అన్నది హేమలత.

"నువ్వు భలే చెప్తావమ్మా? చద్దన్నం తినడానికి మనమేమన్నా లేబరోళ్ళమా? మనకేం ఖర్మ?" అంది స్వాతి ముఖంచిట్లించి.

"సరే.. సరే.. నీతో వాగలేను గాని, ఏం కావాలో చెప్పి ఏడువు? ముందే చెప్తే వంటామె రెడీ చేసేది గదా? ఇప్పటికిప్పుడు ఏం చేస్తుంది!"

"అవన్నీ వంటామె చేసేవి కావులే!" అని అక్కడ్నుంచి లేచివెళ్ళి సెల్‌తీసి మాట్లాడింది.

"ఏం తినకుండా పోతావటే కాలేజీకి?" అన్నది హేమలత బాధగా.

"పిజ్జాకి ఆర్డర్ ఇచ్చాలే మమ్మీ!" అని హాల్లోకి వెళ్లి టీవీ రిమోట్ అందుకుంది.

"పొద్దున్నే పిజ్జా ఏంటే? పాడు అలవాటు! ఇప్పటికే కొవ్వెక్కి చస్తున్నావు" అని సణుక్కుంటూ వెళ్ళింది హేమలత.

ఆ రాత్రి తొమ్మిది దాటినా పెద్దకొడుకు మహేశ్వర్ ఇంటికి రాలేదు. హేమలత వాడి సెల్‌కి కాల్ చేసింది.

"మా ఫ్రెండ్ బర్త్‌డే పార్టీ మమ్మీ! లేటుగా వస్తాను" అన్నాడు.

"ఆ సంగతి ఫోన్ చేసి చెప్పొచ్చుగా? డిన్నర్‌కు రాలేదని వంటామె చెప్పేవరకు నాకే సంగతి తెలిసి చావడం లేదు" అన్నది విసుక్కుంటూ.

"సారీ మమ్మీ!" అని కాల్ కట్ చేశాడు మహేశ్వర్.

"ఏం పార్టీలో ఏంటో! అర్థమై చావడం లేదు" గొణుక్కుంటూ బెడ్‌రూమ్‌లోకి వెళ్లిపోయింది.

అయితే రాత్రి ఇంటికి రాలేదు మహేశ్వర్. ఆ సంగతి మర్నాడు ఉదయంగాని హేమలతకు తెలియలేదు. సెల్‌కి ఫోన్ చేస్తే లైన్ కలవడం లేదు. సెల్ స్విచ్ఛాఫ్ చేసి ఉందనో, సబ్‌స్క్రయిబర్ కవరేజి ఏరియాలో లేడనో, కాల్ రిసీవ్ చేసుకోవడం లేదనో రికార్డెడ్ మెసేజ్‌లు వస్తున్నాయి. 'పార్టీకి వెళ్లినవాడు రాత్రంతా ఇంటికి రాకుండా ఎక్కడున్నాడు?' అని హేమలతకు కంగారు ఎక్కువైంది.

హాల్లో కూర్చుని సుబ్బారావు కాఫీ తాగుతూ టీవీలో న్యూస్ చూస్తున్నాడు. హేమలత హడావుడిగా భర్త దగ్గరికి వెళ్లి

సోఫాలో అతని పక్కనే కూర్చుంది. భార్య ముఖంలో ఆందోళన గమనించాడు. కాని ఏమీ మాట్లాడలేదు. ముభావంగా కాఫీ తాగుతున్నాడు.

"ఏమండీ...!"

"ఊఁ..."

"మహేశ్వర్ రాత్రి ఇంటికి రాలేదండీ. సెల్‌కి కాల్ చేస్తుంటే లైన్ కలవడం లేదు" ఆదుర్దాతో అన్నది.

సుబ్బారావు సీరియస్‌గా భార్యవైపు చూశాడు.

"నీకు తెలియదన్నమాట" అన్నాడు.

"ఏంటండీ?"

"నీ కొడుకు ఎడ్వెంచర్?"

"అదేంటండీ?"

"న్యూస్‌లో చూపిస్తున్నారు, చూడు" అన్నాడు టీవీవైపు చెయ్యి చాచి.

'మంత్రిగారి కొడుకు ఫ్రెండ్ బర్త్‌డే పార్టీకి శివారులోని రిసార్ట్‌కి వెళ్లి వస్తూ అర్ధరాత్రి ఆగివున్న కారుకి, తన కారుతో ఢీకొట్టాడు. కారులో ఉన్నవాళ్ళు నిలదీస్తే వారిపైకి గన్‌తో కాల్పులు జరిపి పారిపోతుంటే పోలీసులు పట్టుకున్నారు. అతనితోపాటు ఉన్న మరో ముగ్గురు యువకులను కూడా పోలీస్‌స్టేషన్‌కి తరలించారు. కాల్పులు జరిపిన సమయంలో వారంతా మద్యం మత్తులో ఉన్నట్లు తెలుస్తోంది'

హేమలత ముఖం తెల్లగా పాలిపోయింది ఆ న్యూస్ చూస్తూనే. ఆమెకు దుఃఖం ముంచుకొచ్చింది. పళ్ళ బిగువున ఏడుపు ఆపుకుంది. కన్నీళ్లు మాత్రం ఆగడం లేదు. చీర చెంగుతో తుడుచుకుంటూ ఉంది.

"ఏమండీ!" అన్నది బొంగురుపోయిన కంఠంతో.

"ఊఁ..." అన్నాడు సుబ్బారావు

"ఇప్పుడెలా?" అన్నది ఆందోళన వ్యక్తం చేస్తూ.

"ఏమిటి ఎలా?"

"అదేనండీ! మహేశ్వర్‌ని పోలీసులు స్టేషన్లో పెట్టారు గదా!"

"ఐతే! నన్నేం చెయ్యమంటావ్?" కోపంగానే అన్నాడు.

"అదేం మాటండీ? కొడుకుని పోలీసులు స్టేషన్‌లో పెడితే తండ్రి అనవలసిన మాటేనా అది? మీరేం పట్టించుకోరా?"

"ఇంటి సంగతులేం పట్టించుకోవడం లేదని నువ్వు పేపర్లో టాం.. టాం.. చేశావుగా? నేనిక పట్టించుకునేది ఏంటి?"

"అయ్యో రామ! నేను పేపర్లో టాంటాం చెయ్యడమేమిటండీ? ఎవరన్నారామాట?" విస్తుపోతూ అన్నది హేమలత.

"ఎవరు అనడం ఏమిటి? నాకు తెలియదనుకున్నావా? నువ్వు సైకాలజీ ప్రొఫెసర్‌కి రాసిన లెటర్ నేను చూళ్లేదనుకున్నావా? అసలు నువ్వేమనుకుంటున్నావు నా గురించి? నాకు పిచ్చెక్కిందనుకుంటున్నావా? వాడెవడికో లెటర్ రాసి సలహాలు అడగడం ఏమిటి?" మండిపడ్డాడు సుబ్బారావు.

నిర్ఘాంతపోయింది హేమలత. తను సైకాలజీ ప్రొఫెసర్‌ని సలహా కోరడం భర్తకు తెలుస్తుందని ఆమె ఊహించలేదు. 'అయితే ఆయన అదంతా చదివాడన్నమాట' అనుకుంది.

"అదేదో సరదాగా రాసిందండీ" అన్నది తల వంచుకుని.

"నేను ఇంటి సంగతులేవీ పట్టించుకోవడం లేదని, ఊరందరికీ తెలియాలని గదా నువ్వు రాసింది. అదంతా సరదానా? అయినా నీకు ఏం లోటు జరిగిందని పేపరుకి ఎక్కావు? నేను ఫ్యామిలీ కోసం రోజంతా ఎంత కష్టపడుతున్నాను? నువ్వు ఆ మాత్రం ఇల్లు మానేజ్ చేసుకోలేవా? మరీ అంత కష్టమైన పనా?"

హేమలత మౌనంగా వుండిపోయింది.

"అసలు పిల్లలు ఎవడేం చేస్తున్నాడో నువ్వెందుకు పట్టించుకోవడంలేదు? వాడు రాత్రంతా ఇంటికి రాకపోతే ఏం చేస్తున్నావు?" నిలదీశాడు సుబ్బారావు.

"నేనేం పట్టించుకోనండీ? వాళ్ళేం పసిపిల్లలా? నా అంత ఎదిగారు. అడ్డాలనాడు బిడ్డలుకాని, గడ్డాలనాడు కాదన్నారు. అసలు నన్నంటారేంటి? మీరేం పట్టించుకుంటున్నారు?" రోషంతో అందామె.

"నేను బైటకెళ్ళి డబ్బు సంపాదించుకుని రావటంలా? మీకు ఏ లోటూ వుండగూడదని గదా నేను నానా గడ్డి తిని సంపాదిస్తున్నది? ఎవడెవడు ఏం చేస్తున్నాడో పట్టించుకుని తిరిగితే బైట పనులు ఏమవుతాయి?"

"సంపాదించటానికి హద్దుల్లేవా? ఇరవై నాలుగు గంటలూ సంపాదన మీద ధ్యాసేనా? ఐతే ఇంట్లో పెళ్ళాం పిల్లలు ఏమైపోతున్నారో మీకు అక్కర్లేదన్నమాట. సంసారానికి ఎంత డబ్బు కావాలండీ? ఎన్ని కోట్లు సంపాదిస్తే తృప్తి కలుగుతుంది? ఇంతకంటే వుద్యోగం చేస్తున్నప్పుడే హాయిగా వుండేది" గట్టిగా అన్నది హేమలత.

"బాగుంది. ఐతే డబ్బు సంపాదించడమే నా తప్పన్నమాట? చాలీచాలని జీతంతో రోజులు గడిపినప్పుడే బాగుందన్నమాట నీకు? అప్పుడేమో ఉద్యోగం చేసి ఏం సంపాదిస్తున్నావు? అని మీ నాన్న నిలదీసేవాడు. ఇప్పుడేమో డబ్బు సంపాదించడమే నా తప్పన్నట్లు మాట్లాడుతున్నావు నువ్వు. చాలా బాగుంది. బాగా బుద్ధి చెప్పావు. నిజమే డబ్బు సంపాదించడం నాది తప్పే. చెంపలు వేసుకుంటున్నాను" సుబ్బారావు ఆగ్రహంతో వూగిపోతూ, అక్కడ్నుంచి లేచి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి దడాలుమని విసురుగా తలుపు మూశాడు.

"అందరూ నన్నే అనండి. నాదే తప్పు!"



## భలే భలే!

అమెరికన్ ప్రొఫెసర్, రచయిత్రి అయిన జాయిస్ కారల్ ఓట్స్ ప్రతిరోజూ అల్పాహారానికి ముందు 45 నిమిషాల పాటు రాసుకుంటుంది. ఆమె మనసు ప్రశాంతంగా ఉండి రచన బాగా సాగుతుంటే అల్పాహారం కూడా తీసుకోకుండా మధ్యాహ్నం రెండు, మూడింటి వరకూ అలా రాసుకుంటూనే ఉంటుందట!

అనుకుంటూ హేమలత గూడా అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

సుబ్బారావు స్నానం చేసి డ్రెస్ చేసుకుని టిఫిన్ తినకుండా వెళ్ళిపోయాడు. తల్లీ తండ్రి కేకలు వేసుకోవటం గమనించి కార్తీక్, స్వాతి తమ గదుల్లోనే వుండిపోయారు. పనివాళ్ళు ఎవరిపని వారు సీరియస్‌గా చేసుకుంటున్నారు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

★ ★ ★

డైనింగ్‌రూమ్‌లో హేమలత విచారంగా కూర్చుని వుంది. సరదాగా తను సైకాలజీ ప్రొఫెసర్‌కి భర్త గురించి రాసింది. అది తమ మధ్య మనస్పర్థలు సృష్టిస్తుందని కలలో గూడా అనుకోలేదు. ఆ విషయం ఆయనంత సీరియస్‌గా ఎందుకు తీసుకుంటున్నాడో అర్థం కావడంలేదు. అందులో తను రాసింది ఏమంత తప్పు విషయం? జరుగుతున్న సంగతులేకదా తను రాసింది. అందుకే అన్నారు నిజం నిష్ఠూరంగా వుంటుందని. దాన్ని మనసులో పెట్టుకునే కాబోలు తను ముభావంగా వ్యవహరిస్తున్నాడు. తను ఇంకా ఏదో వ్యాపారంలో గొడవల వలన అలా వుంటున్నాడనుకుంది. దానికితోడు మహేశ్వర్ పోలీస్ కేసులో ఇరుక్కోవడం తమ మధ్య అగాధం సృష్టించింది.

ప్రశాంతంగా జరిగిపోతున్న సంసారంలో చిచ్చు లేచిందేమిటి? ఇది ఎక్కడికి దారితీ స్తుందో?

కొడుకు పోలీస్‌స్టేషన్లో ఉన్నాడని తెలిసినా ఆయన చలించకుండా నిర్లిప్తంగా వుండడం తనను ఎంత బాధించింది. ఏదో ఒక మామూలు వార్తలా చూసి వదిలేశాడు. పాపం వాడు పోలీస్‌స్టేషన్‌లో ఎంత క్షోభ అనుభవిస్తున్నాడో? హేమలతలోని తల్లి హృదయం తల్లడిల్లిపోతోంది. తను ఇప్పుడు ఏం చేయాలి? ఎవర్నయినా లాయర్ని సంప్రదించి వాడిని పోలీస్‌స్టేషన్ నుంచి బెయిల్ మీద విడి

> **కొత్తగాలి...**
>
> **గింజ గింజపై**
> **తినేవాడి పేరు కాదు**
> **పండించిన**
> **రైతు పేరే ఉంటుంది!**
>
> *- కందాళై రాఘవాచార్య,*
> *నిజామాబాద్*

పిస్తేనో? కాని ఆయన ఏమనుకుంటాడో?

ఒకవేళ ఆయనే పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళి వాడిని విడిపించే ప్రయత్నం చేస్తున్నాడేమో?

హేమలత మనసు అల్లకల్లోలంగా వుంది.

సుబ్బారావు వెళ్ళిపోయిన తర్వాత కార్తీక్, స్వాతి బైటకు వచ్చారు. తల్లి అంత విచారంగా వుండడం వాళ్లెప్పుడూ చూళ్ళేదు. మహేశ్వర్ పోలీసులకు చిక్కడంతో వాళ్ళకి కూడా మనసులో బాధగా వుంది. ఇద్దరూ డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని మౌనంగా టిఫిన్ చేస్తున్నారు.

"మమ్మీ!.." పలకరించాడు కార్తీక్.

హేమలత కార్తీక్ వైపు చూసింది.

"కిరణ్ అంకుల్‌కి ఫోన్ చేస్తే?" అన్నాడు.

"కిరణ్ అంకుల్‌కా?" అన్నది.

"ఔను మమ్మీ! అంకుల్‌కి చాలామంది ఆఫీసర్లు, లాయర్లు తెలుసు. అన్నయ్యను పోలీస్‌స్టేషన్ నుంచి రిలీజ్ చేయిస్తాడు" చెప్పాడు కార్తీక్.

"డాడీకి మాత్రం ఆఫీసర్లు, లాయర్లు తెలీదా?" అన్నది స్వాతి.

"తెలియదని ఎవరన్నారు? డాడీ కోపంగా వున్నారుగా? అందుకని ఇంటర్‌ఫియర్ కారు" అన్నాడు కార్తీక్.

చిన్నకొడుకు చెప్పింది బాగానే వుందనిపించింది హేమలతకు.

"సరేరా! అంకుల్‌కి ఫోన్ చెయ్యి" అన్నది.

కిరణ్‌రావు లైన్లోకి వచ్చాక కార్తీక్ సెల్‌ఫోన్ తల్లికి ఇచ్చాడు. హేమలత జరిగిందంతా వివరంగా చెప్పింది.

"అన్నయ్యా! ఆయన కోపంగా వున్నారు. మహేశ్వర్ సంగతి పట్టించుకునేట్లు లేరు. మీరెళ్ళి వాడిని బైటపడేయండి. పాపం వాడెంత వర్రీ అవుతున్నాడో" అన్నది.

"అమ్మాయ్! నువ్వెందుకు బెంగ పడుతున్నావ్? అక్కడ వాడినేం చెయ్యరు. ఎందుకంటే మంత్రి కొడుకు వున్నాడుగా? కంప్లైంట్ చేసినవాళ్ళు ఏడ్చిపోతారని, వీళ్ళని అరెస్ట్ చేసినట్లు నాటకం ఆడతారు. నీకు అవన్నీ తెలియదులే. నువ్వు చూస్తుండు, మంత్రి జోక్యం చేసుకుని అందర్నీ విడిపిస్తాడు. కాసేపటికి మహేశ్వర్ ఇంటికి వచ్చేస్తాడు. నువ్వేం బాధపడకు. వాడికేం కాదు" చెప్పాడు కిరణ్‌రావు.

"అది కాదన్నయ్యా! గన్‌తో కాల్పులు జరిపారని చెప్తున్నారు న్యూస్‌లో. వాళ్ళ

సీరియస్‌గా తీసుకుని కేసు బుక్ చేసి కోర్టుకి పంపిస్తారేమోనని భయంగా వుంది" హేమలత గొంతు బాధతో వణుకుతోంది.

"నీకు తెలియదమ్మా! మామూలు వాళ్ళకైతే నువ్వు అన్నట్లు కేసు బుక్ చేసి కోర్టుకి పంపిస్తారు. ఇందులో వున్నది మంత్రి కొడుకు. పోలీసులు వి.ఐ.పి. ట్రీట్‌మెంట్ ఇస్తారు. స్టేషన్‌లో కూర్చోబెట్టి బిర్యానీలు తినిపించి, కూల్‌డ్రింకులు తాగిస్తారు. నువ్వు స్థిమితంగా వుండు. ఈపాటికి వాడు రిలీజై వుంటాడు గూడా. ఇంకొక గంటలో వాడు ఇంటికి రాకపోతే, అప్పుడు నాకు కాల్ చెయ్యి. సరేనా?" అన్నాడు కిరణ్‌రావు.

హేమలత ఇక ఏమనలేకపోయింది. కిరణ్‌రావు అంత భరోసా యిస్తున్నప్పుడు ఇక ఒత్తిడి చేయడం బాగోదని వూరుకుంది.

కిరణ్‌రావుకి మళ్ళీ ఫోన్ చేయాల్సిన అవసరం కలగలేదు. పోర్టికోలో ఆగిన కారులోనుంచి మహేశ్వర్ దిగి దర్జాగా ఇంట్లోకి వచ్చాడు.

మహేశ్వర్ మామూలుగా వున్నాడు. తప్పుచేసిన భావమేదీ అతని ముఖంలో కనిపించడం లేదు. తల్లిని, తమ్ముడ్ని, చెల్లెల్ని చూసి పలకరింపుగా నవ్వాడు.

"ఏం జరిగిందిరా మహేష్?" అని అడిగింది హేమలత.

"ఏం లేదమ్మా.. మేం పార్టీ నుంచి వస్తుంటే, ముందువెళ్తున్న కారువాడు సడెన్ బ్రేక్ వేసి ఆగాడు. మా కారు వెళ్ళి గుద్దింది. అంతే. అంతకంటే ఏం లేదు. అందులో ఎవరో రౌడీ వెధవలున్నారు. కారు దిగొచ్చి మమ్మల్ని బూతులు తిట్టారు. అసలు తప్పు వాళ్లదే. మా ప్రతాప్‌కి కోపం వచ్చి ఎదురు తిరిగాడు. వాళ్ళు కొట్టబోతుంటే, ప్రతాప్ గన్‌తో గాలిలోకి షూట్ చేశాడు, అంతే. వాళ్ళ మీద షూట్ చేయలేదు. వాళ్ళు భయపడి పోలీసులకు కంప్లైంట్ చేశారు. పెట్రోలింగ్ చేస్తున్న ఇన్‌స్పెక్టర్ చాదస్తుడిలా వున్నాడు. ప్రతాప్ మినిస్టర్‌గారబ్బాయని చెప్తున్నా వినకుండా మా దగ్గర సెల్‌ఫోన్లు లాక్కుని, స్విచ్చాఫ్ చేశాడు. మమ్మల్ని స్టేషన్‌కి తీసుకుపోయి కూర్చోబెట్టాడు అంతే. అంతకంటే ఏం జరగలేదు. ఇందాక మినిస్టర్‌గారి పి.ఎ. వచ్చి మాట్లాడితే వదిలేశారు" చెప్పాడు మహేశ్వర్.

"బాగానే వుందిలేరా మీ నిర్వాకం. అర్ధరాత్రి దాకా ఆ పార్టీలేంటి? తాగి తందనాలేంటి? చదువుకునే వయసులో వెర్రిమొర్రి చేష్టలు చేస్తుంటే ఎలా? మీకు బాగుపడే లక్షణాలు కనిపించడం లేదు. మీ డాడీ ఏమో ఏం పట్టించుకోడు. ఏదైనా జరిగితే నన్ను అంటాడు. నేనేం చేసేది? మీరు నా మాట వింటున్నారా?" గట్టిగా కేకలు వేసింది హేమలత.

మహేశ్వర్ ఏం మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళి తలుపు మూసుకున్నాడు.

కార్తీక్, స్వాతి అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోయారు.

హేమలత సణుగుతూనే వుంది.

మర్నాడు మంత్రి కొడుకు జరిపిన కాల్పుల గురించి పోలీస్ కమీషనర్‌ని ప్రశ్నించారు విలేఖరులు.

"అది చిన్న సంఘటన. మంత్రిగారి అబ్బాయి కారు, ముందు వెళ్తున్న కారుకి తగిలింది. ముందుకారు వాళ్ళదే తప్పు. వాళ్ళు సడన్ బ్రేక్ వేశారు. పైగా మంత్రిగారబ్బాయి, అతని ఫ్రెండ్స్‌ని దూషించారు. కొట్టబోయారు. తర్వాత కాంప్రమైజ్ అయ్యారు" అన్నాడు కమీషనర్.

"మంత్రిగారి కొడుకు గన్‌తో కాల్పులు జరిపారని న్యూస్‌లో వచ్చిందిగా?"

"నిజమే. కానీ ఆ గన్ నిజమైంది కాదు.

బొమ్మ పిస్తోలు. తమని కొట్టవచ్చిన వారిని బెదిరించడానికి షూట్ చేశాడు. టాయ్ గన్‌తో ఏం ప్రమాదం జరగలేదు. అది సిల్లీ థింగ్" అన్నాడు పోలీస్ కమీషనర్.

కేసు సద్దుమణిగింది. పోలీస్ కమీషనర్ వివరణ న్యూస్‌లో టెలికాస్ట్ అయింది. పేపర్లలో అచ్చయింది.

హేమలత ఊపిరి పీల్చుకుంది. కిరణ్‌రావు చెప్పినట్లు వి.ఐ.పి.ల పిల్లలకు ఏం కాదనే సత్యం ఆమెకు బోధపడింది.

★ ★ ★

ట్రాఫిక్‌జామ్ అయితే విసుగ్గా కార్లోనే కూర్చున్నారు కిరణ్‌రావు, సుబ్బారావు. ఎంతకీ ట్రాఫిక్ క్లియర్ కావడంలేదు. వీఐపీలు వస్తున్నారని ట్రాఫిక్ ఆపేశారని తెలిసింది.

"రోడ్డు మీదకు రావాలంటేనే విసుగ్గా వుంది. ఈ ట్రాఫిక్ కష్టాలు ఎప్పటికి తీరతాయో? " అన్నాడు కిరణ్‌రావు.

"మెట్రో రైలు వచ్చాక తీరతాయేమో? " అని నవ్వాడు సుబ్బారావు.

"ఏమో? ఏం చెప్పగలం? జనం ఇంకా పెరిగి కొత్త కష్టాలు పుట్టుకొస్తాయేమో? " అని సందేహం వెలిబుచ్చాడు కిరణ్‌రావు.

"అసలు ఈ వీఐపీలు హెలికాప్టర్స్‌లో పోవచ్చుగా? ఎందుకు రోడ్లమీద కార్లలో తిరుగుతున్నారు? జనాన్ని హింసపెట్టక పోతే? " అన్నాడు సుబ్బారావు.

"పాయింటే" అంటూ కిరణ్‌రావు కారు విండోలో నుంచి దూరంగా కనిపిస్తున్న బిల్డింగ్ వైపు చూశాడు.

"సుబ్బూ! అటు చూడు. అక్కడ బాల్కనీలో నిల్చున్న అమ్మాయి మన స్వాతి కదూ!" అన్నాడు.

సుబ్బారావు అటువైపు చూశాడు. అతని భ్రుకుటి ముడిపడింది.

అప్పుడు టైమ్ సాయంకాలం ఆరు దాటింది. ఇక్కడెందుకు వుంది. కాలేజీ వదిలాక ఇంటికి ఎందుకు వెళ్ళలేదు?

"ఔను, స్వాతే" అన్నాడు సుబ్బారావు.

"కాల్ చెయ్యి. అక్కడెందుకు వుందో అడుగు" అన్నాడు కిరణ్‌రావు.

"సార్! అది యాక్టింగ్ కాలేజి. అందులో పాప డ్యాన్స్ నేర్చుకుంటున్నది" అన్నాడు డ్రైవర్ జానీ.

సుబ్బారావుకి ఆశ్చర్యం కలిగింది. ఇంటర్ చదువుతున్న పిల్ల డ్యాన్స్ నేర్చుకోవడం ఏమిటి? ఫైనల్ ఇయర్ కదా? సీరియస్‌గా కోర్స్ చదువుకోవలసిన టైమ్‌లో మళ్ళీ ఇదంతా నేర్చుకోవడానికి టైమ్ వేస్ట్ చేయడం ఎందుకు? ఐనా డ్యాన్స్ నేర్చుకోవడం ఎందుకు? సుబ్బారావుకి ఆశ్చర్యంతోపాటు సిగ్గు గూడా కలిగింది. తన పిల్లల సంగతి తనకంటే బైట వాళ్ళకే బాగా తెలుస్తున్నది. తనతో మాట మాత్రం చెప్పకుండా డ్యాన్స్ నేర్చుకోవడం ఏమిటి? ఈ సంగతి హేమలతకు తెలుసా?

సుబ్బారావు మౌనంగా వుండిపోయాడు. ఆ బిల్డింగ్‌లో ఎందుకు వున్నదో డ్రైవర్ చెప్పాడు గనక ఇక కూతురికి కాల్ చెయ్యదల్చుకోలేదు. అతని మనసు మాత్రం కుతకుత వుడుకుతోంది.

అతను ఇంటికి వెళ్ళేటప్పటికీ రాత్రి ఎనిమిదైంది. హాల్లో కూర్చుని "సీతా! స్వాతిని పిలువు" అన్నాడు పనిపిల్లతో.

"ఇంకా ఇంటికి రాలేదయ్యా!" అన్నది సీత.

అతను డ్రెస్ గూడా ఛేంజ్ చేసుకోకుండా అక్కడే కూర్చుని టీవీలో న్యూస్ ఛానల్ చూస్తున్నాడు. హేమలత దూరం నుంచి భర్తను చూసింది. ఆయన ఎందుకు సీరియస్‌గా వున్నాడో అర్థం కాలేదు. చాలా రోజుల్నుంచి ఆమెతో ముభావంగా వుంటున్నాడు. అవసరానికి

# కొత్తరకం ఆయుధాలకు నాంది!

రెండో ప్రపంచ యుద్ధం వల్ల దాదాపు ప్రతి దేశం ప్రభావితమైంది. ఆ సమయంలో అభివృద్ధి చేసిన తుపాకులవల్ల ఎక్కువ మరణాలు సంభవించాయి. ఆ యుద్ధ ప్రారంభ సమయంలో సైనికుల దగ్గర బోల్ట్ ఏక్షన్ రైఫిల్స్ మాత్రమే ఉండేవి. ఓసారి పేల్చాక సైనికుడు ఇంకో గుండును అందులో ఉంచి పేల్చాల్సి వచ్చేది. దాంతో కాల్చే వేగం తక్కువ. అప్పట్లో అమెరికా అభివృద్ధి చేసిన మొట్టమొదటి తుపాకీ యం1 గరండ్. రీలోడింగ్ సమయాన్ని ఇది బాగా తగ్గించింది. 1943 దాకా అమెరికన్ సైన్యం దీన్ని ఉపయోగించింది. మరొకటి పిపిఎస్‌హెచ్-41 తుపాకీ. 71 గుళ్లను లోడ్ చేసి వెంటవెంటనే కాల్చగల దీన్ని రష్యన్ ఆర్మీకోసం అభివృద్ధి చేశారు. మరొకటి థామ్సన్ సబ్‌మెషీన్ గన్. అప్పట్లో అనేక రకాల సబ్‌మెషీన్ గన్స్ వచ్చాయి. వాటిలో ఉన్నతస్థాయికి చెందింది ఇదే. దీని బరువు నాలుగు కిలోలు. దీన్ని కూడా అమెరికన్ సైన్యంకోసమే అభివృద్ధి చేశారు. బ్రిటిష్‌వారు అభివృద్ధి చేసిన తుపాకీ స్టెన్‌గన్. దాన్ని అమర్చడం, తిప్పడం తేలిక. సైనికులకన్నా ఇది తిరుగుబాటుదారులకు, గెరిల్లాలకు బాగా ఉపయోగపడింది. 1994దాకా ఇది వినియోగంలో ఉండేది. యంపి40 అనే మరో తుపాకీని జర్మన్ సైన్యం కోసం కనిపెట్టారు. దాన్ని పదాతి దళానికి కాక పారా ట్రూపర్స్, స్క్వాడ్ లీడర్స్‌కి మాత్రమే జారీ చేసేవారు. అమెరికన్ ఆర్మీకోసం అభివృద్ధి చేసిన మయరో తుపాకి యం1 కార్బైన్. ఇది తేలికైంది. గుండుని గమ్యానికి నమ్మకంగా చేరుస్తుంది. జర్మన్స్ అభివృద్ధి చేసిన మరో తుపాకి కార్బైనర్ 98 కె. యుద్ధానంతరం లొంగిపోయినప్పుడు జర్మన్ సైనికుల దగ్గర ఈ రకం తుపాకులే ఉన్నాయి.



తుపాకులేకాక సైనికుల ఆయుధంగా గ్రెనేడ్ కూడా ఈ యుద్ధంలో చోటు చేసుకుంది. అమెరికన్స్ గ్రెనేడ్లు అనాసపండు ఆకారంలో ఉంటే, జర్మన్లవి గొట్టాల్లా ఉండేవి.

కాబర్ కంబాట్ నైఫ్ అనే మరో ఆయుధం గోతుల్ని తవ్వేందుకు, క్యాన్లను తెరిచేందుకు, మనుషుల్ని చంపేందుకూ ఉపయోగపడేది. దీన్ని వేటగాళ్లకోసం కనిపెట్టారు. కొద్ది మార్పులతో అమెరికన్ సైన్యం వీటిని వాడింది.

అయితే నేడు ఇవన్నీ పాతబడ్డ ఆయుధాలు. ఇప్పుడు వాటికంటే ఎన్నో రెట్లు శక్తిమంతమైన అత్యాధునిక ఆయుధాలు అందుబాటులోకి వచ్చాయి.

మాట్లాడుతున్నాడు. ఆ రోజు ఇద్దరికీ ఘర్షణ జరిగినప్పటి నుంచి అతని ధోరణి మారింది.

'స్వాతి డ్యాన్స్ నేర్చుకుంటున్న సంగతి నీకు తెలుసా?' అని భార్యని అడగదల్చుకోలేదు.

అరగంట తర్వాత స్వాతి ఇంట్లోకి వచ్చింది. హాల్లోనే కూర్చుని వున్న తండ్రిని చూసి ఆగింది. ఆ సమయంలో తండ్రి ఇంట్లో వుండడం అరుదు. కూతుర్ని చూసి అతను సోఫాలో నుంచి లేచి నిల్చున్నాడు.

"స్వాతీ!" అని పిలిచాడు.

"ఏంటి డాడీ!" అంటూ దగ్గరికి వచ్చింది.

"ఇప్పుడు టైమెంత అయింది? " కూల్‌గా అడిగాడు.

స్వాతి వాచీవైపు చూసి "ఎయిట్ థర్టీ డాడీ" అన్నది భయపడుతూనే.

తను ఇంటికి వచ్చే సమయానికి తండ్రి అక్కడ ఉండడం, టైమెంత అయిందని నిలదీయడంతో స్వాతికి భయం వేసింది. గుండె దడ హెచ్చింది. తండ్రి అలా నిలదీయడం ఎప్పుడూ జరగలేదు.

"కాలేజీ ఎన్నింటికి వదుల్తారు? "

"ఫైవ్‌కి. "

"ఇప్పటిదాకా ఎక్కడున్నావ్? " కఠినంగా ప్రశ్నించాడు.

స్వాతి అయోమయంగా చూస్తోంది. ఏం చెప్పాలో తోచలేదు. తండ్రి గొంతులో మార్పు రావడంతో బిత్తరపోయింది.

"యాక్టింగ్ స్కూల్లో ఉన్నాను డాడీ..!" హీనస్వరంతో అన్నది.

"యాక్టింగ్ స్కూల్లోనా.. ఎందుకు? "

"డ్యాన్స్ నేర్చుకుంటున్నాను"

"డ్యాన్స్ నేర్చుకోవడమేమిటి? ఎవరికి చెప్పి వెళ్తున్నావు? " సీరియస్‌గా అడిగాడు.

స్వాతి తలవంచుకుంది.

"చెప్పవేం? " అంటూ చెంపమీద కొట్టాడు.

ఆ దెబ్బకి తూలి కిందపడింది స్వాతి. దూరం నుంచి అంతా చూస్తున్న హేమలత హడావుడిగా వచ్చి కూతుర్ని లేవదీసింది. స్వాతి ఏడుస్తోంది.

"ఏం జరిగిందండీ? " అన్నది భర్తతో.

"అది కాలేజీ వదిలాక ఇంటికి రాకుండా డ్యాన్స్ నేర్చుకోవడానికి వెళ్తున్నదట. ఆ సంగతి నీకు తెలుసా? " భార్యని ప్రశ్నించాడు సుబ్బారావు.

"డ్యాన్స్ నేర్చుకుంటున్నదా? నాకు తెలీదే? " హేమలత ముఖం వెలవెలపోయింది.

"నీకు తెలీదా? బాగుంది. మరి రోజూ ఇంతాలస్యంగా వస్తుంటే, నువ్వేం చేస్తున్నావ్? అది డ్యాన్స్ నేర్చుకోవడానికి వెళ్తుందని డ్రైవర్‌కి కూడా తెలుసు. నీకు తెలియదన్నమాట"

"అయ్యో! నాకేం తెలుసండీ. కోచింగ్ సెంటర్‌కి వెళ్తున్నానని చెప్పి డబ్బు తీసుకుంటోంది. నాకేం తెలుసు ఈ డ్యాన్సుల సంగతి? " అన్నది హేమలత.

"అంతా ఇష్టారాజ్యంగా ఉంది. ఎవడిష్టం వాడిది. వాళ్ళేమో పార్టీలని అర్ధరాత్రి వరకూ ఎక్కడెక్కడో తిరిగి వస్తారు. ఇదేమో డ్యాన్సులని తైతక్కలాడుతోంది. అసలు ఇది ఇల్లా? సత్రమా? " అని కేకలు పెట్టాడు సుబ్బారావు.

"ఏమే పాపిష్టిదానా! ఏం రోగమొచ్చిందే నీకు? చదువుకోమని కాలేజీకి పంపిస్తే, డ్యాన్సులేంటే? పిచ్చిపిచ్చిగా ఉందా? అంతా నీ ఇష్టం అనుకుంటున్నావా? " తిట్టడం మొదలుపెట్టింది హేమలత.

సుబ్బారావు విసవిసలాడుతూ రూములోకి వెళ్ళిపోయి విసురుగా తలుపులేసుకున్నాడు.

"డ్యాన్సు నేర్చుకోవడం తప్పేంటమ్మా? ఎందుకు గొడవపెడుతున్నారు? " అన్నది స్వాతి కళ్ళు తుడుచుకుంటూ.

"తప్పు లేనప్పుడు చాటుగా ఎందుకు నేర్చుకుంటున్నావే? కోచింగ్‌కెళ్తున్నానని దొంగమాటలెందుకు? " నిలదీసింది హేమలత.

"చెప్తే మీరు ఒప్పుకుంటారా? " అని ఎదురు ప్రశ్నించింది స్వాతి.

"అందుకని చెప్పకుండా వెళ్తున్నావన్నమాట. ఎంతకు తెగించావే. అసలే పిల్లల్ని పట్టించుకోవడం లేదని ఆయన గుర్రుగా ఉన్నాడు. మీరేమో ఇష్టం వచ్చినట్లు ఆడుతున్నారు. అంతా నా చావుకి వచ్చింది. అయినా నీకు డ్యాన్స్‌లేంటే? "

"నాకు ఇష్టం మమ్మీ!"

"ఇష్టమేంటే పిచ్చిదానా? ఇంటర్ తర్వాత ఇంజినీరింగో, మెడిసినో చెయ్యాలిగాని, డ్యాన్స్ నేర్చుకుంటే ఏం ఒరుగుతుంది? నీకసలు బుద్ధీ జ్ఞానం

ఉన్నాయా? "

"నేను సినిమా స్టార్ కావాలనుకుంటున్నాను మమ్మీ. ఇంజినీరింగ్, మెడిసిన్ అందరూ చేసేదే! నాకవి చదవడం ఇంట్రెస్ట్ లేదు" చెప్పింది స్వాతి.

"ఏంటే.. నువ్వు సినిమాస్టార్ అవుతావా? నీకేమైనా పిచ్చెక్కిందా? లేకపోతే దెయ్యం పట్టిందా? సినిమాలో వేషాలేసుకునే ఖర్మ నీకేం పట్టిందే? "

"ఖర్మం ఏంటమ్మా! సినిమా స్టార్ అయితే ఎంత నేమ్ అండ్ ఫేమ్! కోట్లు ఇస్తారు తెలుసా? " అన్నది స్వాతి.

"సినిమా స్టార్ కావడం అంత ఈజీనా? దీన్ని నీకెవరు బుర్రకెక్కించారే? పిచ్చి మాటలు మాను. మీ డాడీ ముందు అనేవ్? చంపి పాతరేస్తాడు. రేపటినుంచి కాలేజీ కాగానే ఇంటికి తగలడు. డ్యాన్సుల పేరెత్తితే చంపుతా!" అని వార్నింగ్ ఇచ్చింది హేమలత.

"నాకు ఇష్టమైంది నేర్చుకోగూడదన్న మాట. ఛీ..!" అనుకుంటూ, తల్లివైపు రోషంగా చూస్తూ తన రూమ్‌లోకి వెళ్ళింది స్వాతి.

హేమలత ఆయాసపడుతూ సోఫాలో కూలబడింది.




**మొ**బైల్ ఆగకుండా మోగుతుంటే, సుబ్బారావుకి మెలకువ వచ్చింది. కిరణ్‌రావు పేరు చూశాడు. టైమ్ పన్నెండు దాటింది. అర్ధరాత్రి కిరణ్ కాల్ చేశాడంటే ఏదో ఇంపార్టెంట్ మేటరై ఉంటుందనుకున్నాడు.

"హలో కిరణ్! ఏంటి? " అని అడిగాడు.

"గోపాల్‌రెడ్డి కూతురు సూసైడ్ అటెంప్ట్ చేసిందటోయ్. అపోలోకి తీసుకెళ్ళారట. మనం వెళ్తే కాస్త ధైర్యంగా ఉంటాడు. అసలే పిరికి మనిషి" అని చెప్పాడు కిరణ్‌రావు.

"అయ్యో! అంతపని చేసిందా? ఛా! సరే! వస్తున్నా" అని బెడ్డుమీద నుండి లేచాడు.

డ్రెస్ వేసుకుని, కారు డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళాడు.

గోపాల్‌రెడ్డి కూతురు అరుణ పెళ్ళి జరిగి సంవత్సరం గడిచిందేమో? అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజినీర్‌గా చేస్తున్న కుర్రాడికిచ్చి పెళ్ళి చేశాడు. పాతిక లక్షలు కట్నం ఇచ్చి, పది లక్షలు పెళ్ళికి ఖర్చు పెట్టి అంగరంగ వైభవంగా పెళ్ళి జరిపించాడు. ఏమైందో ఏమో పాపం? ఆత్మహత్యకు పాల్పడిందంటే ఎంతో మానసిక క్షోభ అనుభవించి ఉంటుంది.

సుబ్బారావు హాస్పిటల్‌కి చేరుకునేటప్పటికే అక్కడ కిరణ్‌రావు, గోపాలరెడ్డితో మాట్లాడుతూ ఉన్నాడు.

"ఏంటి రెడ్డీ? ఇట్లా జరిగిందేమిటి? " అని పలకరించాడు సుబ్బారావు.

"అంతా ఖర్మ!" అన్నాడు గోపాలరెడ్డి విషణ్ణవదనంతో.

"ఎట్లా ఉంది అమ్మాయికి? "

"డాక్టర్లు ఏం చెప్పడం లేదు!" అంటూ ఉంటే గోపాలరెడ్డి గొంతు పూడుకుపోయింది. మాట్లాడలేకపోతున్నాడు. కళ్ళలో నీళ్ళు సుళ్లు తిరుగుతున్నాయి.

"ధైర్యంగా ఉండు. అమ్మాయికి ఏంకాదులే. లోపల తెలిసిన డాక్టర్ రాజకుమారి



ఉండాలి. నేను ఎంక్వయిరీ చేస్తాను" అని సుబ్బారావు వెళ్ళాడు.

రిసెప్షన్‌లో డాక్టర్ రాజకుమారి గురించి అడిగాడు. ఆమె డ్యూటీలోనే ఉందని తెలిసి వెళ్ళి కలిశాడు. అరుణ కేసు గురించి సమాచారం చెప్పమన్నాడు. ఆమె లోపలకు వెళ్ళి వచ్చింది.

"ఆ అమ్మాయి ఔటాఫ్ డేంజర్ రావు గారూ! స్టమక్ వాష్ చేశారు. ఫ్లూయిడ్స్ ఇస్తున్నారు. నథింగ్ టు వర్రీ" అన్నది రాజకుమారి.

సుబ్బారావు అదే విషయాన్ని ఇద్దరికీ చెప్పాడు. గోపాలరెడ్డి ముఖంలో రిలీఫ్ కనిపించింది.

"ఇక్కడ ఉంటే వర్రీగా ఉంటుందోయ్ రెడ్డీ! పద అట్లా బైటకుపోయి చాయ్ తాగొద్దాం" అని ఇద్దర్నీ బయల్దేరదీశాడు సుబ్బారావు.

ముగ్గురూ కారులో బయల్దేరారు. అప్పటికి రాత్రి ఒంటి గంటయింది. పంజగుట్టలో తెరిచి ఉన్న ఇరానీ హోటల్లోకి వెళ్ళి కూర్చున్నారు. తనకు ఆకలిగా ఉందని ఉస్మానియా బిస్కెట్లు తెప్పించాడు సుబ్బారావు. తింటూ మాట్లాడుకున్నారు.

"రెడ్డీ! ఏం జరిగింది? అమ్మాయి ఎందుకు సూసైడ్ అటెంప్ట్ చేసింది? " అని అడిగాడు సుబ్బారావు.

గోపాలరెడ్డి జరిగింది చెప్పాడు.

"రావ్! ఇందులో నా తప్పుగూడా ఉంది. అరుణ డిగ్రీ ఫైనల్ ఇయర్‌లో




ఉన్నప్పుడు మా వీధిలోనే ఉండే నారాయణరావు కొడుకు రామ్‌కుమార్‌ని ఇష్టపడింది. అబ్బాయి బ్యాంక్ ఎంప్లాయి. వాళ్ళ ఫాదర్‌గూడా స్టేట్ బ్యాంక్‌లోనే పనిచేసి రిటైరయ్యాడు. వాళ్ళకి ఒక ఇల్లు తప్ప ఆస్తులేం లేవు. మా ఆవిడ మొగ్గు చూపిందిగాని నాకే ఇష్టం లేకపోయింది. బ్యాంక్ ఎంప్లాయికి ఏమంత ఫ్యూచర్ ఉంటుంది? అదీగాక తరచుగా ట్రాన్స్‌ఫర్ చేస్తారు. దేశమంతా తిప్పుతారు. మహా అయితే బ్రాంచి మేనేజర్ కాగలుగుతాడు. అమ్మాయి ఏం సుఖపడుతుంది? అని ఆలోచించాను. మా రిలేటివ్స్ అంతా అమెరికా సంబంధాలు చేస్తున్నారు. పిల్లల్ని చూడ్డానికి, పురుళ్ళకనీ అమెరికా వెళ్తున్నాం అని గొప్పగా చెప్పుకోవడం నాకు బాగా నచ్చింది. అందుకే అమెరికా సంబంధం ఖాయం చేశాను. అయితే అతని గురించి సరిగా ఎంక్వయిరీ చేయక పోవడం నా తప్పే. అమెరికాలో అతనికి ఆల్రెడీ ఒక తెల్లమ్మాయితో పెళ్ళయిందట. అక్కడికి కాపురం వెళ్లిన అరుణ అది తెలిసి షాక్ తిన్నది. ఇతగాడు రెండిళ్ళు మెయిన్‌టేన్ చేస్తూ అమ్మాయిని హింసించడం మొదలుపెట్టాడు. రామ్‌కుమార్‌తో లవ్‌ఎఫైర్ ఉందని ఎవరు చెప్పారో ఏమో? నువ్వు చెడిపోయిన దానివని తిట్టేవాడట. తాగి కొట్టేవాడట. బోడి పాతిక లక్షల కట్నం తెచ్చావ్. మీ నాన్న కోటీశ్వరుడు, ఇంకొక ఏభైలక్షలు తీసుకు రా అని

ఇండియాకి తరిమాడు. మా అమ్మాయి అసలే సెన్సిటివ్. ఆ టార్చర్ తట్టుకోలేక పోయింది. మా ఆవిడది చాదస్తం. ఇప్పుడిక చేసేదేవుంది? 'ఆ డబ్బు ఇచ్చి పంపుదాం' అంటుంది. 'ఎట్లాగో సర్దుకో. పిల్లలు పుట్టాక అతను తప్పకుండా మారతాడు. మొగుణ్ణి వదిలేసి పుట్టింట్లో ఉంటే నలుగురూ నానా మాటలు అంటారు!' అని మొదలుపెట్టింది. మా అమ్మాయికి మళ్ళీ అతని దగ్గరికి వెళ్ళడం ఇష్టం లేదు. అతను మాటిమాటికి ఫోన్ చేస్తున్నాడు, అమెరికా రమ్మని. వెళ్ళమని మా ఆవిడ ఒత్తిడి చేస్తోంది. అది తట్టుకోలేక అరుణ సూసైడ్ ప్రయత్నం చేసింది. అమ్మాయి ఇష్టపడిన వాడికి ఇచ్చి చేసినా సుఖంగా ఉండేది. కళ్ళముందు తిరిగేది. ఇప్పుడు ఏమనుకుని ఏం లాభం? "

గోపాలరెడ్డి చెప్పినదంతా విని నిట్టూర్చాడు సుబ్బారావు. అతను చెప్పినట్లు జరిగిన దాంట్లో గోపాలరెడ్డి తప్పూ ఉంది. తన దగ్గర డబ్బుందనే అహంకారంతోనే కూతురు ఇష్టపడిన వాడికిచ్చి పెళ్ళి చేయడానికి ఒప్పుకోలేదనేది వాస్తవం. అదే అతను కూడా మిడిల్ క్లాస్‌వాడయి ఉంటే 'బ్యాంక్ ఎంప్లాయికేం.. బంగారం!' అని ఎగిరి గంతేసి పిల్లనిచ్చి ఉండేవాడు. బంధువులంతా అమెరికా సంబంధాలు చేయడమూ అతన్ని ప్రభావితం చేసింది. తనకేం తక్కువ? తన కూతురు అమెరికాలో ఉంటే గొప్ప కదా అనుకున్నాడు. కాని ఆ వచ్చిన సంబంధం ఎటువంటిది? కుర్రాడు మంచివాడా? కాదా? అని ఎంక్వయిరీ చేసి నిర్ధారించుకోలేకపోయాడు. ఇప్పుడిక చేసేదేవుంది?

"పోనియ్యవోయ్ రెడ్డీ! జరిగిపోయినదానికి ఎవరేం చేయలేం. ఇక ఇప్పుడు జరగవలసింది ఆలోచించాలి. అమ్మాయికి ధైర్యంచెప్పి మనుషుల్లో పడేట్లు చేయాలి" అన్నాడు సుబ్బారావు.

"నాకేం తోచడం లేదు రావ్!" అన్నాడు గోపాలరెడ్డి తలవంచుకుని.

"తోచేది ఏముంది? ఆ భ్రాష్టుడిని వదిలించుకోవడం తప్పదు. అమ్మాయి మళ్ళీ డబ్బు తీసుకెళ్ళినా అతనిలో మార్పు ఉండదు. ఇప్పుడిక లోకం ఏమనుకుంటుందో అనే ఆలోచన వదిలెయ్. ఆల్రెడీ అక్కడ పెళ్ళి చేసుకుని కాపురం చేస్తూ, ఇండియా వచ్చి మళ్ళీ పెళ్ళి చేసుకుని అమ్మాయిని టార్చర్ చేసిన వాడిని ఎట్టి పరిస్థితుల్లో వదలగూడదు. వాడిని జైల్లో పెట్టించాల్సిందే. మన లాయర్ సుబ్రమణ్యం ఆ వ్యవహారం చూసుకుంటాడు" అన్నాడు కిరణ్‌రావు.

"ఔను రెడ్డీ! అట్లాగే చేద్దాం. అమ్మాయిది చిన్నవయసు. ఆల్రెడీ డిగ్రీ చేసింది. ఇప్పుడిక పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేయమని ఎంకరేజ్ చేద్దాం. మళ్ళీ మామూలు మనిషవుతుంది. ఈ కేసులవీ తేలిన తర్వాత అమ్మాయి ఇష్టాన్ని బట్టి పెళ్ళి గురించి ఆలోచించవచ్చు" అన్నాడు సుబ్బారావు.

గోపాలరెడ్డి తల ఊపాడు. టీ తాగిన తర్వాత మళ్ళీ హాస్పిటల్‌కి తిరిగి వచ్చారు. అరుణను ఐ.సి.యు.లో ఉంచారనీ, ఏం ఫరవాలేదని తెలిసింది. ఇక అక్కడ ఉండి చేసేదేం లేదని ఇంటికి వచ్చే

## కొత్తగాలి...

**అంతర్జాలం కౌగిట్లో**
**ప్రపంచం!**
**కరెన్సీ కౌగిట్లో**
**మనిషి!**

– వల్లభాపురం జనార్దన,
మహబూబ్‌నగర్

శాడు సుబ్బారావు. వచ్చి పడుకున్నా అతనికి చాలాసేపు నిద్రపట్టలేదు. మనిషి డబ్బు సంపాదించేకొద్దీ సమస్యలను కూడా కొని తెచ్చుకుంటున్నట్లు అనిపించింది.

లేకపోతే ఏంటి? కూతురు సుఖపడుతుందని పాతిక లక్షలు కట్నం ఇచ్చి, పెళ్ళికి పది లక్షలు ఖర్చు చేస్తే ఏం జరిగింది? ఆ పెళ్ళి కాస్తా పెటాకులై పిల్ల ప్రాణంమీదకు వచ్చింది. పిల్లల్ని కంటాంగాని వాళ్ల రాతలు కనలేమని పెద్దవాళ్ళనేది ఇందుకేనేమో? మనిషి బతుకు లాటరీలా తయారైంది. డబ్బు లేకపోతే ఒకే బాధ. డబ్బు సంపాదిస్తే అనేక బాధలు. కింద నుంచి వచ్చిన మనిషి పైపైకే చూస్తున్నాడు. ఇంకా పైకి పోవాలి. ఇంకా.. ఇంకా.. ఎంతదూరం ఈ ప్రయాణం?

రేపు తన పిల్లల భవిష్యత్తు ఏమిటి? హేమలత ఆరోపించినట్లు తను డబ్బు సంపాదనలో పడి ఇంటిని నిర్లక్ష్యం చేస్తున్నాడా? సుబ్బారావుకి ఆలోచనలు ముసురుకుని నిద్రపట్టడం లేదు.

మర్నాడు సాయంకాలం తొందరగా ఇంటికి వచ్చాడు సుబ్బారావు. గోపాలరెడ్డి ఇంటికి హేమలతతోపాటు వెళ్ళాలనే ఆలోచనతో వచ్చాడు. ఆ కుటుంబానికి ఎంతో సన్నిహితంగా మెలిగారు ఇన్నాళ్లు. అరుణ పెళ్ళిలో బాగా క్లోజుగా తిరిగారు. ఇప్పుడు అరుణ సంసారంలో కలతలు చెలరేగి, ఆత్మహత్యా యత్నం చేయడం వారికి ఆపద కింద లెక్క. రాత్రి తను వెళ్ళి గోపాలరెడ్డికి ధైర్యం చెప్పినా, తన భార్య పరామర్శకు రాలేదేమని వాళ్ళ మనసులో మెదులుతూ వుంటుంది. అందువలన హేమలతను తీసుకుని వెళ్ళడం తప్పనిసరి. కాని గత కొద్దికాలంగా తను భార్యతో అంటీముట్టనట్టుగా వ్యవహరిస్తున్నాడు. ఆమెను దూరంగా వుంచాడు. ఇప్పుడామెను పలకరించి తీసుకెళ్లడం ఎలాగా? అని ఆలోచిస్తున్నాడు.

ఏదైనా ఫంక్షన్‌కో, బైట పనులకో వెళ్ళేటప్పుడు తప్ప సుబ్బారావు ఇంటికి ఆ సమయంలో రాడు. ఇప్పుడు ఎందుకో వచ్చాడు. ఏదైనా వూరి ప్రయాణమేమో? రాత్రి గూడా ఎక్కడికో వెళ్ళి తెల్లవారుతుండగా వచ్చాడు. ఏం జరిగిందో? ఏదైనా సమస్య వచ్చిందేమో బిజినెస్‌లో? తెలుసుకోవాలని వుంది హేమలతకు. కాని ఉదయమే హడావుడిగా వెళ్ళిపోయాడు సుబ్బారావు. మాట్లాడడానికి ఛాన్స్ ఇవ్వలేదు.

పనిపిల్ల వున్నా తనే ట్రేలో మంచినీళ్ళ గ్లాసు, కాఫీ కప్పు పెట్టుకుని వెళ్ళింది హేమలత.

"ఏమండీ! పెందరాళే వచ్చారు. ఎక్కడికైనా వెళ్ళాలా? " అని ప్రశ్నించింది మంచినీళ్ళ గ్లాసు అందిస్తూ.

"ఔను" అంటూ రాత్రి అరుణ ఆత్మహత్యా ప్రయత్నం గురించి చెప్పాడు.

"అయ్యో పాపం! అలా జరిగిందా? అరుణ పెళ్ళి మొన్న మొన్న జరిగినట్లుగా కళ్ళముందు కనిపిస్తోంది. పాపం! అన్నయ్య డబ్బును మంచి నీళ్ళలాగా ఖర్చుపెట్టి వైభవంగా చేశాడు పెళ్ళి. అంతా బూడిదపాలైపోయింది. పిల్లబతుకు అన్యాయమైంది" అని హేమలత బాధపడింది.

"ఏం చేస్తాం? పరిస్థితులు అలా మారిపోయాయి. వీలు కుదిరితే ఎదుటివాడిని మోసం చెయ్యడానికి తెగబడుతున్నారు జనం. మనుషులకు డబ్బే ముఖ్యమైపోయింది. అందుకే కట్నం చాలడం లేదని ఆడపిల్లల్ని హింసించి వుసురు పోసుకుంటున్నారు"

"ఔనండీ! తల్చుకుంటేనే భయం వేస్తోంది. ఈ మధ్య అన్నీ విడాకుల

కేసులే వింటున్నాను. పెళ్ళిళ్ళు పెటాకుల వుతున్నాయి. ఎందుకిట్లా ప్రపంచం మారి పోతున్నదో అర్థం కావడం లేదు. ఒక ప్పుడు అన్నీ తెలిసినవారి ద్వారానే పెళ్ళి సంబంధాలు వచ్చేవి. ఏవైనా గొడవలు జరిగినా ఇరువైపుల పెద్దలు సర్దుబాటు చేసేవాళ్ళు. విడిపోవడం వరకు వచ్చేది కాదు. ఇప్పుడేమో పేపరు ప్రకటనలు చూసి, మ్యారేజి బ్యూరోల ద్వారా సంబం ధాలు కుదురుతున్నాయి. ఎవరికీ బాధ్యత లేకుండా పోతోంది" అన్నది హేమలత.

"సరే! నువ్వు తయారై బయల్దేరు. గోపాలరెడ్డి ఇంటికెళ్ళి పలకరించి వద్దాం" అన్నాడు సుబ్బారావు.

అతని మనసు ప్రశాంతంగా వుంది. భార్య తనే వచ్చి వివరాలు అడగడం వల్ల, ఆమెను బయల్దేరదీయడం సులభమైంది.

ఇద్దరూ గోపాలరెడ్డి ఇంటికి వెళ్ళేసరికి అరుణ ఇంట్లోనే వుంది. కొంచెం నీరసంగా కనిపించింది.

"రండి వదినగారూ!" అని పలకరిం చింది గోపాలరెడ్డి భార్య రాజేశ్వరి.

"ఏవమ్మా అరుణా! ఇదేం పని? ఏదైనా వుంటే మాట్లాడి పరిష్కరించుకోవాలి గాని, ప్రాణం తీసుకుంటే ఎవరికి లాభం? " అన్నది హేమలత అరుణ పక్కనే కూర్చుని అనునయంగా.

"ఏం మాట్లాడాలి ఆంటీ? అందరికీ త మ పంతాలు, పట్టింపులే ఎక్కువ. వాళ్ళ మాటే చెల్లాలి. అందులోను ఆడపిల్ల మాటకు ఎవరు విలువిస్తున్నారు? 'నువ్వు చిన్నపిల్లవి.. నీకేం తెలియదు' అని నోరు మూయిస్తారు. డిగ్రీ చదువుకున్న దాన్ని, ఇరవైఏళ్ళ వయసొచ్చిన దాన్ని.. నాకేమీ తెలియదా? నా అభిప్రాయాలకు విలువ లేదా? నాలుగుగోడల మధ్య వుండే మీకంటే మాకు లోకజ్ఞానం ఎక్కువే వుంటుందన్న సంగతి ఎందుకు తెలుసు కోరు? " ఆక్రోశించింది అరుణ.

ఈ మాటలను అనడం హేమలతతోనే అయినా, అవన్నీ రాజేశ్వరికే తగులుతు న్నాయి. భర్తతో తెగతెంపులు వద్దనీ, సర్దు కుపొమ్మనీ తను బలవంత పెట్టడం వల్లనే కూతురు మనస్తాపంతో ఆత్మహ త్యకు పాల్పడిందని ఆమెకు బాగా తెలుసు. తను కుటుంబం పరువు పోతుం దనీ, బంధువుల్లో పలచన అవుతామనీ ఆలోచించింది. కాని కూతురు ఆత్మహ త్యకు తెగిస్తుందని వూహించలేదామె.

గోపాలరెడ్డి, రాజేశ్వరి ఏమీ మాట్లాడ్డం లేదు. మౌనంగా వున్నారు.

"అరుణా! ఇక జరిగిపోయినదాని గురించి ఆలోచించకు. అందువలన ఉపయోగమేమిటి చెప్పు? " అన్నాడు సుబ్బారావు అరుణను ఓదారుస్తూ.

"నిజమే అంకుల్! కాని అంత తొంద రగా జరిగినదాన్ని మర్చిపోలేం కదా? ఆ నరకం అనుభవించిన వారికి తెలుస్తుంది. అవన్నీ గుర్తొస్తే, బతకాలనే కోరిక చచ్చిపో తుంది" కళ్ళు తుడుచుకుంటూ చెప్పింది అరుణ.

"మరిచిపోక తప్పదమ్మా! అదొక పీడ కల అనుకో. అసలు నీకు పెళ్ళి కాలేదనే వుద్దేశ్యంతో వుండు. ఇంకానయం, నీకు పిల్లలు కలగలేదు. అదే అదృష్టం. మని షికి మరపు అనేది ఒక వరం. మర్చిపోగ లిగితే ఏ బాధలూ వుండవు. నువ్వు మామూలుగా వుండటానికి ప్రయత్నిం చాలి. అందుకు ఏదైనా వ్యాపకం వుండాలి. అప్పుడే అన్నీ మర్చిపోగలుగు తావు. నువ్వు డిగ్రీ చదివావు కదా! ఇప్పుడు పోస్ట్ గ్రాడ్యుయేషన్ చెయ్యి. తర్వాత డాక్టరేట్ అందుకో. ముందు ముందు ప్రొఫెసర్ అవుతావు. సరికొత్త జీవితం అనుభవిస్తూ సంతోషంగా వుండ గలుగుతావు" చెప్పాడు సుబ్బారావు.

అరుణ తలవూపింది.

"ఎవరో ఏదో అనుకుంటారని ఆలోచించకు అరుణా! నువ్వు నీకోసం జీవించాలి. ఇటువంటి పిచ్చిపని ఎప్పుడూ చెయ్యకు. ఏం? " అన్నది హేమలత అరుణ భుజం మీద చెయ్యివేసి.

"అలాగే ఆంటీ! అప్పుడు ఏదో అలా జరిగిపోయింది" అన్నది అరుణ తలవంచుకుని.

"రెడ్డీ! నువ్వింక అరుణ ఇష్టప్రకారం వుండనీ. ఆ భ్రష్టుడి సంగతి ఎత్తకు. విష సర్పం అని తెలిసినప్పుడు దూరంగా వుండాలి. దాని కోరలు పీకాలి. మన లాయర్ సుబ్రమణ్యంతో రేపెల్లి మాట్లాడదాం. కట్నం డబ్బు ముక్కుపిండి వసూలు చేద్దాం. అటువంటి వాళ్ళను వదలగూడదు. కోర్టుల చుట్టూ తిప్పి జైలు పాలు చేస్తే ఇతరులకు కూడా బుద్ధి వస్తుంది" అన్నాడు సుబ్బారావు.

గోపాలరెడ్డి తలవూపాడు అంగీకార సూచకంగా.

★ ★ ★

సుబ్బారావు, హేమలత కొన్నిరోజులుగా సఖ్యంగానే ఉంటున్నారు. కాని అది ఎన్నో రోజులపాటు నిలువలేదు.

ఆ రోజు సుబ్బారావు బీరువాలో నుంచి క్యాష్ తీసి సూట్‌కేసులో సర్దుతున్నాడు. ఒక డీల్‌లో నెంబర్ టూ ఎకౌంట్‌లో డబ్బు చెల్లించవలసి వచ్చింది. రియల్ ఎస్టేట్ బిజినెస్‌లో బ్లాక్‌మనీ డీలింగ్స్ తప్పనిసరి. కస్టమర్‌కి ఫ్లాట్ అమ్మేటప్పుడు మొత్తానికి చెక్ పేమెంట్ ఇవ్వడు. ఏభై లక్షలకు ఫ్లాట్ కొన్నవాళ్ళు ఏ ముప్పై లక్షలకో చెక్ ఇస్తారు. మిగిలింది క్యాష్ పేమెంట్ చేస్తారు. రిజిస్ట్రేషన్ ఛార్జీలు గవర్నమెంటుకు చెల్లించకుండా జరిగే తతంగమే ఇది. ఇండియాలో మల్టీమిలియనీర్స్ కావాలంటే ప్రభుత్వ ఖజానాకు కన్నం పెట్టకుండా కుదరదు. దాదాపుగా అన్ని రకాల వ్యాపారాలు చేసేవాళ్ళు ఏదో ఒక రకంగా ఖజానాకు పోవలసిన డబ్బు తమవైపు మళ్ళించుకుని ఎదుగుతారు. ఎవరికీ మినహాయింపులేదు. అందుకు చార్టర్డ్ అకౌంటెంట్ల సహకారం ఎంతైనా ఉంటుంది.

కరెన్సీ కట్టలు లెక్కపెడుతున్న సుబ్బారావు "హేమా!" అని పిలిచాడు, గది బైటకు వచ్చి.

హేమలత వచ్చి "ఏమిటండీ? " అని అడిగింది.

"మెరూన్ కలర్ బీరువాలో క్యాష్ తగ్గిందేమిటి? పది లక్షలు తక్కువగా ఉంది" అన్నాడు.

"మహేష్ తీసుకున్నాడు గదండీ" అన్నది.

"మహేష్! ఎందుకు? "

"ఫ్రెండ్స్‌తో టూర్ వెళ్తున్నాడని మీకు చెప్పాడటగా? మీరు ఫోన్ చేశారుగా డబ్బివ్వమని"

"అదేం టూరు? పదిలక్షలా? "

"ఔనండీ! యూరప్ టూరట. మినిస్టర్ గారబ్బాయి వాళ్ళు బయల్దేరారట. వాళ్ళతో వెళ్లాడు"

"టూర్‌కి వెళ్ళడమంటే ఏ లక్షో, రెండు లక్షలో అనుకున్నా! మరీ పది లక్షలు తీసుకెళ్ళాడా? ఎందుకు అంత? నాకు

## భలే భలే!

రచయిత్రి మాయా ఏంజెలోకు తెల్లవారు ఝామున ఐదింటికే హోటల్‌కెళ్లి రాసుకునే అలవాటు! అప్పుడు గదిగోడలకున్న ఫొటోలన్నిటినీ తీయించేసి ఓ బాటిల్ షెర్రీ, రోగెట్స్ డిక్షనరీ, బైబిల్, కార్డ్స్ పక్కన పెట్టుకుని రాసుకుంటుందామె. మధ్య మధ్యలో కాసేపు ఒంటరిగానే కార్డ్స్ ఆడుకుంటూ ఓ పది పేజీలు రాసుకుని మధ్యాహ్నం ఇంటికెళ్లిపోతుందట.

ఇంత కావాలని అడగలేదు. డబ్బంటే లెక్కలేకుండా పోయింది మీకు. చెట్లకి కాస్తున్నాయనుకుంటున్నారా? " అని చిందులు తొక్కాడు సుబ్బారావు.

"బాగుంది. మధ్యలో నన్నంటారేంటి? " అని ముఖం మాడ్చుకుంది హేమలత.

"మరి ఎవర్నాలి? వాడు టూర్ వెళ్తాను.. డబ్బుకావాలని ఫోన్ చేస్తే, నిన్ను అడిగి తీసుకెళ్లమన్నాను. మరి నువ్వు ఇంత డబ్బు కావాలంటున్నాడని చెప్పాల్సిన అవసరంలేదా? "

"మీకు చెప్పేవుంటాడనుకున్నాను" అన్నది హేమలత.

"అన్నీ ఊహించుకోవడమే. మంచీ చెడూ లేదు. మళ్ళీ నేనేం పట్టించుకోవడం లేదని నన్నంటావు. నువ్వేం పట్టించుకుంటున్నావు? టూర్‌కు వెళ్లడానికి పదిలక్షలు అడిగితే, అంత డబ్బు ఎందుకురా.. అని నిలదీయగలిగావా? అసలు ఈ టూర్లే మిటి, చదువుకునేవాడికి అని అడిగావా? " గట్టిగా కేకలు పెట్టాడు సుబ్బారావు.

హేమలత ఇరుకున పడింది. తన నిర్లక్ష్యం స్పష్టంగా కనపడుతుంటే, ఏం మాట్లాడాలో అర్థం కావడం లేదు. భర్త అన్నదాంట్లో నిజం ఉంది. కాని తప్పు ఒప్పుకోవడానికి అహం అడ్డొస్తుంది.

## కొత్తగాలి...

**'సత్యం'**
**ఆచరించినవాడికి**
**పాశుపతాస్త్రం!**
**ఆచరించని వాడికి**
**యమపాశం!**

– ధప్పూరి శ్రీధరాచార్యులు,
సీతారాంబాగ్, హైదరాబాద్

"అనండి.. అనండి. నన్నే అనండి. చదువుకునేటప్పుడు టూర్లు ఎందుకురా? అని మీరెందుకు అడగలేదు? మీరక్కడికి ఎంతో ఉదారంగా వెళ్ళమని పర్మిషన్ ఇస్తే, నేను వద్దని అడ్డంపడి చెడ్డదాన్ని అనిపించుకోవాలా? " అంటూ ఉక్రోషంతో ఏడుస్తూ గది బయటకు వెళ్ళిపోయింది.

సుబ్బారావు భార్య వెళ్ళినవైపు చూస్తుండిపోయాడు. ఆమె కనుమరుగు కాగానే పెద్దగా గొణుక్కున్నాడు.

"పాడుకొంప! ఇష్టారాజ్యమైపోయింది. గుడ్డి దర్బారు కింద తయారైంది.. ఛీ... మనశ్శాంతి లేకుండా ఉంది"

భార్యాభర్తలు ఘర్షణ పడిన తర్వాత కొంతకాలం ఇద్దరూ ఎడమొహం పెడమొహంగా మసలుకుంటారు. అంటీముట్టనట్లుగా మాటా మంతీ లేకుండా ఒకే ఇంట్లో విరోధుల్లా ఉంటారు. ఏదో ఒక పెళ్ళికి వెళ్ళాల్సి రావడమో, బంధువులు వచ్చినప్పుడో యాదృచ్ఛికంగా కలుస్తారు. మళ్ళీ కొన్నాళ్ళు బాగానే ఉంటారు. అలా జరుగుతూ వస్తోంది గత కొంతకాలంగా.

ఆ రోజు ఉదయమే ఘర్షణపడిన భార్యాభర్తలు ఇరవై నాలుగు గంటలు గడవక ముందే కలుసుకోవాల్సిన సంఘటన జరిగింది.

కొత్త డీల్ కుదిరిన సందర్భంగా జరిగిన పార్టీలో మందు తాగడం, కడుపు నిండా తినిరావడం వలన సుబ్బారావుకి బాగా నిద్రపట్టింది.

"ఏమండీ! ఏమండీ!" అంటూ హేమలత అతన్ని పట్టుకుని కుదుపుతుంటే, అతనికి మెలకువ వచ్చింది.

కళ్లు తెరిచాడు. అవి మండుతున్నాయి. మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. శరీరమంతా మొద్దుబారినట్లుగా ఉంది. మెదడు మత్తులో మునిగివుంది. లేవబుద్ధి కావడం లేదు. తెల్లవారుజామున నాలుగు గంటలైంది అప్పుడు. కమ్మగా నిద్రపోయే స

మయం. అప్పుడు నిద్ర లేపుతున్న భార్య మీద మండు కొచ్చింది. కాని ఏం కొంప మునిగిందో? ఊళ్ళో దగ్గరి చుట్టాలెవరైనా చచ్చారేమో?

సుబ్బారావు లేచికూర్చుని కళ్ళు నులుముకుంటూ "ఏంటి? " అన్నాడు చిరాగ్గా.

"మహేష్‌ని ఎయిర్‌పోర్టులో పట్టుకున్నారంటండీ!" అన్నది హేమలత ఏడుస్తూ.

"ముందు ఆ ఏడుపు ఆపు. వాడిని ఎయిర్‌పోర్టులో పట్టుకోవడం ఏమిటి? ఎవరు పట్టుకుంది? ఎందుకు పట్టుకున్నారు? వాడేమైనా టెర్రరిస్టా? " అన్నాడు సుబ్బారావు మండిపడుతూ.

"టాక్సులేవో కట్టలేదని ఎక్సయిజ్ వాళ్ళు పట్టుకున్నారంటండీ" ఏడుపు ఆపుకుంటూ అన్నది.

"నీకెవరు చెప్పారు? "

"ఎవరోకాదండీ.. వాడే ఫోన్‌చేసి చెప్పాడు"

సుబ్బారావుకి మత్తు వదిలిపోయింది. కళ్ళు మూసుకున్నాడు. అతనికి అంతా అర్థమైంది. టూర్ వెళ్ళినవాళ్ళు ఆ దేశాల్లో ఏవేవో వస్తువులు కొనివుంటారు. వాటికి అక్కడ కస్టమ్స్ డ్యూటీ కట్టకుండా సూట్ కేసుల్లో సర్దుకుని వచ్చివుంటారు. ఇక్కడ స్కానింగ్‌లో దొరికి ఉంటారు. ఇప్పుడు కస్టమ్స్ డ్యూటీ కట్టి తీసుకెళ్ళమని పక్కన కూర్చోబెట్టి ఉంటారు.

"సరే! వెళ్ళిపడుకో" నిర్లిప్తంగా అని పడుకున్నాడు సుబ్బారావు. అతని ముఖం కోపంతో ఎర్రబడింది.

హేమలతలో ఆందోళన ఎక్కువైంది. భర్త ప్రవర్తన ఆమెకు జీర్ణం కావడంలేదు. ఒక వైపు కన్నకొడుకు ఎయిర్‌పోర్టులో చిక్కుబడిపోయివుంటే, తనకేంపట్టనట్లు ఉండడం ఏమిటో అర్థంకావడం లేదు.

"అదేంటండీ? మీరు వెళ్ళకపోతే ఎలా? " అన్నది.

"నేనేం చేస్తాను వెళ్ళి? వాడి ఫ్రెండ్ మినిస్టర్ కొడుకు ఉన్నాడుగా? వాళ్ళకి చాలా ఇన్‌ఫ్లూయన్స్ ఉంటుంది. ఎట్లాగో వచ్చేస్తాడులే. నువ్వెందుకు వర్రీ అవుతున్నావు? అనవసరంగా నా నిద్ర చెడగొట్టావు" విసుక్కున్నాడు సుబ్బారావు.

"అది కాదండీ! అక్కడ డబ్బు కట్టాలంట"

"ఇంకేం? డబ్బు కట్టి రమ్మను"

"లక్ష రూపాయలు కట్టాలంట"

"నువ్వనేదేంటి? వాడి దగ్గర డబ్బుందిగా కట్టిరమ్మను. ఇప్పుడు నేనెందుకు ఎయిర్‌పోర్టుకి వెళ్ళడం? వెళ్ళి బొకే చేతికిచ్చి స్వాగతం పలకాలా? "

"వాడి దగ్గర డబ్బులేదట"

"వాట్? పది రోజుల్లో పది లక్షలు ఖర్చుపెట్టాడా? "

"అంతే అయ్యుంటుంది. లేకపోతే డబ్బు తెమ్మని ఫోన్ ఎందుకు చేస్తాడు? "

"బోడి డబ్బే కదా? మీకు అడ్డేముంది? నాకు చెప్పడమెందుకు? తీసుకెళ్ళు" అని ముసుగు తన్ని పడుకున్నాడు సుబ్బారావు.

హేమలతకు రోషం వచ్చింది. చర చరా గది బైటకు వచ్చింది. ఆమెకు ఇప్పుడు ఏం తోచడం లేదు. ఇంత రాత్రి సమయంలో తను ఎలా వెళ్ళగలదనుకుంటున్నాడు ఆ మనిషి? తనకి డ్రైవింగ్ రాదు. డబ్బు తీసుకుని ఏ ఆటోలోనో వెళ్ళడం క్షేమమేనా? ఏదైనా క్యాబ్ తెప్పించుకుని వెళ్తే?

ఆమెకు ఆ ఐడియా బాగున్నట్లనిపించింది. డబ్బు హేండ్‌బ్యాగ్‌లో పెట్టుకుని చిన్న కొడుకు గది దగ్గరికి వెళ్ళింది. వాడు తలుపులు బిగించుని పడుకున్నాడు. ఎప్పటికోగాని తలుపు తెరవలేదు.

"వాట్ మమ్మీ? " అన్నాడు నిద్రకళ్ళతో.

"క్యాబ్ నెంబర్ ఏదైనా ఉందా నీ దగ్గర. తొందరగా పిలువు. ఎయిర్‌పోర్టుకి వెళ్ళాలి" అన్నది.



"ఎయిర్‌పోర్టుకా? ఎందుకు? " అన్నాడు ఆశ్చర్యపోతూ.

ఆమె సంగతి చెప్పింది. అన్నయ్య మీద డాడీ కోపంగా ఉన్నాడనీ, అందుకే తను డబ్బు తీసుకుని వెళ్ళాల్సి వచ్చిందనీ వివరించింది.

"క్యాబ్ నెంబర్ ఏదీ లేదుగాని, పద నేనే వస్తాను" అన్నాడు.

"నీకు డ్రైవింగ్ వచ్చా? " అన్నది ఆశ్చర్యపోతూ.

"ఎందుకు రాదూ? అదేం బ్రహ్మ విద్యా? " అని నవ్వాడు.

"లైసెన్స్ ఉందా? "

"ఉందిలే పదమ్మా!" అన్నాడు కార్తీక్ డ్రెస్ మార్చుకుంటూ.

> **కొత్తగాలి...**
>
> 
>
> **స్వప్న ప్రపంచపు**
> **రంగుల పరదా తొలగించు**
> **సాక్షాత్కరిస్తుంది**
> **నలుపు తెలుపు లోకం!**
>
> – కృష్ణ మాదవరపు,
> కాకినాడ

హేమలత చిన్న కొడుకుతో ఎయిర్‌పోర్టుకి బయల్దేరింది.

★ ★ ★

సుబ్బారావు ఆఫీసుకెళ్ళి కూర్చోగానే కిరణ్‌రావు వచ్చి "సుబ్బూ! మనం ఇప్పుడు ఎర్రగడ్డ వెళ్ళాలి పద" అన్నాడు.

"ఏమిటి విశేషం? మన వాళ్ళెవరికైనా మెంటల్ వచ్చిందా? " అన్నాడు నవ్వుతూ.

"ఎర్రగడ్డలో ఒక్క మెంటల్ హాస్పిటలేనా ఉంది? టీబీ హాస్పిటల్, మిషనరీ హాస్పిటల్ గూడా ఉన్నాయి. రైట్! మన ఆడిటర్ విశ్వనాథ్ పదిన్నరకల్లా మిషనరీ హాస్పిటల్‌కి రమ్మని రిక్వెస్ట్ చేశాడు. వెళ్ళకపోతే ఫీలవుతాడు. వెళ్ళి కొంచెంసేపు గడిపి వద్దాం" అన్నాడు కిరణ్‌రావు.

"మిషనరీ హాస్పిటల్‌కా? ఏమైంది అతనికి? " అన్నాడు సుబ్బారావు.

"అతనికేం కాలేదు. అక్కడ హాస్పిటల్లో చిన్న ఫంక్షన్ అరేంజ్ చేశాడట. నీకు ఎన్నిసార్లు కాల్ చేసినా లైన్ కలవలేదట. నీకు కూడా చెప్పమని నన్ను రిక్వెస్ట్ చేశాడు. అయినా సెల్‌ఫోన్ ఆఫ్ చేసి ఉంచడం ఏమిటి? బ్యాడ్‌మ్యానర్స్" మందలింపుగా అన్నాడు కిరణ్‌రావు.

"మా వాళ్ళతో హెడ్డేక్‌గా ఉందోయ్! అందుకే సెల్ స్విచ్చాఫ్ చేసి పెట్టాను. కమ్మగా నిద్రగూడా పోనివ్వడం లేదు నన్ను" అంటూ మహేశ్వర్ యూరప్ టూర్‌కి వెళ్ళడం, అక్కడ కొన్ని వస్తువులకు ఎక్సైజ్ డ్యూటీ కట్టకుండా తీసుకురావడం, భార్యతో ఘర్షణ అంతా వివరంగా చెప్పాడు.

"డబ్బు అట్లా ఆడిస్తున్నది వాళ్ళని. మనం ఎంత కష్టపడి ఈ స్థాయికి వచ్చామో వాళ్ళకి అర్థం కావట్లేదు. పిల్లల సర్కిల్లో అడ్డగోలుగా సంపాదించే పొలిటీషియన్స్ కొడుకులు, లంచగొండులైన ఆఫీసర్ల పిల్లలు ఉంటారు. తండ్రులు డబ్బు సంపాదించేది తాము ఎంజాయ్ చేయడానికే గదా అనే దృక్పథంతో ఉంటారు. లక్షలు ఖర్చు పెడుతుంటారు. వాళ్ళని చూసి మన పిల్లలు గూడా అదే లైఫ్ స్టైల్‌కి అలవాటు పడుతున్నారు" అన్నాడు కిరణ్‌రావు.

"పులిని చూసి నక్క వాతలు పెట్టుకోవడం అంటే ఇదే" అన్నాడు సుబ్బారావు.

"బాగా చెప్పావు"

"వెనుకటి జన్మలో శత్రువులు ఈ జన్మలో కొడుకులుగా పుడతారంటారు, నిజమేనా? " అన్నాడు సుబ్బారావు.

పక పక నవ్వాడు కిరణ్‌రావు.

"ఎవరు చెప్పారు నీకు?"

"టీవీలో ఎవరో స్వామి చెప్తుంటే విన్నా!" అన్నాడు సుబ్బారావు.

"ఏమోలే! అవన్నీ ఊహాతీతమైన విషయాలు. ఇప్పుడంటే మన పిల్లలు హైసర్కిల్లో పెరుగుతూ గొడవల్లో ఇరుక్కుని తలనెప్పులు తెచ్చిపెడుతున్నారు. అదంతా జరుగుబాటు. మన ఆలోచనలకు భిన్నంగా వ్యవహరిస్తున్నారు. కాబట్టి శత్రువులే కొడుకులుగా పుట్టి సాధిస్తున్నారని అనుకుంటున్నావు. మరి మనం మన పేరెంట్స్‌తో బాగానే ఉన్నాం కదా? ఏ ప్రాబ్లమ్స్ లేకుండా హేపీగా గడుపుతున్నాం. మరి మీ నాన్నకి శత్రువులు ఎవరూ లేరా?" అని నవ్వాడు కిరణ్‌రావు.

"సర్లే! ఆ గొడవ ఎందుకుగాని, విశ్వనాథ్ ఫంక్షన్ ఆ హాస్పిటల్లో అరేంజ్ చెయ్యడమేమిటి?"

"విశ్వనాథ్ నాన్నగారి వర్ధంతట ఈరోజు. ఆ సందర్భంగా అక్కడ హాస్పిటల్లో ఉన్న రోగులకు పళ్ళు, స్వీట్స్ పంచుతాడట. హాస్పిటల్‌కి అనుబంధంగా అనాథపిల్లల ఆశ్రమం గూడా ఉందట. వాళ్ళకి కొత్త బట్టలు ఇస్తాడట"

"బాగుందోయ్! ఇంటి దగ్గర చుట్టాలందరికీ విందు భోజనం పెట్టడం కంటే ఇదే మంచిది, పద" అన్నాడు సుబ్బారావు సీట్లోంచి లేస్తూ.

మిషనరీ హాస్పిటల్లో కార్యక్రమం బాగా జరిగింది. సుబ్బారావు, కిరణ్‌రావు గూడా వార్డుల్లో వున్న రోగులకు స్వీట్స్, ఫ్రూట్స్ పంచిపెట్టారు. ఒక హాల్లో ఏర్పాటు చేసిన మీటింగ్‌లో విశ్వనాథ్ తండ్రి ఫొటోకి పూలదండ వేసి ప్రార్థనలు చేశారు. అక్కడ చేరిన పిల్లలందరికీ కొత్త బట్టలు అందజేశారు.

డాక్టర్ మార్గరెట్ ఆ కార్యక్రమం సజావుగా జరిపించింది. విశ్వనాథ్‌ని పొగి

## 'చతుర'లో మూడో నవల



వాణిశ్రీ

గుంటూరులో 1942 జులై 26న పుట్టాను. నీటి పారుదల శాఖ (నాగార్జున సాగర్ ప్రాజెక్టు)లో 1960 నుంచి 2000 వరకు పనిచేశాను. చివరకు సూపరింటిండెంట్‌గా ఉద్యోగ విరమణ చేశాను. నేను రాసిన ఏడువందల కథలు 1958 నుంచి ఇప్పటి వరకూ వివిధ పత్రికలలో అచ్చయ్యాయి. మొదటి నవల 1966లో వచ్చింది. ఇంతవరకూ 13 నవలలు ప్రచురితమయ్యాయి. 'జారుడుమెట్లు' చతురలో నా మూడో నవల. ఇంకా కథలు, నవలలు రాస్తూనే ఉన్నాను. తెలుగు కథా రచయితల వేదిక ద్వారా కథకులను సమన్వయ పరచి 'మా కథలు-2012', 'మా సీనియర్ సిటిజన్ కథానికలు' సంకలనాలు వెలువరించాను. త్వరలో 'మా కథలు-2013' కూడా రాబోతోంది. సామాజిక సమస్యలపై రాసిన నవలలను ఆదరిస్తున్న 'చతుర' నా అభిమాన మాస పత్రిక.

**చిరునామా :**

**వాణిశ్రీ (సిహెచ్. శివరామ ప్రసాద్)**
స్వగృహ అపార్ట్‌మెంట్స్
'సి' బ్లాక్, ఎఫ్-2
భాగ్యనగర్ కాలనీ,
కూకట్‌పల్లి,
హైదరాబాద్-500072

డింది.

"అనాథలైన పిల్లల్ని ఎవరైనా గమనిస్తే ఇక్కడికి తీసుకురండి. మేము వారిని పెంచుతాం. అలాగే పిల్లలు లేని దంపతులకు వారిని దత్తత ఇస్తాం. కులం, మతం ప్రసక్తిలేదు. ఎవరైనా తీసుకెళ్ళవచ్చు. వారికి కులమతాల తేడా లేకుండా పేర్లు పెడతాం. జ్యోతి, వెలుగు, వెన్నెల, ప్రశాంతి, మానస వంటివి ఏ మతానికీ చెందవు" ఆ హాస్పిటల్ మేనేజ్‌మెంట్ ఉద్దేశాన్ని చెప్పింది మార్గరెట్.

కార్యక్రమం జరుగుతున్నంత సేపూ సుబ్బారావు, డాక్టర్ మార్గరెట్‌ని చూస్తూనే వున్నాడు. ఎత్తుగా, మంచి రంగులో, మల్లె పూవువంటి తెల్లటి డ్రెస్‌లో హుందాగా కనిపిస్తోందామె. కళ్ళు ప్రకాశవంతంగా మెరుస్తున్నాయి. మాటలు మృదువుగా, తియ్యగా, వినసొంపుగా వున్నాయి. తెలిసిన ముఖంలాగే వుంది. పరిచయమైన గొంతు. ఎక్కడ? ఎప్పుడు? అనేది గుర్తు రావడం లేదు.

కిరణ్‌రావుని, సుబ్బారావుని విశ్వనాథ్ ఆమెకు పరిచయం చేశాడు. వారితో కరచాలనం చేసింది.

"సర్! హౌ డు యు ఫీల్?" అని అడిగింది.

"రియల్లీ వండ్రఫుల్ ఎక్స్‌పీరియన్స్" అన్నాడు సుబ్బారావు.

"ఫ్రమ్ నౌ ఆన్‌వర్డ్స్ ఐ విల్ ఫాలో దిస్ ప్రొసీజర్. టు డే ఐ యామ్ వెరీ హేపీ. ఐ ఎక్స్‌పీరియన్స్‌డ్ ఎ న్యూ థింగ్ ఇన్ మై లైఫ్" అన్నాడు కిరణ్‌రావు.

"థాంక్యూ జెంటిల్‌మన్. వెల్‌కమ్" అన్నది డాక్టర్ మార్గరెట్ మందహాసం చేస్తూ.

ఇంటికి తిరిగి వెళ్ళిన తర్వాత సుబ్బారావుకి పదేపదే మార్గరెట్ ముఖమే కళ్ళల్లో మెదులుతోంది. తను కాకినాడలో ఇంజనీరింగ్ చదువుతున్నప్పుడు తాము అద్దెకుండే రూమ్‌కు ఎదురింట్లో ఆంజనేయులు గారమ్మాయి మల్లీశ్వరి ఇట్లాగే వుండేది.

ఎక్కడ కాకినాడ? ఎక్కడ మల్లీశ్వరి? పాతికేళ్ళ క్రితం సంగతి. ఆమె ఇక్కడెందుకు వుంటుంది? ఈ మార్గరెట్ ఆ మల్లీశ్వరి ఎందుకవుతుంది? మనిషిని పోలిన మనుషులు వుంటారుగదా? కాని ఈమే మల్లీశ్వరినేమో అనిపిస్తోంది. అదెలా కుదురుతుంది? మల్లీశ్వరివాళ్ళు హిందువులు. మార్గరెట్ క్రిస్టియన్.

ఒకవేళ ఆంజనేయులు కుటుంబం మతం మారారేమో? అయినా ఎందుకు మారతారు?

సుబ్బారావు చిన్నతనంలో ఒక సంగతి విన్నాడు. వాళ్ళవూర్లో సర్వేశలింగం అని ఒకాయన వున్నాడు. ఆయనకు గుండె జబ్బు. అప్పట్లో తమిళనాడులోని వేలూరులోని మిషనరీ హాస్పిటల్లోనే ఆధునిక వైద్యం లభించేది. ఎవరో చెబితే సర్వేశలింగం వేలూరు వెళ్ళాడు. బైపాస్ సర్జరీ చేయాలనీ, డాక్టర్లు ఫీజు తీసుకోక వుచితంగా ఆపరేషన్ చేసినా, ఆ పరికరాలకి బాగా డబ్బు ఖర్చవుతుందని చెప్పారు. వీళ్ళదగ్గర డబ్బులేదు. అప్పుడొక ఫాదర్ క్రైస్తవుల్లోని పేదవారిని ఆదుకునేందుకు ఒక నిధి ఉంటుందని చెప్పారు. అయితే

**కొత్తగాలి...**

**రాయితీ**
**అన్నంపై..**
**రాబడి**
**కూరలపై!**

– ఆరుద్ర శ్రీవిద్య,
ముల్కలపల్లి, వరంగల్ జిల్లా

ఆ నిధిని ఆ మతంవారికే ఉపయోగిస్తార ని కూడా చెప్పారు. మతంకంటే ప్రాణం ముఖ్యం. మనుగడకు ఏ మతమైనా ఒకటే అనుకుని సర్వేశలింగం క్రిస్టియానిటీ పుచ్చుకున్నాడు. ఆంథోని అని పేరు మార్చుకుని, బైపాస్ సర్జరీ చేయించుకున్నా డు. అప్పుడు వూళ్ళోవాళ్ళంతా ఆ విషయం వింతగా చెప్పుకున్నారు.

ఆంజనేయులు కుటుంబంవారు కూడా అలాంటి పరిస్థితుల్లో ఏమైనా మతం మా రి వుంటారా?

తన ఆలోచనకు సుబ్బారావుకి నవ్వొ చ్చింది. ముసుగులో గుద్దులాట ఎందుకు? డాక్టర్ మార్గరెట్ ఇంటికి వెళ్ళి కనుక్కుంటే తన సందేహం తీరిపోతుంది గదా! అనుకున్నాడు.

కొంతసేపటి తర్వాత మల్లీశ్వరి మార్గ రెట్ అయితేనేం? కాకపోతేనేం? తనకెం దుకు ఆ గొడవ? అనిపించింది. కాని ఎందుకో మనసు ప్రశాంతంగా లేదు. ఆమె గురించి తెలుసుకోవాలనే ఆలోచన బలంగా కలిగింది.

కొన్ని కొన్ని సంఘటనలు అనూహ్యంగా జరుగుతాయి. జీవితాలను అనుకోని మలుపులు తిప్పుతాయి. సుబ్బారావు విష యంలో సరిగ్గా అట్లాగే జరిగింది. విశ్వ నాథ్ తండ్రి వర్ధంతికి సుబ్బారావు హాస్పి టల్‌కి వెళ్ళకపోతే డాక్టర్ మార్గరెట్‌ని చూసేవాడుకాదు. అతని జీవితం మలుపు తిరిగేది కాదు.

మర్నాడు సుబ్బారావు డ్రైవర్ని వద్దని చెప్పి, తనే డ్రైవ్ చేసుకుంటూ మిషనరీ హాస్పిటల్‌కి వెళ్ళాడు. ఆ రోజు డాక్టర్ మార్గరెట్ రాలేదని తెలిసింది. ఆమెను పర్సనల్‌గా కలవాలని అంటే ఇంటి అడ్రస్ యిచ్చారు. సనత్‌నగర్లో ఇండిపెండెంట్ బిల్డింగ్. ఇంట్లో ఆమె భర్త, పిల్లలతో వుంటుందని వూహించుకుని వెళ్ళాడు.

గేటు దగ్గర నిల్చుని చూశాడు. పైప్‌తో మొక్కలకు నీళ్ళు పెడుతున్న ముసలాయ న కనిపించాడు. తెల్లటి గడ్డం వుంది.

"హలో!" అన్నాడు సుబ్బారావు.

"యస్!" అని ఆ ముసలాయన వచ్చి గేటు తెరిచాడు.

వరండాలో కుర్చీలు వేసి వున్నాయి.

"వెల్‌కమ్...!" అన్నాడు.

సుబ్బారావు "థాంక్స్!" అని వెళ్ళి వరం డాలో వున్న ఓ కుర్చీలో కూర్చున్నాడు.

కాసేపటికి ఆ ముసలాయన వచ్చి సుబ్బారావు పక్కనే కూర్చున్నాడు. ఇంట్లో ఏ విధమైన సందడి లేకపోవడం అతన్ని ఆశ్చర్యం కలిగించింది. ఎవరూ మనుష లున్నట్లు లేదు.

"డాక్టర్‌గారి కోసం వచ్చానండీ" అన్నాడు సుబ్బారావు.

"మార్గరెట్ కోసమా? హాస్పటల్లో వుంటుంది. అక్కడికి వెళ్ళలేదా? " అడి గాడు ఆయన.

"అక్కడికి వెళ్ళానండీ. లేరని హౌస్ అడ్రస్ యిచ్చారు" అన్నాడు.

"మార్గరెట్ సర్జన్. వేరే హాస్పిటల్ వాళ్ళు పిలిస్తే వెళ్ళివుంటుంది. ఏమిటి మీ పని? మీరెవరు? " అన్నాడు.

"నా పేరు సుబ్బారావు. నేను బిల్డర్‌ని. మాకు కన్‌స్ట్రక్షన్ కంపెనీ వుంది" అన్నాడు.

ముసలాయన ముఖం రంగులు మారింది. ప్రశాంతంగా వున్న ఆయన ముఖం సీరియస్‌గా వుందిప్పుడు.

"సార్! మీరు? " అడిగాడు ఆ ముసలా యన గురించి తెలుసుకుందామని.

"నా పేరు అగస్టీన్. మార్గరెట్ నా కూతురు. సారీ మిస్టర్ సుబ్బారావ్! మేము ఈ బిల్డింగ్ డెవలప్‌మెంట్‌కి ఇవ్వం. ఈ సంగతి ఇప్పటికే చాలామం దికి చెప్పాం" అన్నాడు.

తను బిల్డర్‌నని చెప్పగానే ఆయన ముఖం ఎందుకు సీరియస్‌గా మారిందో సుబ్బారావుకి అర్థమైంది. ఆ బిల్డింగ్ ప్రైమ్ లొకేషన్‌లో వుంది. కమర్షియల్ కాంప్లెక్స్ కడితే మంచి డిమాండ్ వుంటుంది. అందుకే చాలామంది ప్రయత్నించి ఉంటారు. తను గూడా అందుకే వచ్చానని అనుకుని వుంటాడు.

"నేను అందుకు రాలేదండీ. డాక్టర్‌గారిని కలవాలని వచ్చాను. ఆమె హస్బెండ్, పిల్లలు ఎవరూ ఇంట్లో లేరా? " అన్నాడు.

ఆ ముసలాయన నవ్వాడు

"నేను చర్చి ఫాదర్‌ని, ఇప్పుడు కాదు. వయసు మీద పడటంతో రిటైరయ్యాను. మార్గరెట్ నా కూతురు. ఆమెకు పెళ్ళికాలేదు" అన్నాడు అగస్టీన్.

సుబ్బారావుకి తల తిరిగింది. 'ఐతే తను వూహించిందంతా తప్పు. కాకినాడ మల్లీశ్వరికి, ఈ మార్గరెట్‌కి సంబంధం లేదు. ఆమె ఆంజనేయులు కూతురు. ఈమె అగస్టీన్ కూతురు. నో ఛాన్స్. ఇద్దరికీ ముఖంలో పోలికలు వున్నాయి అంతే' అనుకున్నాడు.

"ఫాదర్! నేను మళ్ళీ వచ్చి కలుస్తాను" అన్నాడు సుబ్బారావు ఛైర్‌లో నుంచి లేచి నిల్చుని.

## కొత్తగాలి...

**'గడ్డి' తిన్నారు సరే,**
**'గాలి'నీ 'బొగ్గు'నూ తిన్నారు**
**ఆఖరికి 'ఫైళ్లు' కూడా తిన్నారు!**

– పుల్లేటికుర్తి సత్యాచార్యులు,
పాత గాజువాక, విశాఖ జిల్లా

"మీ కార్డ్ ఇవ్వండి. అమ్మాయికి ఇస్తాను" అన్నాడు అగస్టీన్.

'ఈ మార్గరెట్ మల్లీశ్వరి కాదని తేలిపోయింది. ఒకవేళ ఆంజనేయులు ఏమైనా మతం మార్చుకున్నాడేమో, మల్లీశ్వరి మార్గరెట్ అయిందేమోనని వూహించుకున్నాడు. ఆమె ఫాదర్ అగస్టీన్ కూతురని తెలిశాక ఇక ఆమెతో పని ఏముంది? ' అనుకున్నాడు.

ముసలాయన అడిగాడు కాబట్టి తన కార్డ్ తీసి ఇచ్చాడు.

ఆఫీసుకి వెళ్ళగానే కిరణ్‌రావు "ఎక్కడికి వెళ్ళి వస్తున్నావ్" అన్నాడు.

డాక్టర్ మార్గరెట్ ఇంటికి వెళ్ళొస్తున్నానని చెప్పబుద్ధి కాలేదు. ఎందుకు? ఏమిటి? అని సవాలక్ష ప్రశ్నలు వేసి చంపుతాడు.

"డాక్టర్ దగ్గరికి వెళ్ళాలే. సరిగా నిద్రపట్టడం లేదు. బి.పి. లో తేడా వుందేమోనని చెక్ చేయించడానికి వెళ్ళాను" అన్నాడు.

"నిద్రెందుకు పట్టడం లేదు? ఇప్పుడేం ప్రాబ్లమ్స్ వున్నాయి? ఏదైనా తీవ్రమైన ఆలోచనలుంటేనే మెదడు వేడెక్కి నిద్రపట్టదు"

"పిల్లల్తో ప్రాబ్లమ్‌గా వుందోయ్! ఎవడిష్టం వచ్చినట్లు వాడు బిహేవ్ చేస్తున్నాడు. వాళ్ళకి తల్లి వత్తాసు. పైగా నేను పట్టించుకోవడం లేదని నన్ను బ్లేమ్ చేస్తుంది. నేను సంపాదించి తెచ్చి పడేస్తున్నా కదా? ఇల్లు మేనేజ్ చేసుకోలేదా? " చిరాకుగా అన్నాడు సుబ్బారావు.

కిరణ్‌రావు నవ్వాడు.

"పిల్లల గురించి మీ ఇద్దరూ కీచులాడుకుంటున్నారన్నమాట. బాగుంది. అందుకని మార్నింగ్ టిఫిన్ తినకుండా వచ్చేశావన్నమాట" అన్నాడు.

"హేమ ఫోన్ చేసి చెప్పిందా? "

"మనం తినకపోతే వర్రీ అయ్యేదెవరు? పెళ్ళికాక ముందు తల్లి, పెళ్ళయ్యాక

భార్య. అందుకే తల్లి చచ్చిన జిహ్వ చచ్చును అన్నారు. భార్య కూడా పోతే 'తిన్నావా?' అని అడిగే దిక్కుండదు" అన్నాడు కిరణ్‌రావు.

మధ్యాహ్నం లంచ్ చేసి రిలాక్సు అవుతుండగా సెల్ మోగింది. మోడెమ్‌లో కొత్త నెంబర్ చూసి 'ఎవరబ్బా' అనుకుంటూనే "హలో..!" అన్నాడు.

"ఐయామ్ డాక్టర్ మార్గరెట్! ఈజిట్ మిస్టర్ సుబ్బారావ్?" మృదువైన కంఠం వినిపించింది.

"యస్.. యస్ మేడమ్"

"సుబ్బారావు గారూ! మీరు మా ఇంటికి వచ్చి వెళ్ళారని డాడీ చెప్పారు. వాట్ కెన్ ఐ డు ఫర్ యు? విశ్వనాథ్‌గారిలా మీరేదైనా ఫంక్షన్ చేయాలనుకుంటున్నారా? మీరు హాస్పిటల్లో మేడమ్ ఫాతిమాను కన్సల్ట్ చేయవచ్చు. జనరల్‌గా ఇటువంటి ఫంక్షన్లన్నీ మేడమ్ ఆర్గనైజ్ చేస్తుంటారు. నిన్న మేడమ్ లీవ్‌లో ఉండడంతో నేను నిర్వహించాను" మార్గరెట్ నాన్‌స్టాప్‌గా మాట్లాడుతోంది.

ఆమె తియ్యటి కంఠం వింటూ వుండిపోయాడు సుబ్బారావు.

"నో మేడమ్! నేను అందుకు రాలేదు"

"అలాగా? మరేంటి"

"ఫోన్‌లో అడగడం బాగుండదు. మీతో టెన్‌మినిట్స్ పర్సనల్‌గా మాట్లాడ్డానికి టైమ్ ఇవ్వండి"

"ఓకే, ఈవెనింగ్ ఫైవ్‌కి ఇంటికి రండి"

"థాంక్యూ!" అన్నాడు సుబ్బారావు

మార్గరెట్ కంఠం శ్రవణానందంగా వుంది. ఆమె మాట్లాడుతుంటే ఇంకా ఇంకా వినాలనిపిస్తోంది. మనసుకి ఎంతో రిలీఫ్‌గా వుంది. చల్లటి చెట్టునీడలో సేద తీరుతున్నంత హాయిగా వుంది. మార్గరెట్ ముఖం తనకు పదే పదే కళ్లముందు కనిపిస్తోంది. ఆమె ఎందుకు తనను ఆకర్షిస్తోంది? ఆమె మల్లీశ్వరి ఏమోనని తెలుసుకోవాలనే కుతూహలం వల్లనేనా? మార్గరెట్ మల్లీశ్వరి కాదని తేలిపోయింది కదా? ఇంకా ఆమెతో ఏం మాట్లాడతాడు? ఆమెను మళ్ళీ చూడాలనే కోరికతోనేనా? సుబ్బారావుకి తన మనసేంటో అర్థం కావడం లేదు. ఈ వయసులో తన మనసు తడబడుతోందేమిటి?

సాయంకాలం ఐదు గంటలు ఎప్పుడవుతుందా? అని ఎదురు చూశాడు. కోట్లు లాభం వచ్చే బిజినెస్ డీల్ కోసం గూడా అతను అంత ఆత్రుత పడలేదు. ఏమిటో? మనసు విచిత్రమైంది.

సుబ్బారావు మార్గరెట్ ఇంటి ముందు కారు ఆపగానే నౌకరు గేటు తీశాడు.

"అమ్మగారు పైన వున్నారండీ. మిమ్మల్ని పైకి రమ్మన్నారు" అంటూ మెట్లు చూపించాడు.

చుట్టూ చెట్లుపెరిగిన చల్లటి వాతావరణంలో ఆ రెండతస్తుల బిల్డింగ్‌ను అందంగా కట్టించారు. సిటీలో వందగజాల స్థలం వుంటే కింద షట్టర్లు, పైన నాలుగు అంతస్తులు కట్టి అద్దెలకిచ్చుకుంటారు జనం. ఆరొందల గజాల స్థలంలో కేవలం ఇద్దరు మనుషులు హాయిగా ఎంతో అభిరుచితో బిల్డింగ్ కట్టించుకోవడం పాతకాలంలో వుండేది. ఇప్పుడు అరుదు. సుబ్బారావు నెమ్మదిగా మెట్లెక్కి



## భళ్‌భళే!

హ్యారీ పాటర్ రచయిత్రిగా ప్రపంచ ప్రసిద్ధిపొందిన బ్రిటిష్ నవలా రచయిత్రి జె.కె. రౌలింగ్ ఓ నవల గానీ, పుస్తకం గానీ రాయడం మొదలుపెడితే పూర్తయ్యేవరకూ ప్రతిక్షణం దానిగురించే ఆలోచిస్తుందట! తన కూతురు జెస్సికా పడుకోగానే దగ్గరలోని కేఫ్‌కి వెళ్ళి గబగబా రాసుకుంటుందట!

మేడపైకి వెళ్ళాడు.

"వెల్‌కమ్ మిస్టర్ సుబ్బారావ్? "

ఇనుప గ్రిల్స్ మీద పొదరిల్లులా అల్లుకున్న తీగల కుటీరంలో హుందాగా కూర్చుని వున్న మార్గరెట్‌ని ఆశ్చర్యంగా చూశాడు సుబ్బారావు.

అక్కడ ఎన్నో పూల మొక్కలు కుండీలలో కనువిందు చేస్తున్నాయి. రకరకాల రంగురంగుల పూలు విప్పారి చల్లటి గాలికి తలలూపుతుంటే, తనొక వుద్యానవనంలోకి అడుగుపెట్టిన అనుభూతి కలిగింది అతనికి.

అక్కడి వాతావరణమే అతనికి ఆశ్చర్యం కలిగిస్తే, ఇక మార్గరెట్‌ని చూసి అతనికి మతిపోయింది. నిన్న హాస్పిటల్లో తెల్లటి యూనిఫాంలో ఆమె ముఖం మాత్రమే చూసి ఆకర్షణకు లోనయ్యాడు. ఇప్పుడామె లేత నీలిరంగు సిల్క్ చీరలో సరికొత్తగా కనిపించింది. నిన్నటి మార్గరెట్‌కి, ఈమెకు పోలికలే లేనంత డిఫరెంట్‌గా వుంది.

మార్గరెట్‌కి ఇంచుమించు నలభై ఏళ్లుంటాయేమో! పెళ్లికాకపోవడం వల్ల, పిల్లలు కలగనందువల్ల ఆమె అందం చెక్కు చెదరలేదు. అద్భుతమైన అందం మార్గరెట్‌ది. అందమే కాకుండా ఆమె కళ్లల్లో ఏదో ఆకర్షణ ఉంది. ఇంత వయసొచ్చిన తనే ఆమె నుంచి చూపులు తిప్పుకోలేకపోతుంటే, ఆమె టీనేజ్‌లో వుండగా ఎందరు యువకులు ఆమెకోసం అర్రులు చాచారో? ఆమెను అందుకోలేక గుండె పగిలి ఆత్మహత్యలు గూడా చేసుకుని వుంటారు.

"రండి సుబ్బారావ్! ప్లీజ్ కూర్చోండి" ఆమె ఎదురుగా వున్న కుర్చీ చూపించింది.

ఆమె అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తుంటే ఒక్క క్షణం అతని గుండె ఆగినట్లనిపించింది.

సభ్యత కాదని తెలిసినా ఆమె నుంచి చూపులు తిప్పుకోలేకపోతున్నాడు. ఆమె మెడలో సన్నటి బంగారు చెయిన్, ఆమె శరీర ఛాయలో ఇమిడిపోయింది. ఆమె మందహాసం చేస్తుంటే గులాబీరంగు బుగ్గలు ఆ నీరెండలో తళుక్కున మెరిశాయి. లిప్‌స్టిక్ వేసుకోకపోయినా ఎర్ర గులాబీ మొగ్గల్లా వున్నాయి ఆమె పెదవులు.

ఆమె ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

"మార్నింగ్ మీరొచ్చి వెళ్లారని డాడీ చెప్పారు. మీరు బిల్డరని చెప్పారటగా? డాడీ అపార్థం చేసుకున్నారట. డెవలప్‌మెంట్‌కి ఇవ్వండని చాలామంది ఇంటి చుట్టూ తిరిగి విసిగిస్తున్నారు. ఒకప్పుడు ఇక్కడ ప్రశాంతంగా వుండేది. ఇప్పుడంతా అపార్ట్‌మెంట్లు, మల్టీ స్టోరీడ్ బిల్డింగ్స్ వచ్చి కమర్షియల్ ఏరియాగా మారిపోయింది. ఇక్కడ ఎక్కువ రోజులు వుండలేనేమో అనిపిస్తోంది. ఐ లవ్ నేచర్. చెట్లు, పూలమొక్కలంటే ప్రాణం. డాడీ నుంచి నేర్చుకున్నాను. డాడీ ఈ వయసులో గూడా స్వయంగా మొక్కలకు నీళ్ళు పోస్తుంటారు. అప్పుడుగాని తృప్తి పడరు"

ఆమెమాటలు తియ్యగా, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు గూడా హాయిగా వున్నాయి. అప్పుడే స్నానం చేసి వచ్చిందేమో ఆమె దేహం

---

**కొత్తగాలి...**

**పాఠాలు నేర్పి**
**పరీక్షలు పెట్టేది చదువు!**
**పరీక్షలు పెట్టి**
**గుణపాఠాలు నేర్పేది జీవితం!!**

– జి.వి. రాఘవేంద్రరావు,
మచిలీపట్నం

---

నుంచి వస్తున్న సువాసన అతని ముక్కుకి మత్తుగా తాకుతోంది.

"అవును. నేను వచ్చినప్పుడు ఆయన మొక్కలకు నీళ్ళు పడుతున్నారు" అన్నాడు సుబ్బారావు.

"నిజానికి నాకు ఈరోజు వీక్లీఆఫ్. ఎక్కడికీ వెళ్ళగూడదనీ, నాకు ఇష్టమైన పాత పాటలు వింటూ ఎంజాయ్ చెయ్యాలనీ అనుకున్నాను. రొటీన్ నుంచి పూర్తిగా రెస్ట్ తీసుకోవాలనుకున్నాను. కాని మా కాకినాడ అమ్మాయి కొచ్చిన ప్రాబ్లమ్ గురించి వెళ్ళాల్సొచ్చింది"

"మీది కాకినాడా? " ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

"ఔను. మీరెందుకు అంత ఆశ్చర్యపోతున్నారు" మార్గరెట్ ప్రశ్నించింది.

"ఆశ్చర్యమే మరి. మిమ్మల్ని నిన్న హాస్పిటల్లో ఫస్ట్‌టైమ్ చూసినప్పుడు ఎప్పుడో, ఎక్కడో చూసినట్లనిపించింది. కాకినాడలో పరిచయమైన ముఖమే అనుకున్నాను. ఎంతకీ గుర్తు రాలేదు. తల బద్దలు కొట్టుకున్నాననుకోండి"

మార్గరెట్ పకపకా నవ్వింది.

ఆమె నోరు నెమ్మదిగా విచ్చుకుని, ముత్యాలవంటి పలు వరస మనోహరంగా మెరిసింది.

"మీది కూడా కాకినాడా ఏం? " అన్నదామె నవ్వు ఆపుకుంటూ.

"కాదు. కాని నేను ఇంజినీరింగ్ కాకినాడలో చేశాను"

"ఐసీ...!" అన్నదామె కళ్ళు తమాషాగా ఆర్పుతూ.

"అక్కడున్న కాలంలో మిమ్మల్ని ఎప్పుడో చూసి వుంటాను. ఒకసారి కాదు. సంవత్సరాల తరబడి పరిచయమై వుంటుంది. అందుకే నా మనసులో రిజిష్టరై వుంది"

"కాకినాడలో ఎక్కడ వుండేవారు? "

"రామారావు పేటలో...!"

ఈసారి మార్గరెట్ ముఖంలో సంభ్రమాశ్చర్యాలు తొంగి చూశాయి.

"మేమున్నది అక్కడే" అన్నది ఆశ్చర్యం నుంచి తేరుకుని.

"మేం నలుగురం ఇంజినీరింగ్ స్టూడెంట్స్ ఒక ఇల్లు అద్దెకు తీసుకుని వంట చేసుకుని తినేవాళ్ళం. హాస్టల్లో తిండి రుచించక బైటకు వచ్చేశాం. మా వీధిలోనే ఆంజనేయులుగారని వుండేవారు. వారి అమ్మాయిది అచ్చు మీ ముఖమే. ఆమె పేరు మల్లీశ్వరి. నిన్న మిమ్మల్ని చూడగానే మల్లీశ్వరి గుర్తొచ్చింది. కాని మీ పేరు మార్గరెట్ అని తెలిశాక నిరాశ చెందాను. కాని సందేహం తీరలేదు. అది తేల్చుకోడానికే మార్నింగ్ ఇక్కడికి వచ్చాను. తీరా వచ్చాక ఫాదర్ అగస్టీన్ మీరు తన కూతురని చెప్పారు. ఇక మల్లీశ్వరి కాదని కన్‌ఫమ్ చేసుకుని వెళ్ళిపోయాను. మీ డాడీ విజిటింగ్‌కార్డ్ అడిగితే ఇచ్చాను" చెప్పాడు సుబ్బారావు.

అతను చెప్తున్నంతసేపూ ఆమె తల వూపుతూ శ్రద్ధగా విన్నది.

"మార్గరెట్ మల్లీశ్వరి ఎట్లా అవుతుంది? పేరులోనే తేడా వుంది కదా? ఇంకా మా ఇంటికి వచ్చి కన్‌ఫమ్ చేసుకోవాలని ఎందుకనుకున్నారు? "

"ఏదో ఆశ. ఆంజనేయులుగారు ఏమైనా పరిస్థితుల ప్రభావం వలన క్రిస్టియానిటీ తీసుకున్నారేమో? మల్లీశ్వరిని మార్గరెట్ చేశారేమో? "

ఈసారి మార్గరెట్ పెద్దగా నవ్వింది.

"మనిషి మతం ఎందుకు మార్చుకుంటాడు? ఆ పరిస్థితులు ఏమై వుంటాయనుకుంటున్నారు? "

సుబ్బారావు తను చిన్నప్పుడు విన్న సర్వేశలింగం వుదంతం చెప్పాడు. అదంతా విన్న మార్గరెట్ కొన్ని క్షణాలు

మౌనంగా వుండిపోయింది. కళ్ళు మూసుకుంది.

ఆమెను చూస్తున్న సుబ్బారావుకి పాలరాతి వీనస్ శిల్పం గుర్తొచ్చింది. తన్మయుడైపోయి చూస్తుండిపోయాడు రెప్పవాల్చకుండా.

పనిమనిషి ట్రేలో డిష్‌లు, నీళ్ళ గ్లాసులు, ప్లేట్లు పెట్టుకుని వచ్చి ఇద్దరి మధ్య ఉన్న టీపాయ్ మీద వుంచింది. ఆ చప్పుడుకి మార్గరెట్ కళ్ళు తెరిచి చూసింది.

డిష్ తీసి ప్లేట్లలో పెసరట్లు పెట్టింది.

"నాకు ఇష్టమైన డిష్ యిది. అల్లం, పచ్చిమిర్చి, వుల్లిపాయలు, జీలకర్ర కాంబినేషన్‌తో చేసిన పెసరట్ల రుచి మాటల్లో వర్ణించలేనిది.. తీసుకోండి" అన్నది.

"ఔను. పెసరట్టు, వుప్మా కాంబినేషన్ని ఎమ్మెల్యే పెసరట్టు అంటారు" అన్నాడు.

"నేనూ విన్నాను" అన్నది.

ఇద్దరూ పెసరట్లు తిన్నాక, కాఫీ కప్పులు తెచ్చింది పనిమనిషి. ఇద్దరూ కాఫీ సిప్ చేస్తుండగా "మీరు భలే పట్టుదల గల మనిషని నాకు అర్థమైంది" అన్నది మార్గరెట్.

"ఎందుకలా అనుకుంటున్నారు? "

"నిన్న మీరు నన్ను హాస్పిటల్లో చూసినప్పుడు ఎక్కడో చూసినట్లు అనిపించింది. వేరే ఎవరైనా అయితే గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నించి విఫలురై ఇక ఆ సంగతి మర్చిపోయేవారు. కాని మీరు ఆ మల్లీశ్వరి మార్గరెట్టేమో అనే జిజ్ఞాసతో అదే పని మీద వున్నారు" అన్నది.

"నిజమే. ఏదైనా సందేహం వచ్చినప్పుడు దాని గురించి తెలుసుకునే దాకా నిద్రపట్టదు నాకు" నవ్వి అన్నాడు సుబ్బారావు.

"మీ జిజ్ఞాస ఫలితంగా నాకు ఒక్కసారిగా గతం గుర్తొచ్చేట్లు చేశారు"

"గతమా? "

"ఔను"

"మీకు అభ్యంతరం లేకపోతే చెప్పండి"

"అభ్యంతరం ఏమీలేదు. కాకపోతే ఇప్పుడు కాదు. తర్వాత ఎప్పుడైనా చెబుతాను. ప్రస్తుతానికి ఒక విషయం చెప్తాను.. నేను మల్లీశ్వరినే" అన్నది మార్గరెట్.

సుబ్బారావు అదిరిపడ్డాడు. సంభ్రమాశ్చర్యాలతో ఆమెవైపు చూశాడు.

"యస్" అన్నది మార్గరెట్ మనోహరంగా నవ్వుతూ.

ఇంతలో ఆమె సెల్‌ఫోన్ రింగైంది. ఆమె పిట్టగోడ దగ్గరకు వెళ్ళి ఎవరితోనో మాట్లాడి వచ్చింది.

"సారీ సుబ్బారావుగారూ! నేను అర్జెంట్‌గా బైటకు వెళ్ళాలి. వేరే ఎంగేజ్‌మెంట్ వుంది. మళ్ళీ ఎప్పుడైనా కలుద్దాం. ఓకే మరి? " అన్నది మార్గరెట్.

"దట్సాల్ రైట్" అన్నాడు సుబ్బారావు.

ఇద్దరూ కిందకు దిగివచ్చారు. మార్గరెట్ గేటు వరకూ వచ్చి అతనికి 'బై' చెప్పి సాగనంపింది.

సుబ్బారావు కారెక్కి స్టార్ట్ చేశాడు. ఇప్పుడు అతని మనసు ప్రశాంతంగా వుంది. ఏదో పెద్ద సాహసం చేసినట్లు ఫీలింగ్ కలిగింది.

మార్గరెట్ సమక్షంలో తనకు చాలా కంఫర్టబుల్‌గా వుంది. వేరే ప్రాపంచిక విషయాలేమీ గుర్తు రావడంలేదు. తన ఇబ్బందులన్నీ మరచిపోయి ఆమెను అలాగే చూస్తూ, ఆమెతో మాట్లాడుతూ, ఆమె మాటలు వింటూ ఎంతసేపైనా గడపాలని పిస్తూవుంది. ఆమె సమక్షంలో తను సాంత్వన పొందుతున్నాడు. ఆమెలో ఏదో ఆకర్షణ తనను లాక్కెళ్తోంది. ఎందుకు? ఇప్పుడేం జరగబోతోంది?

మల్లీశ్వరి మార్గరెట్‌గా ఎందుకు మారింది? కారు లాగానే అతని మన

సులో ఆలోచనలు పరిగెత్తుతున్నాయి.




ఉదయం ఎనిమిదిన్నరైంది. సుబ్బారావు డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని టిఫిన్ తింటున్నాడు. ఇక ఆఫీసుకి బయల్దేరడమే తరువాయి. కింద హాల్లో నుంచి ఏడుపు వినిపించింది. సన్నగా వినపడుతోంది. ఎవరో ఆడమనిషి రోదన. ఒకవేళ టీవీలో నుంచి గాని వస్తున్నదేమో అనుకున్నాడు.

వంటమనిషి హడావుడిగా వచ్చి, "అయ్యగారూ! అమ్మగారు ఎందుకో ఏడుస్తున్నారండీ" అన్నది.

"ఎందుకు? " అడిగాడు

"ఏమోనండీ. ఎవరితోనో ఫోన్లో మాట్లాడారండీ. అక్కడ్నుంచి ఏడుస్తున్నారండీ" అన్నది.

"వాళ్ళ నాన్నగాని చచ్చిపోయాడేమో? " అన్నాడు సుబ్బారావు.

హేమలత ఏడుస్తుంటే అతనిలో చలనం కలగడం లేదు. వాళ్ళ నాన్నంటే అసలు ఇష్టం లేదు. డబ్బు... డబ్బు అని కలవరిస్తుంటాడు. ఆయన మనసులో ఆలోచనలన్నీ డబ్బు చుట్టూరా తిరుగుతుంటాయి. తను వుద్యోగంలో వున్నంత కాలం 'ఏం సంపాదించావు? ' అని సతాయిస్తుండేవాడు. ఎప్పుడన్నా అతను ఇంటికి వచ్చినప్పుడు పిల్లలు మంచిబట్టలు వేసుకున్నా సహించేవాడు కాదు. 'ఎందుకమ్మా అంతంత ఖరీదైన బట్టలు? మనవేమన్నా జమీందారులమా? ఏది కట్టుకున్నా జరిగిపోద్ది' అని విమర్శించేవాడు. ఒకరోజు పిల్లలు కోడిగుడ్డుతో అన్నం తింటుంటే చూశాడు. కూతుర్ని మందలించాడు. 'పిల్లలకు ఒక్కొక్క గుడ్డు పెడుతున్నావా? సగం గుడ్డు సరిపోదా? ఇట్టాగైతే బాగుపడ్డట్టే' అన్నాడు. తనకి కోపం వచ్చింది. ఏదో ఒకటి అనాలనుకున్నాడు. మళ్ళీ పెద్దవాడయిన అతను ఏడ్చిపోతాడని వూరుకున్నాడు. 'ఏంటి మీ నాన్న అంత దరిద్రంగా మాట్లాడుతాడు. తిండీ తినక, బట్టలూ తొడక్క ఇక డబ్బు సంపాదించేది ఎందుకు? ' అంటే, హేమలత నవ్వి 'మా నాన్న అంతేలెండి. మా చిన్నప్పుడు కూడా ఇట్లాగే సతాయించేవాడు. ఆయన మారడు' అన్నది. అటువంటివాడు పోతే ఎవరికి సానుభూతి వుంటుంది?

హేమలత కూతురు కాబట్టి ఏడుస్తుంది. సుబ్బారావు తాపీగా కాఫీ తాగి వెళ్ళాడు. పెద్ద కొడుకుకోసం ఎయిర్‌పోర్టుకి వెళ్ళి డబ్బు కట్టి వచ్చినప్పటి నుంచి అతను భార్యతో మాట్లాడ్డంలేదు. ఆమె గూడా ముభావంగా వుంటోంది. ఇంట్లో అన్నిటికీ పనిమనుషులు వుండడం వలన భార్యతో పలక్కుండానే అతని పనులు జరిగిపోతున్నాయి. ఇక ఎవరి పడక గదులు వాళ్ళకి వుండనే వున్నాయి. ఎప్పుడో మూడొచ్చినప్పుడు భార్యాభర్తలు ఒకగదిలో చేరతారు. ఈ మధ్య అదీ అరుదుగా జరుగుతోంది.

'ఇక ఏడుస్తుంటే గూడా పలకరించకపోతే బాగుండదు. ప్రయాణానికి ఏర్పాట్లు చేసుకోవాలి. రెండు రోజులు వుండేట్టుగా బట్టలు సర్దుకుని రమ్మని డ్రైవర్‌కి చెప్పాలి' అనుకుంటూ హేమలత దగ్గరికి వెళ్ళాడు

సుబ్బారావు.

"ఏమైంది హేమా? " అన్నాడు.

"చిన్నోడికి యాక్సిడెంట్టైందటండీ!" అన్నది ఏడుపు ఆపుకుంటూ.

బాగా ఏడవడం వలన హేమలత ముఖం వుబ్బింది. కళ్ళు ఎర్రబడ్డాయి.

"వాట్? " అన్నాడు అదిరిపడి.

అతని అంచనాలు తల్లకిందులయ్యాయి. భార్య ఏడుస్తుంటే మావగారు పోయి వుంటాడని వూహించుకున్నాడు.

"వాడికి యాక్సిడెంటవడం ఏంటి? ఇంత పొద్దున్నే ఎక్కడికి వెళ్ళాడు? అప్పుడే కాలేజీకి వెళ్ళాడా? "

సుబ్బారావు ప్రశ్నలకు హేమలత సమాధానం చెప్పలేదు. మౌనంగా రోదిస్తోంది. తనకు తెలియకుండా కార్తీక్ ఏదో చేస్తున్నాడని అతనికి అనుమానం వచ్చింది. రోజూ పొద్దున్నే ఎక్కడికో వెళ్ళివస్తున్నాడన్నమాట.

"చెప్పు? ఇప్పుడు ఎక్కడున్నాడు? నీకెవరు చెప్పారు? అడిగాడు సుబ్బారావు.

"ఇన్స్పెక్టర్ చెప్పాడండి. హాస్పిటల్లో చేర్పించారట" చెప్పింది హేమలత.

"సరే పద. టిఫిన్ తిన్నావా? " అన్నాడు.

లేదని తల అడ్డంగా వూపింది.

"ముందు టిఫిన్ తిను. మళ్ళీ నీరసం వస్తుంది" అన్నాడు.

"వద్దండీ. తినబుద్ధి కావడం లేదు. వాడికి ఎట్లా వుందో ఏమిటో? " అన్నది.

"ఎట్లావున్నా మనం వెళ్ళి చేసేది ఏవుంది? ఏదో ఒకటి తిని రా..!" కఠినంగా అన్నాడు.

హేమలత ఏదో తిన్నాననిపించి బయల్దేరింది. ఇద్దరూ హాస్పిటల్ దగ్గరికి చేరేటప్పటికి అక్కడ చాలా హడావుడిగా వుంది. అక్కడ చాలామంది ఖద్దరు బట్టలు కట్టుకున్న పొలిటీషియన్లు కనిపించారు. టీ.వీ. ఛానల్స్ కెమెరావాళ్ళు మైకులు పట్టుకుని జర్నలిస్టులు వున్నారు. ఇన్స్పెక్టర్ మైకుల ముందు మాట్లాడుతున్నాడు.

సుబ్బారావుని, హేమలతను చూసి ఎ.సి.పి ముందుకు వచ్చాడు.

"మీరేనా కార్తీక్ పేరెంట్స్? "

"ఔనండీ.." అన్నాడు సుబ్బారావు.

"ఏమండీ మా కార్తీక్‌కి ఎలా వుందండీ? " వణుకుతున్న కంఠంతో అడిగింది హేమలత.

"ఆపరేషన్ థియేటర్లో వున్నాడమ్మా!" చెప్పాడు ఎ.సి.పి.

"ఏమైందండీ? యాక్సిడెంట్ ఎట్లా జరిగింది? " ప్రశ్నించాడు సుబ్బారావు.

"ఐతే మీరు టీవీలో న్యూస్ చూడలేదా? " ఆశ్చర్యం వ్యక్తం చేశాడు ఎ.సి.పి.

"లేదండీ. ఇన్స్పెక్టర్ ఫోన్ చేశారని మా మిసెస్ చెప్తే, వెంటనే బయల్దేరి వచ్చాం" అన్నాడు సుబ్బారావు.

"మినిస్టర్ దామోదర్ తెలుసు కదా? "

"పరిచయం లేదండీ"

"ఆయన కొడుకు జీవన్, మీ కార్తీక్ రింగ్‌రోడ్డులో స్పోర్ట్స్‌బైక్ మీద రైడ్ చేస్తుంటే యాక్సిడెంట్ అయింది" చెప్పాడు ఎ.సి.పి.

"మావాడు స్పోర్ట్స్‌బైక్ నడుపుతున్నాడా? " షాక్ తిన్నట్లయిపోయాడు సుబ్బారావు.

"ఔనండీ. చాలాకాలంగా రైడ్ చేస్తున్నారని తెలిసింది. ఆ కుర్రాళ్ళ ఫ్రెండ్స్ చెప్పారు. వీకెండ్స్‌లో పోటీలు జరుగుతాయట. లక్షల్లో బెట్టింగులు కాస్తున్నారట. మీకు తెలియదన్నమాట"

సుబ్బారావుకి మొహం మీద కొట్టినట్లనిపించింది. తన కొడుకు రోజూ రింగ్‌రోడ్డు మీద స్పోర్ట్స్‌బైక్ రైడింగ్ చేస్తుంటే తనకు ఆ విషయం తెలియదు. హేమలతకు

తెలుసేమో?

ఇంతలో అక్కడ సెక్యూరిటీవాళ్ళు హడా వుడి చేయడం మొదలుపెట్టారు. చీఫ్ మినిస్టర్ వస్తుంటే టీవీలవాళ్ళు ఎగబడ్డారు. కెమెరాలు తీసుకుని మంత్రులు, ఎమ్మెల్యేలు మినిస్టర్ దామోదర్‌ని పరామర్శిస్తున్నారు. సుబ్బారావు, హేమలత కారిడార్లో కూర్చుండిపోయారు. లోపల పిల్లల పరిస్థితి ఎలా వుందో తెలియడం లేదు. సుబ్బారావుకి ఆవేదనగా వుంది. పిల్లలు ఎందుకిలా తయారవుతున్నారో అర్థం కావడం లేదు. చదువుకునే వయసులో ఇతర వ్యాపకాల వైపు ఎందుకు ఆకర్షితుల వుతున్నారు? అది వయసు ప్రభావమా? ఒకళ్ళని చూసి మరొకళ్ళు అనుసరిస్తున్నారా? అపరిమితమైన డబ్బు ఇళ్ళల్లో చేరడం వలన దారి తప్పుతున్నారా?

సుబ్బారావు సెల్ మోగింది. కిరణ్‌రావు మాట్లాడాడు.

"సుబ్బా! ఎక్కడున్నావ్? "

"ఉస్మానియా హాస్పిటల్లో వున్నాను"

"టీవీన్యూస్‌లో చూశానోయ్! కార్తీక్‌కి ఎట్లావుంది? "

"ఏమో? ఏమీ చెప్పడం లేదు. ఇద్దరూ ఆపరేషన్ థియేటర్లో వున్నారని తెలిసింది"

"సరే! అక్కడే వుండు. వస్తున్నాలే" అన్నాడు.

కాసేపటికి సి.ఎం. వెళ్ళిపోయాక అక్కడ హడావుడి తగ్గింది. సుబ్బారావు రియల్ ఎస్టేట్ మిత్రులు, సిటీలో వున్న బంధువులు కొందరు అక్కడికి చేరుకున్నారు. తెనాలి నుంచి హేమలత తండ్రి, తమ్ముడు, చిలుమూరు నుంచి సుబ్బారావు తమ్ముళ్ళు, ఇంకా ఇతర చుట్టాలు ఒకటే కాల్స్ చేస్తున్నారు. సెల్‌ఫోన్ విరామం లేకుండా మోగుతోంది. సుబ్బారావు ఉక్కిరి బిక్కిరవుతున్నాడు. అతనికి మనసులో అనుమానం మొదలైంది. కార్తీక్‌కి ఏమీ కాలేదు కదా? తమకి చెప్పడం లేదేమో?

మరొకపక్క మినిస్టర్ దామోదర్ తాలూకు ఆడవాళ్ళు పెద్దపెట్టున ఏడుస్తున్నారు. సుబ్బారావుకి గుండె జారిపోయింది.

'అయ్యో! మినిస్టర్ గారబ్బాయి చనిపోయాడట' అనే మాటలు అతని చెవులకు బుల్లెట్స్‌లా తాకుతున్నాయి.

'ఒకవేళ కార్తీక్ గూడా!' అనే ఆలోచన మనసులోకి వచ్చేసరికి తట్టుకోలేకపోయాడు. ఉద్వేగం ఆపుకోలేక దుఃఖం వచ్చింది. రెండు చేతులు ముఖానికి అడ్డం పెట్టుకుని ఏడుస్తుంటే, హేమలత అతని మీదకు వొరిగిపోయి పెద్దగా ఏడవడం మొదలుపెట్టింది.

అందరూ వాళ్ళని ఓదారుస్తున్నారు.

పిల్లలు చిన్నతనంలో బాలారిష్టాలకు లోనవుతారు. పెద్దయ్యేవరకు ఏదో ఒక రుగ్మత పిల్లల్ని పీడిస్తుంటుంది. శ్రీశైలంలో వున్నప్పుడు పసిపిల్లలకు ఏదో ఒకటి వస్తుండేది. ముగ్గురు పిల్లలు అక్కడే పెరిగారు. జ్వరం, జలుబు వంటివే కాకుండా ఒక్కోసారి డయేరియా బాధించేది. పిల్లల్ని హాస్పిటల్లో అడ్మిట్ చేసేవారు. అక్కడ సెలైన్ ఎక్కించేవారు. కొందరు పిల్లలు చనిపోయేవారు. ఆ తల్లిదండ్రుల ఏడుపులతో తాము హడలిపోయేవారు. రాత్రింబవళ్ళు హాస్పిటల్లో వుండాల్సొచ్చేది. తెనాలి నుండి అత్తగారు వచ్చేది, హేమలతకు తోడుగా వుండడానికి. సీజన్‌లో చికెన్ పాక్స్ వరుసగా పిల్లలందరికీ ఒకరి తర్వాత మరొకరికి అంటుకునేది. పిల్లల్ని వేప ఆకుల మీద పడుకోబెట్టడమే గాక, అత్తగారు ఎవర్నో పిలిపించి మంత్రాలు వేయించేది.

హైదరాబాద్ వచ్చాక పిల్లల్ని పట్టించుకోలేదు గాని శ్రీశైలంలో అపురూపంగా

చూసుకున్నాడు.

సుబ్బారావుకి అవన్నీ జ్ఞాపకం వచ్చేస రికి దుఃఖం మరింత పెరిగింది. ఏళ్ళ తర బడి ముద్దుగా పెంచుకున్న పిల్లలు కాస్త పెద్దవాళ్ళయ్యే సరికి స్వతంత్రంగా వ్యవహ రించడం మొదలు పెడుతున్నారు. అది సహజమేనేమో? కాకపోతే ఏదైనా జరిగిన ప్పుడు తల్లిదండ్రులు ఎంత క్షోభ అనుభ విస్తారు? పసిపిల్లలుగా పోయినప్పటి బాధ కొంత కాలమే వుంటుంది. కాని చెట్టంత ఎదిగినవాడుపోతే ఆ బాధ జీవి తాంతం వేధిస్తుంటుంది. మనిషికి మరిచి పోవడం సాధ్యంకాదు. అదొక నరకం.

"మీరేనా సుబ్బారావు గారు? "

ఎదురుగా పోలీస్ కమిషనర్ నిలబడి వున్నాడు.

సుబ్బారావు కళ్ళు తుడుచుకుని "ఔనండీ...!" అన్నాడు

"యు ఆర్ సో లక్కీ! యువర్ సన్ ఈజ్ ఔటాఫ్ డేంజర్" అన్నాడు

సుబ్బారావు వుద్వేగం ఆపుకోలేక ఏడు స్తున్నాడు.

"థాంక్యూ సర్! థాంక్యూ వెరీమచ్!" పోలీస్ కమీషనర్ చేతిని అందుకున్నాడు.

"పాపం మినిస్టర్ దామోదర్ కొడుకు సేవ్ కాలేకపోయాడు" విచారం వెలిబు చ్చాడు పోలీస్ కమీషనర్.

కార్తీక్ ని ఐ.సి.యు.లోకి తీసుకొచ్చాక వెళ్ళి చూశారు. తలకి కట్లుకట్టి వున్నాయి. శరీరంలో అక్కడక్కడ బ్యాండేజీలు వేసి వున్నాయి. అపస్మారక స్థితిలో వున్నాడు. ప్రమాదం నుంచి తప్పించుకున్నాడని తెలి శాక సుబ్బారావు మనసు కుదుట పడింది.

కిరణ్‌రావు సుబ్బారావుని హేమలతను దగ్గర్లోవున్న హోటల్ కి తీసుకెళ్ళాడు లంచ్ టైములో. భోజనం చేస్తూ మాట్లాడుకు న్నారు.

"టీవీలో న్యూస్ చూసి హడలిపోయాను సుబ్బూ! ఎంత్రా దేవుడా ఇట్లా అయిందను

## భలే భలే!

ఆఫ్రికా అమెరికన్ రచయిత రిచర్డ్ రైట్ తెలతెలవారుతుండగానే ఒక బాటిల్ ఇంక్, పసుపుపచ్చని ప్యాడ్, కొన్ని కాగితాలు, ఫౌంటె యిన్ పెన్ తీసుకుని గ్రీన్ పార్కు కెళ్లేవాడట. అందులోని ఓ చిన్న కొండెక్కి అక్కడి బెంచి మీద కూర్చుని చుట్టూ ఉన్న రాళ్లు, ఇళ్లను చూస్తూ, ఉషోదయపు ప్రకృతిని ఆస్వాదిస్తూ రాసుకునేవాడట!

కున్నాను. స్పోర్ట్స్‌బైక్ యాక్సిడెంట్ అంటే ఇక హోప్స్ లేవనుకున్నాను. దేవుడి దయ వల్ల సేవ్ అయ్యాడు" అన్నాడు కిరణ్ రావు.

"తప్పంతా మన దగ్గర పెట్టుకుని అంతా దేవుడి మీదకు తోసెయ్యడం మనకు అలవాటైపోయింది కిరణ్!" అన్నాడు సుబ్బారావు సీరియస్‌గా.

"అదేంటి సుబ్బూ! ఇందులో దేవుడి దయలేదంటావా? " తెల్లబోతూ అడిగాడు కిరణ్‌రావు.

"వీళ్ళకి పొగరెక్కి వందల మైల్లస్పీడ్‌తో బైక్‌రైడ్ చేసి యాక్సిడెంట్ పాలైతే, దేవు డెందుకు రక్షిస్తాడు? ఆ రక్షించేవాడు కార్తీక్ ఒక్కడ్నే ఎందుకు సేవ్ చేశాడు. మినిస్టర్ కొడుకు మీద ఎందుకు దయ చూపించలేదు? అన్నీ పిచ్చిమాటలు" కఠి నంగా అన్నాడు సుబ్బారావు.

"అదేంటి సుబ్బూ!"

"నిజం నిష్ఠూరంగా ఉంటుందోయ్! తప్పు మనది కాదంటావా? ఒక వైపు లక్షకి కారు వస్తుంటే, ఇరవై లక్షలు పెట్టి స్పోర్ట్స్‌బైక్ కొనివ్వడం ఏమిటి? పొగరు బట్టి కాకపోతే"

"వాట్! ఆ బైక్ ఇరవై లక్షలా? "

"కొనిచ్చిన మీ చెల్లెల్ని అడగవోయ్? " హేమలత వైపు తీవ్రంగా చూస్తూ

అన్నాడు సుబ్బారావు.

కిరణ్‌రావు మతిపోయినట్లు చూశాడు.

"ఏమ్మా! వాడికి నువ్వు కొనిచ్చావా ఆ బైక్? " హేమలతను ప్రశ్నించాడు కిరణ్‌రావు.

"ఔనన్నయ్యా!" అన్నది ఒప్పుకుంటూ హేమలత.

"అదేంటమ్మా? సుబ్బుకి చెప్పకుండా అంత కాస్ట్‌లీ బైక్ కొనివ్వడం ఏమిటి? వాడు స్టడీస్‌లో ఉన్నాడు కదా? అంత అవసరం ఏమిటమ్మా? " మందలింపుగా అన్నాడు కిరణ్‌రావు.

"ఆయనకు చెప్తే ఒప్పుకుంటారా? "

"అందుకని నాకు చెప్పక్కర్లేదనుకున్నావ న్నమాట. వాడు ఏదడిగితే అది కొనివ్వడ మేనా? రేపు విమానం అడుగుతాడు.. కొనిస్తావా? ఇంట్లో డబ్బుంటే కొనిస్తావు గూడా! ముందూవెనుకా చూసుకునేది లేదు" తీవ్రంగా అన్నాడు సుబ్బారావు.

"నేనేం చేసేది? వాడు ఒకటే పీడిం చాడు. ఆ మధ్య కారు కొనివ్వలేదని విశ్వే శ్వర్రావు కొడుకు ఆత్మహత్య చేసుకోలేదా? ఆయనకి ఎన్ని కోట్లున్నాయి? కొడుకు పోయాక ఇప్పుడు అవన్నీ ఏంచేసుకుం టాడు? వాడి కోరిక తీర్చకపోతే ఏదైనా చేసుకుంటాడని భయం వేసింది. తర్వాత ఏమనుకుంటే ఏంలాభం.. చెప్పు అన్నయ్యా? అందుకే ధైర్యం చేసి కొని చ్చాను. ఇట్లా జరుగుతుందని ఎందుకను కుంటాం, చెప్పండి? " అంది హేమలత.

భార్య మూర్ఖపు సంజాయిషీ విని సుబ్బారావుకి లోలోపల మండిపోతోంది! తల్లులు పిల్లల చేతుల్లో కీలుబొమ్మలేమో? వాళ్ళు ఆడించినట్లు ఆడతారు! అనుకుని కోపం అణచుకుని మౌనంగా ఉండిపో యాడు.

★ ★ ★

కార్తీక్ తలకు తగిలిన గాయం మానింది. కాని కుడికాలు విరిగింది. మామూలుగా విరిగితే కొన్ని వారాల్లో అతుక్కునేది. మోకాలు కింద ఎముక కొంత భాగం నుజ్జునుజ్జయింది. ముక్క లన్నీ తీసేసి స్టీల్ రాడ్స్, ప్లేట్లు పెట్టి బిగించి కట్టు కట్టారు. ఆ ఎముకకు మధ్యలో ఉన్న గ్యాప్ మళ్ళీ పెరుగుతుంద న్నారు డాక్టర్లు. బలమైన ఆహారం తింటూ, మందులు వాడుతూ ఉంటే, ఏడె నిమిది నెలలు పడుతుంది, లేచి నిలబడ డానికి. హాస్పిటల్ నుంచి డిశ్చార్జి చేసి ఇంటికి తీసుకొచ్చారు. కార్తీక్ చదువు ఆగి పోయింది. అతను ఒక గదికి పరిమితమ య్యాడు. డాక్టర్ కొంతకాలం రోజూ వచ్చి కట్టు కట్టేవారు స్వయంగా. తర్వాత ఒక నర్స్‌ని ఏర్పాటు చేశారు.

కార్తీక్‌కి జీవితం నరకం అనిపిస్తోంది. ఇరవైనాలుగు గంటలూ బెడ్ మీదనే పడు కోవడం కన్నా శిక్ష ఏముంటుంది? కాలు తీసి నేల మీద పెట్టడానికి లేదు. కాలకృ త్యాలు మంచం మీదే.

"నేను గూడా జీవన్‌గాడితో పాటే చస్తే పోయేది" అని ఏడవడం మొదలు పెట్టాడు స్నేహితులు పరామర్శించడానికి వచ్చినప్పుడు.

"ఊరుకోరా! లక్కీ ఫెలోవి కాబట్టే బతి కావు. ఆర్నెల్లు ఎట్లాగో గడుపు. మళ్ళీ

**కొత్తగాలి...**

**చట్టం**
**అయినవారికి**
**చుట్టం!**
**కానివారికి**
**చట్రం!!**

– చక్కా చెన్న కేశవరావు,
కావలి, నెల్లూరు జిల్లా

మామూలుగా కాలేజీకి వస్తావు. దర్జాగా తిరుగుతావు. ఓర్చుకో కొన్నాళ్ళు. ఏం చేస్తాం" అని ఫ్రెండ్స్ ఓదార్చి పోయే వాళ్ళు.

"నాకు ఏం తోచడం లేదమ్మా! నువ్వు దగ్గరకూర్చో. దేవుడు నన్నెందుకు బతికిం చాడు? నాకు బతకాలని లేదమ్మా! రాత్రిళ్ళు నిద్ర పట్టడం లేదు" అని కన్నీళ్ళు కార్చేవాడు.

కొడుకు బాధ చూసి కదిలిపోయేది హేమలత.

"ఇంకెన్నాళ్ళులే నాన్నా! ఎట్లాగో టైంపాస్ చెయ్యి. టీవీలో సినిమాలు చూడు. ఇంటర్‌నెట్‌లో ఏమైనా పుస్తకాలు చదువుకో. మంచి కాలక్షేపం అవుతుంది" అని ఓదార్చేది.

రోజూ కార్తీక్ కోసం, ప్రత్యేకంగా పదా ర్థాలు వండించి తెచ్చి, దగ్గరుండి తినిపిం చేది.

"బాగా తిను నాన్నా! ఎముక పెరిగి గ్యాప్ పూడాలికదా? " అనేది.

"నాన్న రావడం లేదమ్మా.. నా దగ్గ రికి? " అన్నాడు కార్తీక్ ఒకరోజు.

హేమలత ముఖం గంభీరంగా మారిపో యింది. సుబ్బారావు మొదట్లో ఉద్యోగానికి సెలవుపెట్టి, కంపెనీలో పార్ట్‌నర్‌షిప్ హేమలత పేరున ఉంచాడు. గవర్న మెంట్ ఉద్యోగి వ్యాపారం చెయ్యగూడదనే నిబంధన వల్ల అటువంటి ఏర్పాటు చేయ వలసి వచ్చింది.

తర్వాత కంపెనీ పుంజుకొని పెద్దదైన ప్పుడు సుబ్బారావు ఉద్యోగానికి రాజీనామా చేశాడు. కంపెనీని విస్తరించడానికి మరి కొందరు లైక్‌మైండెడ్ ఫ్రెండ్స్‌ని కూడా కలుపుకున్నారు. సుబ్బారావు తనతోపాటు హేమలతను గూడా ఒక డైరెక్టర్‌గా కొన సాగించాడు. కంపెనీ తరఫున ఆమెకు గూడా ఆదాయంలో భాగం బ్యాంక్ ఎకౌం ట్‌లో జమ అవుతుంది. ఆమెకు గూడా పాన్‌కార్డు, పాస్‌పోర్టు ఉన్నాయి. ఇన్‌కమ్ టాక్స్ అసెస్సీ గూడా. తన ఎకౌంట్‌లో ఉన్న డబ్బు నుంచే కార్తీక్ కోసం ఇరవై లక్షలకు చెక్ రాసి యిచ్చింది. దానితోనే అతను స్పోర్ట్స్‌బైక్ కొన్నాడు.

ఈ యాక్సిడెంట్ జరగకపోతే ఆ సంగతి సుబ్బారావుకి ఎప్పటికీ తెలిసేది కాదు. కొడుకు కోరిక తీరుస్తున్నప్పుడు ఆమెకు అదేమంత తప్పుగా అనిపించ లేదు. పిల్లల కోరికలు తీర్చలేకపోతే ఇక డబ్బు ఎందుకు? అనేది ఆమె దృక్పథం. వాళ్ళు అడిగింది ఇవ్వకుండా మొండిగా వ్యవహరిస్తే, ఏమైనా చేసుకుంటారేమోననే భయం ఆమెను పీడిస్తుంది. హేమలతకు గూడా ఆర్థిక స్వాతంత్ర్యం ఉందన్న సంగతి కనిపెట్టిన పిల్లలు ఏది కావల్సి వచ్చినా తల్లికే టెండర్ పెట్టడం అలవాటు చేసుకున్నారు. సుబ్బారావు గూడా బిజినెస్ వ్యవహారాల్లో మునిగిపోయి ఇంటి సంగ తులు పట్టించుకోవడం మానేశాడు. సమా జంలో వచ్చిన మార్పుల వల్ల కొందరి దగ్గరే డబ్బు పోగుపడటం, ఆ కుటుంబాల జీవన సరళి విభిన్నంగా మారిపోవడం త్వరితగతిన జరిగింది. పిల్లలకు ఖరీదైన అలవాట్లు అబ్బుతున్నా తల్లిదండ్రులు ఏం చెయ్యలేని నిస్సహాయస్థితిలో ఉన్నారు. ఏ వైనా దుర్ఘటనలు జరిగి పిల్లల జీవితాలు నాశనమైనప్పుడు కుమిలికుమిలి ఏడుస్తు న్నారు.

పిల్లలు ఇష్టారాజ్యంగా వ్యవహరించడం, ఖరీదైన జీవనశైలి అలవరచుకోవడంలో త న ప్రమేయం ఉందన్న సంగతి హేమలత తకు తెలుసు. అయితే ఇప్పుడు తాము మధ్యతరగతిలో నుంచి ఎదిగి కోట్లకు ప డగెత్తిన కుటుంబాల్లోనివారం. కాబట్టి ఆ సొసైటీని అనుసరించక తప్పదని ఆమె న మ్ముతుంది. ఇపుడు పిల్లలు పెద్దవాళ్లయి

ప్రాబ్లెమ్స్ సృష్టిస్తుంటే ఆమె ఉక్కిరిబిక్కిరై పోతోంది. రోజురోజుకీ భర్తతో విభేదాలు ఎక్కువై తమ మధ్య దూరం పెరిగిపోతోంది. ఒకే ఇంట్లో ఉంటూ అపరిచితుల మాదిరి ఉంటున్నారు.

కార్తీక్‌కి యాక్సిడెంట్ అయిన తర్వాత సుబ్బారావుకి భార్యమీద కోపం ఎక్కువైంది. ఇప్పుడు ఏ విషయంలోనూ ఆమెను సంప్రదించడంలేదు. ఇద్దరి మధ్య మాటలు కరువయ్యాయి.

ఒకరోజు మార్గరెట్ సుబ్బారావుకి ఫోన్ చేసింది.

"హలో! సుబ్బారావుగారూ! మార్గరెట్‌ని మాట్లాడుతున్నాను" అన్నది.

"మేడమ్! ఎలా వున్నారు? మీ నెంబర్ ఫీడ్ చేసుకున్నాను. ప్రత్యేకంగా మీ పేరు చెప్పక్కర్లేదులెండి"

"వెరీ నైస్. మీరు మళ్ళీ కాల్ చేయలేదు. బిజీగా వుంటున్నారా? "

"అదేం కాదండీ. ఈమధ్య మా చిన్నబ్బాయికి యాక్సిడెంట్లో కాలు ఫ్రాక్చరైంది. ఆ గొడవలో మా చుట్టాలంతా మాఇంటికి రావడం పోవడంతో సరిపోయింది"

"అలాగా? యాక్సిడెంట్ ఎలా జరిగింది? "

"అంతా ప్రారబ్ధం. మావాడు రింగ్‌రోడ్‌లో స్పోర్ట్స్‌బైక్ నడుపుతూ యాక్సిడెంట్ చేశాడు. వీడికి చావు తప్పి బైటపడ్డాడు. పాపం వీడితోవున్న మినిస్టర్ గారబ్బాయి చనిపోయాడు"

"న్యూస్‌లో వచ్చింది. అది మీవాడేనా? సారీ! నాకు తెలీదు"

"ఇదంతా నా వైఫ్ వల్లననుకోండి. ఇరవై లక్షలు పెట్టి స్పోర్ట్స్‌బైక్ కొనిచ్చింది. అది గూడా నాకు తెలియకుండా. ఏమనాలి చెప్పండి? చదువుకునే వాడికి ఎవరైనా అటువంటివి కొనిపెడతారా? పొద్దున్నే వెళ్ళి రోజూ ఆ రింగ్‌రోడ్డులో ప్రాక్టీస్ చేస్తారట ఇటువంటి కుర్రాళ్లంతా. వీకెండ్‌లో బైక్ రేసింగ్స్, బెట్టింగులు జరుగుతాయని ఇప్పుడు బైటపెడుతున్నారు పోలీసులు. ముందుగా ఎందుకు కంట్రోలు చెయ్యరు? ఏదైనా యాక్సిడెంట్ జరిగినప్పుడు మాకంతా తెలుసన్నట్లు మీడియా ముందు స్పీచ్ ఇస్తారు"

"సర్లెండి. ఇందులో మీరేం చేస్తారు? పోలీసులు మాత్రం ఏం చెయ్యగలరు? వీఐపీల పిల్లలు పట్టుబడినప్పుడు, పనిష్ చెయ్యనిస్తున్నారా? ఒక కార్పొరేటర్ కొడుకుని పట్టుకుని స్టేషన్‌లో పెట్టినా, వెంటనే మినిస్టర్స్ నుంచి కాల్స్ వస్తాయి, మనవాడే విడిపించమని. అందుకని పట్టుకోవడం ఎందుకు.. మళ్ళీ విడిచిపెట్టడానికే గదా? అని నిర్లిప్తంగా వుంటున్నారు పోలీసులు"

"ఆ మాటా నిజమేననుకోండి. మన పరిపాలనా యంత్రాంగం భ్రష్టుపట్టిపోతోంది రోజురోజుకీ. ముందుముందు ఇంకా ఏం జరుగుతుందో అర్థం కావడంలేదు"

"సర్లెండి. అదొక మహాభారతమంత సబ్జెక్ట్. లీవిట్"

"బాగా చెప్పారు"

"మీ సందేహం తీరిపోయింది గదా అని ఇక నన్ను పలకరించడంలేదేమో అనుకున్నాను"

"నా సందేహం తీరిపోవడం ఏమిటి? "

"మార్గరెట్ మల్లీశ్వరి అని చెప్పేశాను గదా? "

"అలా ఏం కాదులెండి. మల్లీశ్వరి మార్గరెట్‌గా ఎందుకు రూపాంతరం చెందిందో తెలుసుకోవాలనే కుతూహలం మిగిలే వుంది. మిమ్మల్ని ఎప్పుడు కలవమంటారు? "

"రేపే"

"గుడ్. మీ ఇంటికి రమ్మంటారా? "

"నేనే మీ ఇంటికి వస్తాను"

సుబ్బారావు కాదనలేకపోయాడు. మర్నాడు ఉదయమే మార్గరెట్ సుబ్బారావు ఇంటికి వచ్చింది. అప్పుడు సమయం పదకొండు గంటలైంది. రోజూ తొమ్మిదింటికే ఇంటినుంచి బయల్దేరి వెళ్ళిపోయే భర్త హాల్లోనే కూర్చుని టీవీ వాచ్ చేస్తుండటం ఎందుకో హేమలతకు అర్థం కాలేదు. ఎవరి కోసమో వెయిట్ చేస్తున్నాడని గ్రహించింది.

ఆమె అంచనా నిజమే అయింది. పోర్టికోలో కారు ఆగిన శబ్దం వినగానే సుబ్బారావు బైటకు వెళ్ళాడు. మార్గరెట్‌తో కలిసి ఇంట్లోకి రావడం గమనించి దగ్గరికి వచ్చింది.

"నా వైఫ్ హేమలత. వీరు డాక్టర్ మార్గరెట్!" అని ఇద్దరినీ ఒకర్నొకరికి పరిచయం చేశాడు.

"నమస్కారం హేమలతగారూ! మీ అబ్బాయికి యాక్సిడెంటయిందట గదా? చూడ్డానికి వచ్చాను" అన్నది మార్గరెట్.

హేమలత గూడా ప్రతినమస్కారం చేసి, "రండి.." అని కార్తీక్ వున్న గదిలోకి తీసుకెళ్ళింది.

మార్గరెట్ కార్తీక్‌ని పలకరించి ఏయే మందులు వాడుతున్నారో అడిగి తెలుసుకుంది. ఎముకల మధ్య గ్యాప్ పూడడానికి, ఎముక పెరగడానికి బలమైన ఆహారం అవసరమే కానీ, అదేపనిగా నాన్-వెజ్ పెడుతుంటే, ఫ్యాటీగా తయారవుతాడని హెచ్చరించింది.

"త్వరలో మామూలుగా నడుస్తావు. కాలేజీకి వెళ్తావు. ఏం భయలేదు" అని కార్తీక్‌కి ధైర్యం చెప్పింది మార్గరెట్.

ఆమె డాక్టర్ అని తెలిసి సంతోషించాడు కార్తీక్. తర్వాత మార్గరెట్ కారులోనే సుబ్బారావు వెళ్ళడం గమనించింది హేమలత.

ఇద్దరూ బ్యాక్‌సీట్లో కూర్చుని కబుర్లు చెప్పుకోవడం చూసి ఆమె మనసు అదోలా అయిపోయింది. లేత పసుపురంగు చీరలో మార్గరెట్ అందంగా, ఆకర్షణీయంగా కనిపించింది హేమలతకు. మార్గరెట్ వున్నంతసేపూ భర్త ముఖం మతాబులా వెలిగిపోవడం, ఎంతో వుత్సాహంగా వుండడం ఆమె గమనించింది. 'ఈ మార్గరెట్ ఎవరు? ఈయనకు ఎప్పుడు పరిచయం?' అని ఆలోచించసాగింది హేమలత.

★ ★ ★

"మేడమ్! ఈరోజు మీకు వీక్లీ ఆఫా?" కారులో పోతున్న సుబ్బారావు, పక్కనే కూర్చున్న మార్గరెట్‌ని అడిగాడు.

ఆమె సామీప్యం సుబ్బారావుకి హాయి కలిగిస్తోంది. ఆమెను ఆనుకుని కూర్చున్నాడు. కుదుపులు వచ్చినప్పుడు, కారు టర్నింగ్ తిరుగుతున్నప్పుడు ఆమె జబ్బ మెత్తదనం అతన్ని మధురోహలతో నింపుతోంది. ఆమె శరీరం నుంచి వెలువడుతున్న సువాసన ముక్కుకి తాకుతూ మత్తు కలిగిస్తోంది. ఆమె స్పర్శ అతనిలో స్పందన కలిగిస్తోంది. అతని శరీరం వేడెక్కుతోంది. జ్వరం వచ్చిన వాడిలా అయిపోతున్నాడు. రొటీన్‌కి భిన్నంగా అతనిలోని మార్పు ప్రస్ఫుటంగా ముఖంలో కనిపిస్తోంది.

"మీరెలా వూహించారు?" మనోహరంగా నవ్వుతూ ఎదురు ప్రశ్నించింది

## భలే భలే!

*20వ శతాబ్దపు నవలా రచయిత థామస్ వూల్ఫ్ చాలా పొడవుగా ఉండడం వల్ల రిఫ్రిజిరేటర్‌ను డెస్కుగా ఉపయోగించుకునేవాడట! వ్యాకరణం గురించి పట్టించుకోకుండా ఆరోజుకు ఓపికున్నంతవరకూ నిల్చునే రాసుకుని తర్వాత వాటిని తిరిగి రాయడం, సరిచేసుకోవడం, క్రమంలో పెట్టుకోవడం చేసుకునేవాడట!*

మార్గరెట్.

"డాక్టర్లు ఎప్పుడూ బిజీగా వుంటారు. అందులోనూ మార్నింగ్ బైటకు వచ్చారంటే వీక్లీ ఆఫ్ వుంటేనే గదా? "

"మీరు తప్పులో కాలేశారు" అన్నది చిలిపిగా.

"వాట్? " ఆశ్చర్యంగా అన్నాడు.

"ఈ రోజు క్రిస్మస్. చర్చికి వెళ్ళి అట్నుంచి మీ ఇంటికి వస్తున్నాను" అన్నది.

"ఓ.. ఐసీ! ఐ విష్ యు ఎ హేపీ క్రిస్మస్" అంటూ చొరవగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

మృదువైన ఆమె అరచేతిని వదలబుద్ధి కావడంలేదు. అలాగే ఎంతసేపైనా ఆమె చేతిని పట్టుకుని వుండాలనిపిస్తోంది.

"థాంక్యూ..!" అన్నది మార్గరెట్.

ఆమె చేతిని మృదువుగా నొక్కి వదిలాడు.

"మీ పండుగ సందర్భంగా నేను మీకు పార్టీ ఇస్తాను. చెప్పండి. ఎక్కడికి వెళ్దాం? " హుషారుగా అడిగాడు.

"నో.. నో.. మా పండుగకు మీరు పార్టీ ఇవ్వడం ఏమిటి? మీరే మా ఇంటికి లంచ్‌కి వస్తున్నారు" అన్నది.

"ఇప్పుడు ఎందుకులెండి? ఈసారి ఎప్పుడైనా వస్తాను" మొహమాటంగా అన్నాడు.

"ఇప్పుడేం? ఏదైనా ఎంగేజ్‌మెంట్ వుందా? "

"అంత అర్జెంట్ పనులేం లేవు గాని, పండుగ సమయంలో మీ ఆనందాన్ని పాడుచేయడం ఎందుకా అని? "

"మీరు మా ఇంటికి రావడం ఆనందమే. దీంట్లో ఇబ్బందేముంది? "

"అదికాదు, మీకు సంవత్సరానికి ఒక పండుగ వస్తుంది. ఫ్రెండ్స్, రిలేటివ్స్ ఇంటికి వస్తుంటారు. వాళ్ళతో గడపడం ఆనందం కదా!"

"సిటీలో మాకు బంధువులు ఎవరున్నారు? నాకెవరూ లేరు. మా డాడీకి నేను, నాకు మా డాడీ. దట్సాల్"

ఆ మాటలు చెబుతున్నప్పుడు ఆమె ముఖం మ్లానమైంది. తనకెవరూ లేరనే దిగులు కనిపించింది.

"ఓ అయామ్ సారీ!" అన్నాడు.

"ప్రతి క్రిస్మస్‌కి నేను, డాడీ మెదక్ చర్చికి వెళ్ళి ప్రేయర్ చేస్తాం. బట్, ఈసారి డాడీ రావడంలేదు..."

"ఏం? "

"ఆయనకి ఆస్థమా ఎక్కువగా వుంది. చలికి తట్టుకోలేరు. జబ్బు తీవ్రమవుతుంది"

"అలాగా? ఒంటరిగా వెళ్ళడం, తిరిగి ఏ అర్ధరాత్రో ఇంటికి రావడం కాస్త ఇబ్బంది. ప్రయాణంలో ఒంటరితనం డ్యామ్ బోర్. ఏమంటారు? "

"యస్. తోడులేని ప్రయాణం బాధాకరం. థ్రిల్ వుండదు. ఎప్పుడు గమ్యం చేరుకుంటామా? అనిపిస్తుంటుంది"

"మిస్టర్ సుబ్బారావ్! మీ సమక్షంలో నేనెంతో కంఫర్టబుల్‌గా ఫీలవుతున్నాను. ఎందుకో తెలీదు. ఇఫ్ యు డోంట్ మైండ్, నాతో మెదక్ రాగలరా? " అడిగింది మార్గరెట్.

సుబ్బారావు ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు. తను వింటున్నది నిజమా? కలా? అనుకున్నాడు.

"ష్యూర్! మీతో టైం స్పెండ్ చెయ్యడం నాకూ హేపీనే. మీ సమక్షంలో నాకు మనశ్శాంతిగా వుంటుంది. నా వర్రీస్ అన్నీ మర్చిపోతాను" సుబ్బారావు నిజాయితీగా చెప్పాడు.

"మీకేం వర్రీస్ సుబ్బారావ్? మీ చేతిలో పెద్దకంపెనీ వుంది. కోట్లు గడిస్తున్నారు"

"కోట్లు గడించడమే ప్రాబ్లమ్ మేడమ్. డబ్బున్నంత మాత్రాన మనిషికి సుఖం లేదు. అసలు డబ్బు సంపాదించడమే

తప్పంటుంది మా ఆవిడ. డబ్బు సంపాదించి తప్పు చేశానేమో అనిపిస్తోంది నాకు గూడా!" అంటూ తన పిల్లలు విచ్చలవిడిగా డబ్బు ఖర్చు చేస్తుండటం, వాళ్ళని పట్టించుకోవడంలేదని భార్య నిందించడం గురించి మార్గరెట్ కి వివరించాడు సుబ్బారావు.

"ఎంతవారికైనా ప్రాబ్లమ్స్ తప్పవన్న మాట. అందుకే శ్రీశ్రీ పీత కష్టాలు పీతవి అని చమత్కరించాడు" అని మార్గరెట్ గలగలా నవ్వింది.

కారు మార్గరెట్ ఇంటిముందు ఆగింది. ఇద్దరూ కారు దిగారు. గేటు దగ్గర మనిషి తలుపు తెరిచాడు. వరండాలో కూర్చుని వున్నాడు అగస్టీన్. సరికొత్త తెల్లటి డ్రెస్ వేసుకుని వున్నాడు. మార్గరెట్ వెనుకే వస్తున్న సుబ్బారావుని కళ్ళు పెద్దవి చేసి చూశాడు.

"డాడీ వీరు సుబ్బారావుగారని ఓ బిల్డర్. వీరికి కిరణ్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ వుంది"

"ఈయన గుర్తున్నారమ్మా!" అని నవ్వాడు అగస్టీన్.

మార్గరెట్ ముందు నడుస్తుంటే, సుబ్బారావు ఆమెను అనుసరించాడు. ఆమె అతన్ని తన డ్రాయింగ్ రూమ్‌లోకి తీసుకెళ్ళి కూర్చోబెట్టింది. అతను కూర్చోగానే సెల్ రింగైంది. సైట్‌లో ఇంజినీర్ మాట్లాడాడు.

"ఈ సెల్ ఒకటి. మాటిమాటికి డిస్టర్బెన్స్" అని విసుగ్గా స్విచ్ఛాఫ్ చేసిపెట్టాడు.

దానివల్ల గూడా ప్రాబ్లమ్స్ వస్తాయని సుబ్బారావు వూహించలేకపోయాడు. మార్గరెట్ గురించి తెలుసుకోవాలని అతనికి చాలా కుతూహలంగా వుంది.

తొలిసారి మార్గరెట్‌ని చూశాక, తను చదువుకుంటున్నప్పుడు కాకినాడలో చూసిన మల్లీశ్వరేనేమో అని అనుమానించడం, అదంతా నిజం కావడం థ్రిల్ కలిగించింది.

ఐతే మల్లీశ్వరి మార్గరెట్‌గా ఎందుకు మారింది? ఎలా మారింది? అప్పటి పరిస్థితులు తెలుసుకోవాలని ఆత్రుతగా వుందతనికి. ఇన్నాళ్టికి ఆమెతో ఏకాంతంగా గడిపే ఛాన్స్ దొరికింది. తమ మధ్య డిస్టర్బెన్స్ ఉండకూడదని సెల్ స్విచ్ఛాఫ్ చేశాడు.




**పం**ట కోతకొచ్చిన సమయంలో తుపాను వచ్చి అంతా నాశనమైంది. మళ్ళీ పంట వేయడానికి, కుటుంబం గడవడానికి, అప్పులు తీర్చడానికి రైతుల చేతిలో డబ్బు లేక అల్లాడుతున్నారు. చిలుమూరులో సుబ్బారావు తమ్ముడు సౌభాగ్యరావుకి ఒక వెసులుబాటు వుంది. డబ్బు కావాల్సి వచ్చినప్పుడల్లా అన్న దగ్గరికి హైదరాబాద్ వస్తాడు. తన సమస్యలన్నీ ఏకరువు పెడతాడు. 'వ్యవసాయం దండగ అన్నయ్యా!' అని వాపోతాడు. 'మరి ఎందుకురా చేస్తావు? నా దగ్గరికి వచ్చెయ్! ఏదో ఒకటి చేద్దువుగాని' అని సుబ్బారావు అంటే, ససేమిరా అంటాడు. 'నీకంటే చదువు అబ్బింది. ఏమైనా చేస్తావు. నాకు మన వూరు వదిలి రాబుద్ధి కావడంలేదు' అని జన్మభూమి స్వర్గాన్ని మించినదని శ్రీరాముడిలా చెబుతాడు.

సుబ్బారావు దగ్గర డబ్బులు తీసుకోవడానికి వచ్చిన మరిదిని చూసి ముఖం చిట్లించింది హేమలత.

వచ్చినప్పుడల్లా తమ్ముడికి తనభర్త డబ్బిచ్చి పంపడం ఆమెకు మింగుడు పడని వ్యవహారం. ఊళ్ళో వున్న పొలంలో తమ భాగం సంగతి ఏమిటని అప్పుడప్పుడూ భర్తని నిలదీసేది. శ్రీశైలంలో వుద్యోగం చేస్తున్నప్పుడు వూరి నుంచి బియ్యం, పప్పులు తీసుకొచ్చి యిచ్చేవాడు సుబ్బారావు తండ్రి. హైదరాబాద్ వచ్చాక అది ఆగిపోయింది. అదీగాక సుబ్బారావు తండ్రి చనిపోయాడు. తమ భాగం పొలం అమ్ముకురమ్మని కొన్నాళ్లు పోరుపెట్టింది హేమలత. తెనాలి నుంచి అప్పుడప్పుడు వచ్చే తండ్రి గూడా కూతుర్ని రెచ్చగొట్టేవాడు. 'ఇప్పుడు పొలం రేట్లు పెరిగాయి. ఎకరం లక్షలు చేస్తుంది. మీ ఆయన భాగం తమ్ముడికి వదిలేయడం ఏమిటి? అమ్ముకుని రమ్మను' అనేవాడు. తండ్రి ప్రోద్బలంతో సుబ్బారావుని పోరుపెట్టేది హేమలత.

ఒకసారి సుబ్బారావు భార్యని చీవాట్లు పెట్టాడు.

"హేమా! ఈసారి పొలం సంగతి ఎత్తితే మర్యాద వుండదు. నేను చదువుకునేటప్పుడు చేసిన ఖర్చంతా అప్పుడు ఉమ్మడిగా ఉన్నప్పుడు చేసింది కాదా? పొలంలో గొడ్డులా చాకిరీ చేశాడు మా తమ్ముడు. వాడికి చదువు మీద శ్రద్ధ లేకపోవడంతో మా నాన్న ఆపేయించాడు. నేను ఇంజినీర్ని అయ్యాను. ఇంకా నాకు ఆ పొలం ఎందుకు? అయినా జాబ్ చేస్తున్నంత కాలం, మనం ఇబ్బందులు పడకుండా బియ్యంమూటలు, పప్పులు మోసుకొచ్చారు. ఇప్పుడు మనం బాగుపడ్డాం. ఇంకా పొలమో అని దేబిరించడం ఏమిటి? అదంతా తమ్ముడిదే. ఇంకా మాట్లాడితే కంపెనీలో




తమ్ముడికి భాగం ఇవ్వాల్సొస్తుంది"

అప్పట్నుంచి హేమలత పొలం గురించి నోరెత్తడంలేదు. సుబ్బారావుకి తిక్కరేగిందంటే కంపెనీలో భాగం కూడా రాసిస్తాడేమోనని భయపడుతుంది. అందుకే తనకిష్టం లేకపోయినా అతను తమ్ముడికి డబ్బిచ్చి పంపిస్తుంటే పెదవి

విప్పదు.

"బాగున్నావా వదినా? " అంటూ వచ్చాడు సౌభాగ్యరావు.

"ఏం బాగులే నాయనా! ఏదో ఇట్లా వున్నాం. నాకేమో షుగరు, బీపీ...! మందులు మింగలేక చస్తున్నాను. పిల్ల లేమో మాట విని చావరు. మీ అన్న ఇల్లు పట్టించుకోడు. చూశావుగా చిన్నోడు బైక్ నడిపి కాలు విరగ్గొట్టుకుని మంచాన పడ్డాడు..." అంటూ తన కష్టాలన్నీ మరి దికి ఏకరువు పెట్టింది హేమలత.

"ఎట్లా వుంది చిన్నోడికి? " అని కార్తీక్ గదిలోకి వెళ్ళి పలకరించి వచ్చాడు.

స్నానం చేసి కాసేపు గెస్ట్‌రూమ్‌లో నిద్ర పోయాడు. లంచ్ చేసి హాల్లో టీవీ ముందు కూర్చున్నాడు.

"వదినా! అన్నయ్య భోజనానికి ఇంటికి రాడా? " అని అడిగాడు.

"ఆయన ఇంటికి భోజనానికి ఎప్పుడొ చ్చాడు? అమావాస్యకి, పౌర్ణమికి వస్తే వస్తాడు" అన్నది.

సౌభాగ్యరావు, తన అన్న సెల్ కి కాల్ చేశాడు. అది స్విచ్చాఫ్ చేసివుందని మెసేజ్ వచ్చింది.

"వదినా! అన్నయ్య సెల్‌ఫోన్‌కి లైను కలవడంలేదేమిటి? నీ సెల్ నుంచి కలుపు" అన్నాడు.

హేమలత గూడా తన సెల్ నుంచి ట్రై చేసింది.

"ఏం రాచకార్యం వెలగబెడుతున్నాడో ఫోన్ స్విచ్చాఫ్ చేసి కూర్చున్నాడు" అన్నది నిష్ఠూరంగా.



"ఆఫీసులో మీటింగ్ ఏమన్నా వుందేమో? " అన్నాడు సౌభాగ్యరావు.

"మీటింగా పాడా? పొద్దున్నే డాక్టరట ఒకావిడ వచ్చింది. ఆవిడతో కలిసి వెళ్ళిపో యాడు. కారు గూడా తీసుకెళ్ళలేదు. ఎక్కడికెళ్ళాడో, ఏమో? " అన్నది హేమ లత.

"డాక్టరెవరు వదినా? కార్తీక్‌ని చూడ్డాని కొస్తుందా? "

"అబ్బే, అదేంకాదు. వాడికి ట్రీట్‌మెంట్ ఇస్తున్నది ఆర్థోపెడిక్ స్పెషలిస్ట్. ఈవిడ ఎవరో మార్గరెట్ అట. నేను ఇంతకు ముందెప్పుడూ చూళ్ళేదు. ఇప్పుడే చూశాను"

"ఎవరో తెలిసిన డాక్టరై వుంటుంది. కారు తీసుకెళ్ళకపోతేనేం? ఆమె కారులో ఆఫీసుకి వెళ్ళివుంటాడు. ఏదైనా బిల్డింగ్ కట్టించుకోవడానికి వచ్చిందేమో? " అన్నాడు సౌభాగ్యరావు.

"ఏమోలే! ఆఫీసులో వున్నారేమో ల్యాండ్‌లైన్‌కి ఫోన్ చెయ్యి" అని మరిదికి సలహా ఇచ్చింది.

సౌభాగ్యరావు ఆఫీసుకి ఫోన్ చేసి, సుబ్బారావు రూమ్‌కి కనెక్షన్ ఇవ్వమ న్నాడు. ఆయన ఆఫీసులో లేరనీ, రాలేదనీ సమాధానం వచ్చింది.

**కొత్తగాలి...**

**తెలుగు మాటలు తేనెమూటలు**
**తెలుగు పాటలు తీపిధారలు**
**తెలుగు పద్యాలు మధురసమ్ములు**
**తెలుగు పలుకులు**
**పనసతొనలోయీ!**

– అయినాల కనకరత్నాచారి,
కొరిశపాడు, ప్రకాశం జిల్లా

"నేను చెప్పలా? ఆ డాక్టర్‌తో వెళ్ళాడని" మొహం మాడ్చుకుని అన్నది.

హేమలత అంతటితో వూరుకోలేదు. కిరణ్‌రావు సెల్‌కి కాల్ చేసింది.

"అన్నయ్యా! ఆయన ఆఫీసులో లేర టగా? ఎక్కడికి వెళ్ళారు? ఏం లేదు.. మా మరిది వూరినుంచి వచ్చాడు. ఆయన అక్కడ వుంటే వద్దామనుకుంటున్నాడు" అన్నది.

"ఏమోనమ్మా! ఈ రోజు ఆఫీసుకు రాలేదు. సైట్‌లో గూడా లేడు. ఎక్కడికి వెళ్ళాడో చెప్పలేదు. సామాన్యంగా ఆఫీసుకి రాకపోతే రానని ఫోన్ చేసి చెప్పేవాడు" అన్నాడు కిరణ్‌రావు.

"మీకు గూడా చెప్పకుండా వెళ్ళారంటే ఏదో ముఖ్యమైన విషయమై వుంటుంది"

"అంతే అయివుంటుంది"

"అన్నయ్యా! మీకు మార్గరెట్ తెలుసా? "

"మార్గరెటా? "

"డాక్టరట అన్నయ్యా! పొద్దున ఇంటి కొచ్చింది. మా చిన్నోడిని పలకరించి వెళ్ళింది. ఈయన ఆవిడ కారెక్కి వెళ్ళారు"

"డాక్టరా? ఆవిడ మిషనరీ హాస్పిటల్లో డాక్టర్. తెలుసా అంటే, అంత పరిచయ మేం లేదు. ఆ మధ్య మన ఆడిటర్ విశ్వ నాథ్ ఏదో ఫంక్షన్ చేశాడు, ఆ హాస్పి టల్లో. అప్పుడే కాస్త పరిచయం. అంతే.."

"ఈయనక్కూడా అప్పుడే పరిచ యమా? "

"అంతేగా మరి. అంతకు ముందెప్పుడూ ఆమెను చూళ్ళేదు"

"ఊహూఁ... తర్వాత ఈయనతో పరి చయం పెరిగిందేమో? " మరిది వంక అదోలా చూస్తూ అన్నది హేమలత.

"ఆ సంగతి నాకైతే తెలియదమ్మా!" అన్నాడు కిరణ్‌రావు.

హేమలత కిరణ్‌రావుతో మాట్లాడు తున్న తీరును బట్టి, ఆమె తన అన్నను అనుమానిస్తున్నదని గ్రహించాడు సౌభాగ్య

రావు.

అన్న గురించి అతనికి బాగా తెలుసు. ఆడవాళ్లకి దూరంగా వున్నాడు. పెళ్ళయ్యే వరకు గూడా లవ్ ఎఫైర్స్ వంటివి లేవు. ఇప్పుడిక ఏభై ఏళ్ళ నడివయసులో ఏ ఆడ దాని ఆకర్షణలోనైనా పడి వుంటాడా? ఏమో చెప్పలేం. ఇప్పుడు అరవై ఏళ్లయినా కూడా పాత రోజుల్లోలాగా మగాడు ముసలితనం దగ్గరికి రానివ్వడం లేదు. అప్పట్లో ఏభై ఏళ్లకే తలలు ముగ్గుబుట్టలై, శరీరం వడిలి, చూపు మందగించి ముసలి తనం వచ్చేది. అరవై ఏళ్ళలోపే చనిపోయే వారు. ఏ జబ్బు వచ్చినా సరిగా గుర్తించే వారు కాదు. ఇప్పుడలా కాదు. కాన్పులు, కోడళ్లు, అల్లుళ్లు రావడం, పురుళ్లు, మనుమ ళ్ళని పెంచడం వంటి వ్యాపకాలతో చాలా మంది ఆడవాళ్లు ముసలివారిలా అయిపో తున్నారు. కొందరైతే వూబకాయంతో కద ల్లేకుండా తయారవుతున్నారు. మగాళ్ళు మాత్రం జీన్స్‌ప్యాంట్లు, చారల షర్టులేసు కుని, జుట్టుకి నల్లరంగేసుకుని కుర్రాళ్ళ మాదిరి తిరుగుతున్నారు. ఆరోగ్యంగా గూడా వుంటున్నారు. చాలామంది మరో ఆడదానితో సంబంధాలు పెట్టుకుంటు న్నారు గూడా. సమాజంలో ఇలాంటివి అక్కడక్కడా కన్పిస్తున్నాయి. దానికి తన అన్న గూడా అతీతుడు కాదేమో!?

సౌభాగ్యరావు వదినవైపు పరీక్షగా చూశాడు. ఏభై ఏళ్ళకి దగ్గర పడుతున్న ఆమె జుట్టు సగం నెరిసి వుంది. బాగా లావైంది. ముఖం ముడతలు పడి చాలా మార్పు వచ్చింది. నాలుగు అడుగులు వేస్తే గూడా ఆయాసపడుతున్నది. ఆమెకు షుగర్, బీపీ వంటివి వున్నాయి.

కానీ అన్నయ్య అలా లేడు. పెద్దగా మారలేదు. ఏదోక పనిలో బిజీగా వుండ డంవలన శారీరక శ్రమతో వళ్ళు పెరగ లేదు. ఏభై ఏళ్లున్న వాడిలా కనిపించడు. నలభై ఏళ్ళంటే నమ్ముతారు. మనిషికి ఆహారం, నిద్ర, తర్వాత అవసరం శరీర సుఖమే కదా? ఇంట్లో దొరకని సుఖం బైట వెతుక్కోవటం మామూలే. ఇందులో మంచీచెడుల పట్టింపు, ప్రసక్తి ఉంటుం దా? అట్లా ఆ డాక్టరమ్మతో అన్నయ్యకి సంబంధం ఏర్పడిందేమో? ఆమెకు దగ్గర య్యాడేమో?

ఎవర్కైనా మనసులో అనుమానపు బీజం పడనే కూడదు. పడిందంటే అది పెనుభూతమై కూర్చుంటుంది. సుబ్బారావు తనను ఎవరూ డిస్టర్బ్ చేయకూడదని యాదృచ్ఛికంగా సెల్‌ఫోన్ స్విచ్ఛాఫ్ చేయడం, అదే సమయంలో సౌభాగ్యరావు అన్న కోసం ప్రయత్నించడం, అతను ఆఫీ సులో లేకపోవడంతో హేమలత మన సులో అనుమాన బీజం పడింది.

కిరణ్‌రావుకి ఆశ్చర్యంగా వుంది. సుబ్బా రావు పార్టీల్లో మందు తాగడం తప్ప ఇతర వ్యసనాల జోలికి పోయేవాడుకాదు. ఎవరెంత టెంప్ట్ చేసినా థాయ్‌లాండ్, సింగపూర్ వంటి విదేశీయానాల పట్ల, అక్కడ అమ్మాయిల పొందుపట్ల ఎటువంటి ఆసక్తి చూపేవాడుకాదు. అటు వంటిది డాక్టర్ మార్గరెట్‌కి సన్నిహితమ వడం ఏమిటి? కొద్దికాలం క్రితం ఆడిటర్ విశ్వనాథ్ హాస్పిటల్లో తనతోపాటు, సుబ్బారావుకి కూడా మార్గరెట్‌ని పరి చయం చేయడం గుర్తుంది. అంతకు పూర్వం ఆమె సుబ్బారావుకి పరిచయమైన దాఖలాలు లేవు. మరి హేమలత ఇలా చెప్పిందేమిటి? మార్గరెట్ సుబ్బు ఇంటికి వెళ్ళడం ఏమిటి? అతను ఆమె కారులో ఎక్కడికో వెళ్ళడం ఏమిటి? అతను సెల్ ఫోన్ స్విచ్ఛాఫ్ చేసి పెట్టడానికి కారణం ఏమిటి?

ఆ సాయంకాలం వరకు చూసి సుబ్బా రావు తమ్ముడు ఆఫీసుకి వెళ్ళి కిరణ్‌రావుని

కలుసుకున్నాడు. మార్గరెట్ ఎవరో? ఆమె సంగతి ఏమిటో అని సౌభాగ్యరావు అడిగితే తమ స్వల్ప పరిచయం గురించి చెప్పాడు.

హేమలత సుబ్బారావుని అనుమానించే స్టేజిలో వుందని తెలిసి కిరణ్‌రావు ఆలోచనలో పడ్డాడు. ఇద్దరూ హాస్పిటల్‌కి వెళ్ళారు. అక్కడ మార్గరెట్ లేదు. ఆమెతో మాట్లాడే పనుందని చెబితే ఇంటి ల్యాండ్ లైన్ నెంబర్ యిచ్చారు. ఇంట్లో పనిమనిషి ఫోన్ ఎత్తింది. డాక్టర్‌గారు లేరని చెప్పింది. అక్కడికి సుబ్బారావు అనే ఆయన వచ్చాడా? అని అడిగితే, ఆయన ఎవరో తనకు తెలియదనీ అమ్మగారి వెంట ఎవరో అయ్యగారు మాత్రం వున్నారనీ, అతన్ని వర్ణించి చెప్పింది. అవి సుబ్బారావుకి సరిగ్గా సరిపోయాయి. ఇద్దరూ కలసి కారులో ఎక్కడికో వెళ్ళారనీ, తనకు అంతకంటే వివరాలు తెలియవని చెప్పింది.

మతిపోయింది కిరణ్‌రావుకి. సౌభాగ్యరావుకి ఆందోళన కలిగింది. ఎప్పుడైనా వేరే పనిమీద వెళ్ళేటప్పుడు ఆ సంగతి కిరణ్‌రావుకి తప్పకుండా చెప్పేవాడు సుబ్బారావు. ఒక్కోసారి ఇంటి నుంచి వర్క్‌స్పాట్‌కు వెళ్ళినా ఆ సంగతి తెలియజేసేవాడు. అటువంటిది అతనికి ఏమైంది? మార్గరెట్‌తో ఎక్కడికో వెళ్ళడం ఏమిటి? ఆమెతో ఎఫైర్ ఎప్పుడు మొదలైంది? ఆ మార్గరెట్‌కి భర్త, పిల్లలు లేరా? ఆమె చిన్నదేమీకాదు. నడివయసులో వుంది. ఆమె అందగత్తె కావొచ్చు. కాని శ్రీరామచంద్రుడిలాంటి వ్యక్తిత్వం వున్న సుబ్బారావు ఆమెపట్ల ఆకర్షణకు గురికావడానికి కారణం ఏమిటి? అతని ఇంట్లో పరిస్థితులు అస్తవ్యస్తంగా వున్నమాట వాస్తవం. పిల్లలు విచ్చలవిడి ఖర్చులకు అలవాటు పడడం, ప్రాబ్లమ్స్‌లో ఇరుక్కోవడం, రెండోవాడు చావుతప్పి బైట పడటంతో విసిగిపోయి వుంటాడు. అదీగాక అతని భార్యతో ఇప్పుడు ఘర్షణ పడటం ఎక్కువైంది. ఆమెతో సత్సంబంధాలు వున్నట్లు లేదు. భార్య తనను సతాయిస్తున్నదని చాలాసార్లు తన దగ్గర వాపోయాడు గూడా. ఐతే సుబ్బారావు మార్గరెట్ సమక్షంలో సుఖశాంతులు వెతుక్కుంటున్నాడా?

"ఇప్పుడేం చేద్దాం? ఇంటికి వెళ్తే, మీ అన్నయ్య ఎక్కడున్నాడని వదిన చంపుకు తింటుందేమో?" అన్నాడు సౌభాగ్యరావు.

కిరణ్‌రావుకి గూడా ఏమీ తోచడం లేదు. పిల్లవాడో, మతిస్థిమితంలేని మనిషో అయితే తప్పిపోయాడని భావించి పోలీస్ కంప్లైంట్ ఇవ్వడం, పేపరు ప్రకటన ఇవ్వడం వంటివి చేస్తారు. సుబ్బారావు యాభై ఏళ్ళవాడు. పేరుప్రతిష్టలున్న కంపెనీలో పార్ట్‌నర్. అటువంటివాడు కనిపించకుండా పోయాడని పోలీసుల దగ్గరికి వెళ్తే సిల్లీగా వుంటుంది. వాళ్ళు తీగలాగి డొంక కదుపుతారు. చివరిసారి ఎవరు చూశారు? ఎవరితో కలిసి వెళ్ళాడు? అని అడిగితే మార్గరెట్ పేరు చెప్పక తప్పదు. ఇక మీకు వ్యాపారంలో ప్రత్యర్థులు ఎవరు? శత్రువులు ఎవరైనా వున్నారా? అంటూ ఎంక్వయిరీ మొదలు పెడతారు. కోరి కష్టాలు కొనితెచ్చుకున్నట్లవుతుంది. మీడియావాళ్ళు పసిగడితే, సుబ్బారావుని మార్గరెట్‌ని బదనాం చేస్తారు.

"నాకేం తోచడం లేదోయ్?" అన్నాడు కిరణ్‌రావు.

"పోలీసు కంప్లైంట్ ఇస్తే?" అన్నాడు సౌభాగ్యరావు.

కిరణ్‌రావు నవ్వాడు. అందులో వున్న సాధకబాధకాలు చెప్పాడు.

"ఇంటికి వెళ్ళడానికి భయమేస్తోంది. ఇప్పుడెందుకు వచ్చానా? అనిపిస్తోంది"




అన్నాడు సౌభాగ్యరావు బిక్కమొహం వేసుకుని.

"ఒక పని చెయ్యి. నువ్వు గూడా సెల్ ఫోన్ స్విచ్ఛాఫ్ చేసి, మన గెస్ట్‌హౌస్‌లో పడుకో. రేపటికి ఏ సంగతి తెలుస్తుంది. అప్పుడు ఇంటికి వెళ్ళొవుగాని" అన్నాడు కిరణ్‌రావు నవ్వుతూ.

కిరణ్‌రావు జోక్‌గా చెప్పినా సౌభాగ్యరావుకి ఆ సలహా నచ్చింది.

"ఆ పనే చేస్తా. హాయిగా మందుకొట్టి బిర్యానీ తిని పడుకుంటా. రేపటి సంగతి రేపు" అన్నాడు వూపిరి పీల్చుకుంటూ.

వీళ్ళిక్కడ సుబ్బారావు ఆచూకీ కోసం మల్లగుల్లాలు పడుతుంటే, ఆ సమయంలో అతను మార్గరెట్ పక్కన కూర్చుని, ఆమె సాన్నిహిత్యాన్ని ఎంజాయ్ చేస్తూ, ఆమె అందాన్ని రెండుకళ్ళతో తనివితీరా చూస్తూ, ఆమె స్పర్శానందాన్ని అనుభవిస్తూ మజాలో వున్నాడు. తను సెల్ ఫోన్ స్విచ్ఛాఫ్ చేసిన సంగతి మర్చిపోయాడు. అతనికిప్పుడు మార్గరెట్ ఆలోచనలే. ఆమె సమక్షంలో సర్వం మరిచి, కొత్త అనుభూతులు పొందుతున్నాడు. ఆమె చెప్పే మాటలు అతని చెవులకు సంగీతంలా వినిపిస్తున్నాయి.

కారు మెదక్‌వైపు పరిగెత్తుతోంది.

"మనుషుల్ని ఇప్పుడు ధనపిశాచి పట్టుకుని పీడిస్తోంది. ఏ విధంగానైనా డబ్బు సంపాదించాలనే యావ ఎక్కువైంది. ఏమంటారు? " అన్నది మార్గరెట్.

"అందులో సందేహం ఏముంది? ఏ న్యూస్ ఛానల్లో చూసినా, ఏ పేపరు తిరగేసినా డబ్బుకోసం జరుగుతున్న నేరాలు ఘోరాలే అందుకు నిదర్శనం గదా!" అన్నాడు సుబ్బారావు.

"డబ్బు కోసం చేసే దొంగతనాలు, హత్యల సంగతి వదిలెయ్యండి. మనుషులు డబ్బుకోసం విలువలు కోల్పోతున్నారు. ఏ పని చెయ్యడానికైనా సిద్ధపడిపోతున్నారు. మా కాకినాడ కమల అలాగే కష్టాల్లో పడింది. దాని కోసమే నేను మధ్యలో హాస్పిటల్‌కి వెళ్ళాల్సి వచ్చింది. ఇంట్లో మిమ్మల్ని వదిలిపెట్టి పోయాను. మీకు బోర్ కొట్టిందేమో? లేకపోతే ఇంకా ఎర్లీగా బయల్దేరి వుండేవాళ్ళం" అన్నది

## మునిమాణిక్యం చతురోక్తులు



మధ్య తరగతి సంసారంలోని సరిగమల్ని ఎన్నింటినో చక్కటి హాస్య రూపంలో అందించారు మునిమాణిక్యం నరసింహారావు. ఆయన సమయస్ఫూర్తితో మాటకుమాట బదులివ్వడంలో దిట్ట. వివిధ సందర్భాల్లో ఆయన నుడివిన చతురోక్తులు కొన్ని..

### పోతన చెప్పినట్లు చేస్తున్నారా?!



జంటకవుల్లో ఒకరైన కాటూరి వేంకటేశ్వరరావు ఇంటికి అతిథిగా వెళ్లారు మునిమాణిక్యం. కాటూరివారికి చుట్ట తాగే అలవాటుంది. అందువల్ల ఆయన పడుకునే ముందు పొగాకు చుట్టి చాలా చుట్టలు తయారు చేసుకుంటున్నారు. అది చూసిన మునిమాణిక్యం 'ఇదేమిటీ.. పడుకునేముందు ఇన్ని చుట్టలెందుకు? ఇదేం అలవాటు?' అన్నారు విస్మయంగా.

కాటూరివారు ఓ చిర్నవ్వు నవ్వి తన పని తాను కొనసాగిస్తున్నారు. అది చూసిన మునిమాణిక్యం వెంటనే 'చుట్టలు చుట్టుకుని పడుకోవటం మంచి అలవాటేనండీ! భాగవతంలో ఆదిశేషుడు చుట్టలు చుట్టుకుని పడుకున్నట్టు పోతన రాశారు కదా!' అన్నారు నవ్వేస్తూ.

మార్గరెట్.

"అదేం లేదు. మేగజైన్స్ చదువుతూ ఎంజాయ్ చేశాను. ఇంతకీ మీ కాకినాడ కమల ఎవరు? కష్టాల్లో ఎందుకు పడింది? " అని అడిగాడు సుబ్బారావు.

"సరోగసీ అనే పేరు విన్నారా? "

"అదేం పేరు? అదెవరి పేరు? "

"నో..నో.. ఎవరి పేరూ కాదు. మాతృత్వం పొందలేని స్త్రీలు, తమ అండం ఫలదీకరించి మరొకరి గర్భసంచిలో ప్రవేశపెట్టే ప్రక్రియే సరోగసీ అంటే"

"ఔను. విన్నాను. ఇప్పుడు గుర్తుకొచ్చింది. అప్పుడప్పుడూ దీనిమీద పేపర్లలో ఆర్టికల్స్ వస్తుంటాయి"

"భార్యాభర్తలు ఆరోగ్యంగా వుండి, భార్య పిల్లల్ని కనలేని పరిస్థితులలో వున్నప్పుడు, ఈ ప్రక్రియ వుపయోపడుతుంది. ఐతే మనవాళ్ళు మేధావులు. ప్రతిదాన్నీ బిజినెస్ చేస్తుంటారు. ఆ విధంగా సరోగసీ గూడా బిజినెస్‌గా మారింది. దీనికోసం ప్రత్యేకంగా హాస్పిటల్స్ వెలిశాయి. ఏజెంట్లు తయారయ్యారు. ఇండియా ఇప్పుడు అద్దె గర్భాల ఔట్ సోర్సింగ్ సెంటర్‌గా మారింది"

"ఫారిన్ కంట్రీస్‌లో ఎందుకు లేదు? "

"లేకపోవడం ఏమిటి? ఉంది. ఐతే అక్కడ ఇది చాలా ఖరీదైన వ్యవహారం. కనీసం ఏభైలక్షలు ఖర్చు చేయాల్సి వుంటుంది. ఇండియాలో అయితే ఆరేడు లక్షల్లో పూర్తవుతుంది. అందుకే ఫారినర్స్ మనదేశానికి వచ్చి ఇక్కడి నిరుపేద యువతుల గర్భాలు అద్దెకు తీసుకుని వాళ్ళు ప్రసవించాక పిల్లల్ని తీసుకుని హేపీగా వెళ్ళిపోతున్నారు"

"మీ కాకినాడ కమల గూడా ఆ వుచ్చులో ఇరుక్కుందా? "

"అన్నీ సక్రమంగా జరిగితే తొమ్మిది నెలలలో రెండులక్షలు సంపాదించి వుండేది. మామూలుగా పిల్లల్ని కోరుకునే తల్లిదండ్రుల నుంచి ఆరు లక్షలు వసూలు చేస్తారు ఫెర్టిలిటీ సెంటర్‌వాళ్ళు. అందులో రెండులక్షలు సరోగేట్ మదర్‌కి ఇస్తారు. రెండులక్షలు ఫెర్టిలిటీ హాస్పిటల్ ఛార్జీలు. మరొక రెండులక్షలు కమీషన్లు పోతాయి. సంవత్సరంలోపే రెండులక్షలు సంపాదించొచ్చనే ఆశతో కమల గర్భం అద్దెకివ్వడానికి ఒప్పుకుంది"

"మరేమిటి ప్రాబ్లమ్? "

"మొదటిసారి గర్భం ధరించినప్పుడు రెండోనెలలో అబార్షన్ అయింది. అప్పుడేదో ఖర్చుల కిచ్చారు. మళ్ళీ రెండోసారి మూడోనెలలో అబార్షన్ అయింది. గర్భసంచిలో ప్రాబ్లమ్. ఇక సరోగసీ వద్దనుకుంది కమల. మూడోసారి ఏజెంట్ ప్రోత్సాహంతో ఒప్పుకుంది. ఈసారి హాస్పిటల్లోనే వుంచి జాగ్రత్తగా చూశారు. తొమ్మిదోనెలలో సిజేరియన్ చేసి బిడ్డను తీశారు. తర్వాతే అసలు ప్రాబ్లమ్ మొదలైంది. కడుపునొప్పితో అల్లాడింది. వెన్నులో చీము పట్టింది. అప్పుడు కమల తల్లి నా దగ్గరకొచ్చి మొత్తుకుంది. గర్భసంచి తొలగించి, వెన్నెముకకు ట్రీట్‌మెంట్ చేయడానికి వాళ్ళిచ్చిన డబ్బంతా ఖర్చయింది. అట్లా కమల ఆరోగ్యం పాడయింది. దానికి తోడు ఇక పిల్లలు పుట్టే ఛాన్స్‌లేదని తెలిసి మొగుడు వదిలేస్తానని బెదిరిస్తున్నాడు" చెప్పింది మార్గరెట్.

"అయ్యో పాపం!"

"ఇందులో మరొక మోసం గూడా వుందండీ. సరోగసీ ద్వారా పిల్లల్ని పొందాలనుకునేవాళ్ళలో కేవలం మగపిల్లలే కావాలనుకునేవాళ్ళు కూడా కొందరుంటారు. స్కానింగ్‌లో ఆడపిల్లని తేలితే అబార్షన్ చేయిస్తారన్నమాట. కమలకు రెండుసార్లు గూడా అందుకే అబార్షన్ చేసివుంటారని నా అనుమానం"

"మే బీ.. ఇండియాలో ఏదీ అసాధ్యం కాదు. డబ్బుకోసం ఏమైనా చేస్తారు. స్కానింగ్ ద్వారా ఏ బిడ్డపుడుతుందో చెప్పగూడదని రూల్సున్నా పాటించేది ఎవరు? "

"ముఖ్యంగా అది ఆడశిశువుల పట్ల వివక్షను అంతం చేసేందుకు గర్భస్థ శిశులింగ నిర్ధారణ పరీక్షలను నిషేధించే టర్మినేషన్ ఆఫ్ ప్రెగ్నెన్సీ మెడికల్ యాక్ట్ కింద సెంట్రల్ సూపర్‌విజన్ బోర్డు చర్యలు తీసుకోవాలి. నేషనల్ ఇన్‌స్పెక్షన్ అండ్ మానిటరింగ్ కమిటీ తరచూ తనిఖీలు చేయాలి"

"అటువంటి దాడులు ఎప్పుడోగాని జరగవు" అన్నాడు సుబ్బారావు.

"నిజమే"

"మీరు ఎవరో కమల సంగతులు చెబుతున్నారు గాని, మీ సంగతి చెప్పడంలేదే" అన్నాడు సుబ్బారావు.

"నాట్ నౌ..!" అన్నది మార్గరెట్ డ్రైవర్ వున్నాడని సంజ్ఞ చేస్తూ.

సుబ్బారావు ఆమె వుద్దేశ్యం గ్రహించి వూరుకున్నాడు. చీకటి పడుతూవుండగా కారు మెదక్ చేరింది. పట్టణమంతా పండుగ వుత్సాహం నెలకొని వుంది. ఆడ, మగ పిల్లలు కొత్త బట్టలు కట్టుకుని చర్చి వైపు నడుస్తున్నారు. కారు దూరంగా ఆపి ఇద్దరూ చర్చికి బయల్దేరారు. పురాతనమైన ఆ చర్చి గురించిన విశేషాలు చెబుతూ వుంది మార్గరెట్. చర్చికి పోయే రోడ్డు బాగా రష్‌గా వుంది. అప్పుడప్పుడూ ఆ జనం మధ్య మార్గరెట్ వెనకబడుతూ వుంది. సుబ్బారావు ఆమె అరచేతిని తన చేతిలోకి తీసుకుని నడవసాగాడు. ఆమె గూడా అభ్యంతర పెట్టలేదు. ఆమె చేతిలో చెయ్యివేసి అడుగులు వేయడం అతనికి చాలా ఆనందంగా వుంది. తన జీవితం ఏదో మలుపు తిరుగుతున్నట్లు, అద్భుతమైన అనుభూతి ఏదో కలుగుతోంది. అత

## హ్యూస్టన్‌లో గాంధీజాడలు




**గాం**ధీజీ ఒక్క భారతదేశానికే మహాత్మునిగా పరిమితం కాలేదు. విదేశాలలో కూడా ఆయన మహోన్నత మానవమూర్తిగా గుర్తింపు పొందారు. అమెరికాలోని టెక్సాస్‌లోని హ్యూస్టన్‌లో గాంధీజీ 141వ జయంతి సందర్భంగా భారతీయులు అధికంగా ఉండే హిల్‌క్రాఫ్ట్ అనే ప్రాంతానికి 'మహాత్మాగాంధీ డిస్ట్రిక్ట్' అంటూ అధికారికంగా పేరు పెట్టారు. లక్షమంది భారతీయ అమెరికన్లు గత ఏడేళ్లుగా దీన్ని కోరుతున్నారు. హ్యూస్టన్ నగర మేయర్‌గా పనిచేస్తున్న ఏనైస్ పార్కర్ అనే ఆవిడ ఈ కోరికను ఎట్టకేలకు నెరవేర్చింది. లిటిల్ ఇండియాగా పిలిచే హిల్‌క్రాఫ్ట్‌కి ఈ




నామకరణం చేసే సందర్భంగా ఏర్పాటయిన ఉత్సవాలకు హ్యూస్టన్‌లోని కాన్సులేట్ జనరల్ ఆఫ్ ఇండియా సంజీవ్ అరోరా ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ఈ మేరకు బోర్డులను మార్చడానికి పదివేల డాలర్లు ఖర్చయ్యాయి. మొత్తం 31 బోర్డులను మార్చారు. మహాత్మాగాంధీ స్ఫూర్తితోనే మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్ 1960లలో నల్లవారి పరిపూర్ణ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకోసం అహింసా మార్గంలో పోరాడి విజయం సాధించాడు. అమెరికన్లకు నేటికి కూడా గాంధీ అంటే ఎనలేని గౌరవం ఉందనడంలో ఎలాంటి ఆశ్చర్యం లేదు.

# చతుర ప్రవేశిక

## డిసెంబరు చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపిక చేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. మొదట్లో సుబ్బారావు చేసిన ఉద్యోగం?
జ.
2. మార్గరెట్ అసలు పేరు?
జ.
3. వెన్నెల ఎవర్ని ప్రేమించింది?
జ.
4. అంజలి భర్త?
జ.
5. త్యాగరాజు కొడుకు?
జ.
6. మహేశ్వర్ చెల్లెలు?
జ.
7. 'బొగొయ్‌చూక్' అని పేరు పెట్టుకున్నది?
జ.
8. విలియం టిన్‌డేల్ అనువదించింది?
జ.
9. 'వక్రరేఖ' నవలా రచయిత?
జ.
10. స్కూళ్ల ఇన్‌స్పెక్టర్ పేరు?
జ.

పంపినవారి పేరు: ----------------

-------------------వయసు (   )

చిరునామా: -------------------

----------------------------

----------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

నికి ఎంతో వుత్సాహంగా వుంది. మార్గరెట్ వెచ్చని అరచేతి స్పర్శ అతనికి మైమరపు కలిగిస్తోంది. ఆమెగూడా అతని స్పర్శ కోసం తహతహలాడుతున్నట్లుగా అతనికి దగ్గరగా జరిగి ఆనుకుని అడుగులు వేస్తోంది.

కాకినాడలో వున్నప్పుడు మల్లీశ్వరిని దాదాపు రోజూ చూస్తుండేవాడు. అప్పుడామెకు పదిహేడేళ్ళుండేవేమో? సన్నగా సన్నజాజి తీగలా వుండేది. పరికిణి, వోణీ వేసుకుని సంప్రదాయపు సొగసులతో చూడముచ్చటగా వుండేది. ఆమె మెడలో బంగారు చైన్ గూడా ఒంటి రంగులో కలిసిపోయేది. రోజూ చూస్తున్నా ఆమెతో ఒక్కసారి గూడా మాట్లాడలేదు. ఆమె ముఖం అలా తన మనసులో ముద్రించుకుపోయింది. అప్పటి మల్లీశ్వరిని పాతికేళ్ళ తర్వాత మార్గరెట్‌గా చూసినప్పుడు గుర్తించగలిగాడంటే ఆమె ముఖంలో మార్పు లేకపోవడమే. శరీరంలో మార్పు వచ్చింది. ఎత్తుకి తగిన లావుతో ఇప్పుడు పరిపూర్ణ స్త్రీత్వం సంతరించుకుని ఆమె అందానికి మెరుగులు దిద్దుకున్నట్లు కనిపిస్తోంది. అసలు మల్లీశ్వరి మార్గరెట్ ఎందుకైంది. ఆంజనేయులు కూతురు అగస్టీన్ కూతురు ఎందుకైంది. ఆమె పెళ్ళెందుకు చేసుకోలేదు?

అతనికి అదంతా తెలుసుకోవాలని కుతూహలంగా వుంది. ఆమె సమయం వచ్చినప్పుడు అదంతా వివరిస్తానని అన్నది. ఆ సమయం కోసం ఎదురు చూస్తున్నాడు సుబ్బారావు.

ప్రార్థనలు ముగిసిన తర్వాత చర్చిలో నుంచి బైటకు వచ్చారు.

"ప్రతి సంవత్సరం డాడీ నాతోపాటు ఇక్కడికి వచ్చేవారు. ఈసారి ఆయన మిస్సయ్యారు. ఏదో ఒకరోజు డాడీ నా లైఫ్ నుంచి గూడా మిస్సవుతారు గదా?" అన్నది మార్గరెట్.

ఎందుకో ఆమె ముఖంలో విచారం తాండవిస్తోంది. ఆమె కంఠం వణికింది ఆ మాటలు అంటున్నప్పుడు. భవిష్యత్తు గురించి భయపడుతున్నట్లనిపించింది. తండ్రి చనిపోతే ఆమెది ఒంటరి బతుకే. ఏకాంత జీవితం ఎవరికైనా బాధాకరమే.

"డాడీ పోయిన తర్వాత నేను ఒంటరిగా వుండాలి కదా అనిపించినప్పుడు, నాకు నిద్ర పట్టదు సుబ్బారావ్!" అన్నది నెమ్మదిగా.

ఆమె తనని ఏకవచనంలో సంబోధిచడం అతనికి ఎంతో థ్రిల్ కలిగించింది. హృదయం పులకరించింది. ఆమెకు తను ఎంతో దగ్గరవాడయ్యాడనే ఫీల్ కలగజేసింది. ఎందుకో మనసు ద్రవించింది. ఆమె భుజంమీద చెయ్యివేసి దగ్గరకు తీసుకున్నాడు. ఆమె తలెత్తి అతని ముఖంలోకి చూసింది. ఆమె పెద్ద పెద్ద కళ్ళు నీళ్ళతో నిండివున్నాయి. కన్నీళ్లు వుబికి ఆమె చెంపల మీదుగా జారుతున్నాయి.

"వాటీజ్ దిస్ మార్గరెట్? ఎందుకు కన్నీరు?" అంటూ తన కర్చీఫ్ తీసి బుగ్గల మీదుగా కారుతున్న కన్నీటిని తుడిచాడు.

ఆమె అతని ఆప్యాయతకి, అనురాగానికి మైనపుబొమ్మలా కరిగిపోయింది. ప్రేమ రాహిత్యంతో బాధపడేవారికి అనుకోకుండా అటువంటి ప్రేమ దొరికినప్పుడు కరిగిపోక తప్పదేమో! మార్గరెట్ మానసిక పరిస్థితి గూడా సరిగ్గా అట్లాగే వుంది. ఆమె హృదయం ప్రేమాప్యాయతల కోసం పరితపిస్తోంది. సుబ్బారావు కాస్త ప్రేమ చూపించేటప్పటికి ఎండి మోడువారిన కొమ్మ చిగురించినట్లు, గుండెలో అమృతం కురిసినట్లనిపించి ఆమె పులకరించిపోయింది. చుట్టూ ఎంతోమంది జనం మధ్య వున్నా ఆమె భేషజం వదిలి అతన్ని చుట్టుకుపోయింది. రెండుచేతులు అతని చుట్టూవేసింది. అతన్ని గాఢంగా హత్తుకుంది. ఐతే ఆమె కళ్ళు వర్షించడం మానలేదు. కళ్ళు తడుస్తూనే వున్నాయి. కన్నీరు పొంగుతూనే వుంది. ఉద్వేగం అణచుకోలేక ఆమె పెదవులు వణుకుతున్నాయి. ఆనందంతోనో, దుఃఖంతోనో ఆమె పెద్దగా విలపిస్తోంది.

కొందరు వాళ్ళిద్దర్నీ వింతగా చూస్తున్నారు. 'పాపం! ఆమెకు ఏం కష్టం వచ్చిందో? ఎందుకు ఏడుస్తున్నదో?' అనుకుంటున్నారు. ఆమె వారెవరినీ గమనించడంలేదు. ఆమె మనసు రెక్కలొచ్చిన పక్షిలా స్వేచ్ఛగా విహరిస్తోంది అక్కడ. ఆమెకు తెలిసిన వాళ్ళెవరూ అక్కడ లేకపోవడంతో భేషజాన్ని వదిలేసి తనివితీరా ఏడుస్తోంది.

"ప్లీజ్ మార్గరెట్! ఎందుకు ఏడుస్తున్నావు? ఊరుకో. అందరూ మనల్నే చూస్తున్నారు" అంటూ అతను ఆమె కన్నీరు తుడుస్తున్నాడు.

"డాడీ పోతే నేను ఒంటరిదాన్నయిపోతాననే భావమే నన్ను బాధిస్తోంది సుబ్బారావ్! డాడీ హెల్త్ ఏమాత్రం బాగాలేదు. పంటిబిగువున తిరుగుతున్నాడు. ఏరోజైనా కొలాప్సయిపోవచ్చు" అన్నది.

"అది–ఎప్పటికైనా తప్పదు మార్గరెట్. ఇప్పట్నుంచే బాధ ఎందుకు? నేనున్నాను గదా!" అన్నాడు సుబ్బారావ్.

ఆమె అతన్నుంచి విడివడింది. అతని కళ్ళలోకి సూటిగా చూసింది. అతని భావం ఏమైవుంటుంది? ఇక నీ జీవితంలోకి నేను ప్రవేశించాను అని సూచిస్తున్నాడా? సుబ్బారావు తనకు తోడుగా వుంటాడా? ఏనాటి అనుబంధం ఇది? అతను ఎవరు? తను ఎవరు? ఇంత స్వల్పకాలంలో తను ఎలా అతనికి దగ్గర కాగలిగింది?

ఆమె మనసులో ఆలోచనలు పసిగట్టిన

## పరస్పర స్తుతి!

సాధారణంగా స్నేహితులు ఒకరి గొప్పను ఒకరు ప్రశంసించుకుంటుంటారు. ఇందులోనూ వ్యంగ్యాన్ని మేళవించడం మునిమాణిక్యంవారి ప్రత్యేకత. ఒకసారి ఆయన తన



స్నేహితుడైన ఓ కవి గురించి ఒక సభలో చెబుతూ 'ఆయన పద్యాలు నేనెప్పుడూ చదవలేదుగాని, ఆయనమటుకు గొప్పకవి అని నా అభిప్రాయం. అదేవిధంగా నా కథలను ఆయనెన్నడూ చదవలేదుగాని నేనో మంచి కథకుడినని ఆయన అభిప్రాయం' అన్నారు హాజరైన సభికులను నవ్విస్తూ.

ట్లుగా అతను ఆమెకళ్ళలోకి చూస్తూ "యస్.." అన్నాడు.

ఆ మాట ఆమె హృదయంలో పన్నీటి జల్లు కురిసినట్లుగా అనిపించింది.

"థాంక్యూ!" అన్నది.

సుబ్బారావు మర్నాడు వుదయం ఇంటికెళ్ళేసరికి పదిగంటలైంది. అతను గేటు ముందే కారు దిగి, మార్గరెట్ కారు డ్రైవర్ని వెళ్ళిపొమ్మని చెప్పాడు. సెక్యూరిటీ గార్డు గేటు తీశాక ఇంట్లోకి వెళ్ళాడు. అప్పటికే హాల్లో కిరణ్‌రావు, సౌభాగ్యరావు, హేమలత సోఫాల్లో కూర్చుని వున్నారు. అతన్ని చూసి హేమలత సోఫాలో నుంచి లేచి నిలబడింది.

సుబ్బారావు ఒక సోఫాలో కూర్చుని కిరణ్‌రావుని వుద్దేశించి "ఏంటోయ్? పొద్దున్నే వచ్చావ్? " అన్నాడు.

"నువ్వు చేసిన నిర్వాకానికి నిన్నట్నుంచి హడలి చస్తున్నాం" అన్నాడు కిరణ్‌రావు నిష్ఠూరంగా.

"నేను ఏం చేశానోయ్? " తాపీగా అడిగాడు.

"ఏం చేశావా? నిన్నట్నుంచి నీ సెల్ పని చేయడంలేదు. ఎక్కడికి వెళ్ళావ్? నీ ఆచూకీ తెలియక ఇక పోలీస్ కంప్లైంట్ ఇద్దామనుకుంటున్నాం" అన్నాడు కిరణ్‌రావు.

సుబ్బారావు పకపక నవ్వాడు. అతను ఎందుకో చాలా ఆనందంగా వున్నాడు. ఇంట్లో వున్నప్పుడు సీరియస్‌గా వుండే అతని ముఖం ఇప్పుడు కళకళలాడుతూ వుండడం హేమలత కనిపెట్టింది. అతను సరికొత్త సుబ్బారావులా కనిపిస్తున్నాడు.

"నయమే. 'కనిపించడంలేదు' అని న్యూస్ పేపర్లో గూడా వేయించారు కాదు" అన్నాడు.

"సర్లేగాని ఎక్కడికి పోయావు నిన్నంతా? రాత్రిగూడా ఇంటికి రాలేదు. నీ ఫోన్ పని చేయకపోయేసరికి కంగారు పడుతున్నాం. సెల్ ఎందుకు స్విచ్ఛాఫ్ చేశావు? " అడిగాడు కిరణ్‌రావు.

"స్విచ్ఛాఫ్ చేయలేదు. ఛార్జింగ్ అయిపోయింది. నిన్న ఒకఫ్రెండ్‌తో కలసి మెదక్ వెళ్లాను"

"మెదక్ ఎందుకు? "

"ఆ ఫ్రెండ్ క్రిస్టియన్. నిన్న వాళ్ళ పండుగ గదా? మెదక్ చర్చికి ప్రేయర్ చేయడానికి రమ్మంటే వెళ్ళాను" చెప్పాడు సుబ్బారావు.

ఆ క్రిస్టియన్ ఫ్రెండ్ ఎవరో కిరణ్‌రావు అడగలేదు.

'ఆ ఫ్రెండ్ డాక్టర్ మార్గరెట్ కాదు గదా? ' అనుకుంది హేమలత.

తర్వాత ఆమె లోపలకు వెళ్ళింది. పనిపిల్ల ట్రేతో కాఫీ కప్పులు తెచ్చి టీపాయ్

మీద వుంచింది.

"నువ్వెప్పుడొచ్చావురా? " అని తమ్ముడిని అడిగాడు సుబ్బారావు కాఫీ కప్పు చేతిలోకి తీసుకుంటూ.

"నిన్న పొద్దున్నే వచ్చాను అన్నయ్యా! వస్తానని చెప్పానుగా!" అన్నాడు సౌభాగ్య రావు.

"ఔను. నీ సంగతే మర్చిపోయాను. ఎట్లా వున్నారు మన వాళ్ళంతా? తుపానుకి పంటలన్నీ పోయాయటగా? " అని అడిగాడు.

సౌభాగ్యరావు తమ వూరి సమస్యలు ఏకరువు పెడుతూ వున్నాడు. కిరణ్‌రావు ఇక ఆఫీసుకి బయల్దేరతానని చెప్పి, వెళ్ళాడు. లంచ్ తర్వాత వస్తానన్నాడు సుబ్బారావు.

లంచ్ తర్వాత సౌభాగ్యరావు సుబ్బారావు గదిలోకి వచ్చి, "ఇక బయల్దేరతా అన్నయ్యా!" అన్నాడు.

తమ్ముడి వుద్దేశ్యం గమనించి డబ్బుతీసి ఇచ్చాడు.

"ఊళ్ళో అందర్నీ అడిగానని చెప్పు" అన్నాడు.

సౌభాగ్యరావు తలవూపాడు. తర్వాత సౌభాగ్యరావుని స్టేషన్ దగ్గర డ్రాప్‌చేసి ఆఫీసుకి బయల్దేరాడు సుబ్బారావు.

ఆ రాత్రి సుబ్బారావుకి చాలాసేపు నిద్రపట్టలేదు. మల్లీశ్వరి మార్గరెట్‌గా ఎందుకు మారిందనే కథ రాత్రి మార్గరెట్ చెప్పినపుడు ఆమెపై జాలి కలిగింది. ఆమె పట్ల సానుభూతితో హృదయం నిండింది. టీనేజ్‌లో ప్రేమించడం అనే చిన్న పొరపాటు వల్ల ఆమె జీవితం అనూహ్యమైన మలుపులు తిరిగింది. ఆమె భావి జీవితానికి శాపమైంది.

అందరు ఆడపిల్లల్లాగే భవిష్యత్తు గురించి అందమైన కలలు కన్నది మల్లీశ్వరి. ఇంటర్ సెకండ్ ఇయర్‌లో వున్నప్పుడు, వాళ్ళింటి మేడపైన అద్దెకుండే మధుసూదన్‌తో ప్రేమలో పడింది. అతను అప్పటికే బ్యాంక్‌వుద్యోగి. ఆమెను పెళ్ళి చేసుకుంటానని నమ్మబలికాడు. ఆ వయసులో లోకానుభవంలేని మల్లీశ్వరి అతని మాటలు నమ్మింది. అతని మాయ మాటలకు లొంగిపోయింది. ఇంటర్ పూర్తయ్యేసరికి మల్లీశ్వరి గర్భవతి అయింది. ఆ సంగతి గ్రహించి అతను ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోయాడు. ఎక్కడో ఉత్తరప్రదేశ్‌కి అతనికి ట్రాన్స్‌ఫరైందని బ్యాంకులో చెబితే హతాశురాలైంది. ఇంట్లో తెలిసి తండ్రి గొడ్డుని బాదినట్లు బాదాడు. పరువుతీసిందని బైటకునెట్టి తలుపు వేశాడు. మల్లీశ్వరికి ఇంకా ఇద్దరు చెల్లెళ్ళున్నారు. పెద్దకూతురు చేసిన పరువు తక్కువ పనివల్ల మిగిలిన ఆడపిల్లలకు పెళ్ళిళ్ళుకావని భయపడ్డాడు. మల్లీశ్వరికి దిక్కుతోచలేదు. ఇక ఆత్మహత్య శరణ్యమని సముద్రంలో దూకింది. అప్పుడు రక్షించాడు అగస్టీన్. ధైర్యంచెప్పి ఆశ్రయం యిచ్చాడు. ఆమెకు నెలలు నిండుతూనే హైదరాబాద్‌కి వచ్చేశారు. ఆమె ప్రసవం కాగానే శిశువుని పెంపకానికి యిచ్చేశాడు.

"నువ్వికి మల్లీశ్వరివి కాదు, నా కూతురివి. నీ పేరు ఇకనుంచి మార్గరెట్. నీకు పుట్టిన శిశువుని పెంపకానికి యిచ్చేశాను, ఎందుకంటే నువ్వు మళ్ళీ మళ్ళీ మోసపోగూడదని అలా చేశాను. పెళ్ళి కాకుండా తల్లివి అయిన నిన్ను లోకం చిన్నచూపు చూస్తుంది, అసహ్యించుకుంటుంది. చెడిపోయినదానివని కాకుల్లా పొడుస్తారు లోకులు. సహాయం చేయకపోగా అపకారం చెయ్యడానికి చూస్తారు. ఇతరుల జీవితాల్లో ఏవైనా లొసుగులుంటే వాటిని గురించి ప్రచారం చెయ్యడం కొందరికి సరదా! వాళ్ళెంత బాధపడతారో ఆలోచించరు. వాళ్ళనే శాడిస్టులంటారు. నీకు

పుట్టిన శిశువుమీద మమకారంతో పెంచుకుంటూ నీ బతుకు నువ్వు బతుకుతున్నా నిన్ను ప్రశాంతంగా వుండనివ్వరు. నీ అందచందాలు నీకు శాపమవుతాయి. నీ బిడ్డని కన్నబిడ్డగా చూస్తామని ఎవడో నీమీద వల విసురుతాడు. ఆ తర్వాత వాడి అసలు స్వరూపం నీకు తెలుస్తుంది. నువ్వు కులటవని నిందించి వదిలేసి పోతాడు. ఆ బాధలు నువ్వు పడగూడదు. నువ్విక కొత్తజీవితం ప్రారంభించు. నువ్వు బాగా చదివి నలుగురికీ సేవ చేయి. ఇతరులకు సేవ చెయ్యడంలో, సహాయపడడంలోనే మనిషికి ఎంతో సంతోషం కలుగుతుంది, తృప్తిగా వుంటుంది. జీవితంలో సమస్యలకు తావుండదు. నువ్వు స్వేచ్ఛగా వుండగలుగుతావు" అని హితబోధ చేశాడు.

చర్చిలో పాస్టర్‌గా వున్న అగస్టీన్ ఆమెను కూతురిగా దత్తత తీసుకుని పేరు మార్పించాడు. శ్రద్ధగా చదువుకుని డాక్టరైంది. గత ఇరవయ్యేళ్ళుగా ఎటువంటి ప్రలోభాలకు గురికాలేదు. డాక్టర్‌గా మంచిపేరు తెచ్చుకుంది. అగస్టీన్ జీవితం చివరిదశకు వచ్చినప్పటినుంచి ఆమెకు తను ఒంటరిదాన్నయిపోతానేమో అనే భయం పట్టుకుంది. ఇన్నాళ్ళు తోడునీడగా వున్న మనిషి దూరమైపోతున్నాడని ఆమె వేదన చెందుతోంది. సరిగ్గా ఇదేసమయంలో యాదృచ్ఛికంగా సుబ్బారావు పరిచయమయ్యాడు. 'నువ్వు మల్లీశ్వరివేనా?' అంటూ గతం తాలూకు తేనెతుట్టెను రేపాడు. గత పాతికేళ్ళుగా మల్లీశ్వరంటే తెలిసిన వాళ్ళెవరూ ఆమెకు తటస్థపడలేదు. ఆమె కుటుంబంవారు ఆమెను గురించి పట్టించుకోలేదు. చచ్చిందో, బతికి వున్నదోనని గూడా ఆసక్తి చూపించలేదు. అగస్టీన్ ఆశ్రయంలోనే మొండిగా, శిలలా జీవితాన్ని కొనసాగించింది. సుబ్బారావు తనపై ఆసక్తి కలిగివుండడం ఆమెకు సంతోషం కలిగించింది. అతని సాన్నిహిత్యం ఆమెను నెమ్మదిగా కరిగించింది. తన పెంపుడు తండ్రి అగస్టీన్ పోయాక తదుపరి జీవితంలో తోడుగా వుండదగిన మగాడిగా సుబ్బారావుని గుర్తించింది. అతను గూడా భార్యాపిల్లల వైఖరితో విసిగిపోయి తన సమస్యలను ఆమెతో చెప్పుకుని వూరట పొందడం మొదలుపెట్టాడు. పెళ్ళి చేసుకుని, యాంత్రికంగా సంసారం చేసి, పిల్లలకు తండ్రి అయితే అయ్యాడుగాని, జీవితంలో ప్రేమను అనుభవించిన వ్యక్తికాదు. ఇద్దరూ ప్రేమరాహిత్యంతో సతమతమవుతున్న సమయంలో పరిచయమై ఒకరి సమక్షంలో మరొకరు సేదతీరారు. అదే సన్నిహితుల్ని చేసింది. ఇక్కడ వయసు ఎంతని కాదు. జీవితంలో ఎన్నడూ పొందని ప్రేమ దొరికినప్పుడు ఆస్వాదించకపోవడం పిరికితనం. ఇప్పుడిక సమాజం తమ గురించి ఏమనుకుంటుంది? అనేది వారికి అవసరంలేదు.

క్రిస్మస్ పండుగ వారి జీవితాలకు ఆనందం తెచ్చిపెట్టింది. మార్గరెట్ సమక్షంలో సుబ్బారావు యువకుడైపోతున్నాడు. తనకు భార్య వున్నదనీ, ఎదిగిన పిల్లలున్నారని అతనికి గుర్తురావడం లేదు. ముందుముందు తమ మధ్య సంబంధం గురించి బైటపడితే ఏం జరుగబోతోంది? అని సుబ్బారావు ఆలోచించడం లేదు.

★ ★ ★

ఉదయం ఏడుగంటలైంది. సుబ్బారావు అప్పుడే వాకింగ్ వెళ్ళివచ్చి హాల్లోని సోఫాలో కూర్చుని టీవీలో న్యూస్ చూస్తున్నాడు. ల్యాండ్‌లైన్ ఫోన్ మోగింది. సుబ్బారావు రిసీవర్ ఎత్తి "హలో..!" అన్నాడు.

"హలో! మిసెస్‌రావుగారు కావాలండీ!"





ఎవరో ఆడమనిషి మాట్లాడింది.

"మీరెవరు? " అడిగాడు సుబ్బారావు,

"నా పేరు మాయాదేవి"

"ఎక్కడ్నుంచి మాట్లాడుతున్నారు? "

"ద్వారకానందస్వామి ఆశ్రమం నుంచి"

"ద్వారకానంద స్వామా? ఆయనెవరు? మీ ఆశ్రమం ఎక్కడుంది? "

"మీకు తెలియదా? మిసెస్ రావు స్వామి భక్తురాలు. మా ఆశ్రమం విశాఖ పట్నం దగ్గర్లోనే సముద్రపు ఒడ్డున వుంటుంది. ఐతే మీరెప్పుడూ రాలేదన్న మాట"

"నాకు ఇంతవరకు తెలీదు"

"మీరు సుబ్బారావుగారా? "

"ఔను"

"కొంచెం మిసెస్‌రావు గారిని పిలుస్తారా? "

"ఆమె ఇంకా నిద్రలేవలేదనుకుంటాను. షుగరో, బీపీనో ఎక్కువైనప్పుడు తొందరగా లేవదు"

"అయ్యో! అలాగా? "

"పనేమిటో చెప్పండి"

"ఇక్కడ ఆశ్రమం సమీపంలో భక్తులు వచ్చినప్పుడు వుండడానికి, వారి సౌకర్యం కోసం కాటేజీలు కట్టిస్తున్నామండీ. మిసెస్‌రావుగారు కూడా ఒక కాటేజీ బుక్ చేసి, అది కట్టించేందుకు కొంత డబ్బు కట్టారు. మిగిలిన డబ్బులు పంపిస్తారేమోనని"

"వాట్? అక్కడ ఆమె కాటేజీ బుక్ చేసిందా? "

"ఔనండీ. పాతికలక్షలు పే చేశారు. ఇంకొక పాతిక లక్షలు పంపిస్తే పూర్తయిపోతుంది. లోపల వైరింగ్, ఫర్నిచర్, కప్‌బోర్డులకు వుడ్‌వర్క్, డెకరేషన్ కర్టెన్స్‌తో సహా పూర్తయిపోతాయి. మీరు ఫ్యామిలీతో ఎప్పుడు వచ్చినా హాయిగా వుండొచ్చు. అన్ని సౌకర్యాలున్నాయి"

"కాటేజీ ఏభైలక్షలా? "

"ఎందుకండీ అంత ఆశ్చర్యపోతున్నారు? ఇండిపెండెంట్ డూప్లెక్స్‌హౌస్‌లా డిజైన్ చేయించాం. కిచెన్‌లో గ్యాస్‌తో సహా అన్నీ వుంటాయి. సోలార్ హీటింగ్ సిస్టమ్‌తో ఇరవైనాలుగు గంటలూ వేడినీళ్ళు సప్లయ్ అవుతుంటాయి"

"ఎన్నివున్నా ఏభైలక్షలు పెట్టి కాటేజీ ఏంటీ? ఎప్పుడొచ్చినా రెండుమూడు రోజులు వుంటారు ఎవరైనా. మహా

## నువ్వా? మీ అన్నయ్యా?

ఉపాధ్యాయ వృత్తి వల్ల ఏ వూరికెళ్లినా మునిమాణిక్యంవారికి తనవద్ద చదువుకున్న శిష్యగణం తారసపడుతూనే ఉండేది. ఒకే కుటుంబంలోని అన్నదమ్ములందరూ ఆయన వద్ద చదువుకున్న సంఘటనలు అనేకం ఉన్నాయి. ఒకసారి తనవద్ద చదువుకున్న కవలపిల్లల్లో ఒకతను చనిపోయాడని ఆయన



విన్నారు. తర్వాతెప్పుడో ఆ కవలల్లో ఒక బ్బాయి ఎదుటపడి నమస్కరించాడు. అతడ్ని చూసి మునిమాణిక్యం, 'బాబూ! మీ ఇద్దరిలో చనిపోయింది నువ్వా? మీ అన్నయ్యా?' అని అడిగారు తన సహజ ధోరణిలో.

అతడేం చెప్పాలో తోచక చూస్తుంటే 'అయితే అబ్బాయి! నువ్వు నువ్వేనా? లేక మీ అన్నయ్యవా?' అని మళ్లీ అడిగారు మునిమాణిక్యం. దాంతో అతను వెంటనే గందరగోళం నుంచి తేరుకుని తను ఫలానా అని సమాధానం చెప్పాడు.

అయితే వారం. అంతేగాని, సంవత్సరాలు తరబడి అక్కడే వుండిపోతారా? అదే మైనా కాశీ పుణ్యక్షేత్రమా.. చివరిరోజుల్లో వుండిపోవడానికి? " కోపంగా అన్నాడు సుబ్బారావు.

"అయ్యో! అలా అనకండీ. మిసెస్‌రావు గారు ఇష్టపడి కాటేజీ బుక్ చేసుకున్నారు. ఆమె స్వామి భక్తురాలు. ప్రశాంతంగా గడపడం కోసం కాటేజీ కావాలనుకున్నారు. వారికి ఏభైలక్షలు ఒక లెక్కలోనివా? మోక్షం ముఖ్యంగాని, డబ్బు ముఖ్యం కాదు గదా? పోయేటప్పుడు డబ్బు వెంటవస్తుందా సుబ్బారావుగారూ? " అనునయంగా చెప్పింది మాయాదేవి.

"ఉన్నంతకాలం డబ్బు ముఖ్యమే. ఇష్టం వచ్చినట్లు ఖర్చుపెడితే ఈ జన్మలోనే చిప్ప చేతికి వస్తుంది. ఆవిడదేంపోయింది? సంపాదించి తెస్తుంటే ఎడంచేత్తో పారేస్తోంది. ఉన్నప్పుడు డబ్బు విలువ తెలీదు ఎవరికైనా! లేనప్పుడు తెలుస్తుంది" తీవ్రంగా అన్నాడు.

"సరే! మళ్ళీ ఫోన్ చేస్తాను" అని మాయాదేవి లైన్ కట్‌చేసింది.

సుబ్బారావుకి పొద్దున్నే బీపీ పెరిగినట్లనిపించింది. ఇన్నాళ్ళూ తన స్నేహితురాళ్ళతో సిటీలోనే వుండే బాబాలు, అమ్మలు అంటూ వెళ్తుంటే పోనీలే అనుకునేవాడు. ఇంట్లో ఎంతని కాలం గడుపుతుంది? అప్పుడప్పుడూ అలాంటి కార్యక్రమాలకు వెళ్ళి మంచి సంగతులు తెలుసుకుంటే వుపయోగమే కదా అనుకున్నాడు. మానసిక ప్రశాంతత గూడా వుంటుందని సమాధానపడ్డాడు. హేమలత తనను గూడా అటువంటి కార్యక్రమాలకు తీసుకెళ్ళాలని ప్రయత్నించింది, కాని తనకు బిజినెస్ పనుల్లో తీరిక లేకపోవడమే కాక, ఆసక్తి, అభిరుచి గూడా లేవు. ఏదైనా ప్రయత్నం మీద సాధించుకోవాలి గాని, పూజలు, వ్రతాలు చేసి దేవుళ్ళని అడుక్కుంటే ఇస్తారని అతనికి నమ్మకం లేదు. అందుకే భార్యతో ఎక్కడికీ వెళ్ళేవాడు కాదు. భర్త ధోరణి గమనించి హేమలత గూడా బలవంత పెట్టలేదు. ఆమెకు తోడు డబ్బున్న స్నేహితురాళ్ళు చాలామంది పరిచయమయ్యారు.

ఐతే ఆమె బాబాల, స్వాముల పిచ్చి లక్షలు ఖర్చుచేసే వరకు పోతుందని వూహించలేదు సుబ్బారావు. ఆ ద్వారకానంద స్వామిది బిజినెస్‌మైండని అర్థమైపోయింది. విశాఖ చివర్లలో ఏ బంజరు భూమో, ఏ భక్తుడో యిచ్చివుంటాడు. దాంట్లో కాటేజీలని బిజినెస్ మొదలుపెట్టాడు. అక్కడ భూమికి విలువ ఏమీ వుండదు. ఎంత పోష్‌గా డూప్లెక్స్‌హౌస్ కట్టించినా ఇరవైలక్షలు కన్నా ఎక్కువ ఖర్చవదు. మిగిలినదంతా వెనుకేసుకోవడమే. అదీగాక ఎంత భక్తులైనా ఎప్పుడూ అక్కడే వుండిపోరు. ఆర్నెల్లకో, సంవత్సరానికో వెళ్ళి రెండు, మూడు రోజులు వుంటారు. మిగిలిన కాలమంతా అద్దెకు యిచ్చుకుని ఆదాయం పొందవచ్చు. సొమ్మొకడిది సోకు ఒకడిది అనేది ఇదే.

'హేమలత ఆ ద్వారకానంద స్వామి ట్రాప్‌లో పడిపోయి ఏభైలక్షలు ఇవ్వడానికి సిద్ధపడిందంటే ఏమిటి అర్థం? తనకు మాట మాత్రం చెప్పకుండా అటువంటి నిర్ణయం తీసుకున్నదంటే, తనంటే దానికి లెక్కలేదన్నమాట' అని కుతకుత వుడికిపోయాడు సుబ్బారావు.

అప్పట్లో తను ప్రభుత్వోద్యోగంలో వున్నందున వ్యాపారంలో పార్ట్‌నర్‌షిప్ హేమలత పేరుతో పెట్టించాడు. ఆ తర్వాత తను వుద్యోగానికి రాజీనామా చేసినప్పుడు తనతో పాటు ఆమెను కూడా కంపెనీలో ఒక డైరక్టర్‌గా కొనసాగించడం తప్పయిపోయింది. డైరక్టర్‌గా ఆమె





# చిత్రమైన క్రిస్మస్ బహుమతి

అమెరికాకి చెందిన రాయ్ కొలెట్ అనే పెద్దమనిషి గత 27 ఏళ్లుగా క్రిస్మస్‌కు ఓ బహుమతిని తన బామ్మరిదికి పంపుతున్నాడు. అతని నుంచి కూడా మరుసటేడాది క్రిస్మస్ బహుమతిని అందుకుంటున్నాడు. అయితే అది క్రితంసారి తను పంపిన బహుమతే కావడం విశేషం! రాయ్‌కొలెట్‌కు అతని తల్లి కొనిచ్చిన మోల్‌స్కిన్ ప్యాంట్ నచ్చలేదు. కొన్నిసార్లు వేసుకున్నాక అతను దాన్ని బామ్మర్ది లేరికంకల్‌కి క్రిస్మస్ కానుకగా పంపించాడు. అది లేరికి కూడా నచ్చనందున తర్వాతి ఏడాది క్రిస్మస్‌కి దాన్నే బావగారికి తిప్పి పంపాడు. 1987లో తిరిగి రాయ్ దాన్ని లేరికి పండగకు పంపించాడు. 1988లో లేరి మళ్లీ దాన్నే రాయ్‌కి పంపుతూ ఆసారి ఆ ప్యాంట్‌ని బాగా మెలిపెట్టి ఓ అంగుళం వెడల్పు, మూడు అడుగుల పొడవు గల ప్లాస్టిక్ గొట్టంలో పంపాడు. దాంతో వారి మధ్య దాన్ని మళ్లీ మళ్లీ పంపే ఆట మొదలైంది. మరుసటేడాది రాయ్ ఆ ప్యాంట్‌ని బాగా కంప్రెస్ చేసి ఏడంగుళాల పెట్టెలో పెట్టి పంపించాడు. ఆ తర్వాత లేరి దాన్ని ఐదంగుళాల కాఫీకేన్‌లో ఉంచి మూత రాకుండా సీల్‌చేసి బావగారికి తిప్పి పంపాడు. రాయ్ తిరిగి ఆ ప్యాంట్‌ని చిన్న ప్లాస్టిక్‌పెట్టెలో ఉంచి, దాన్ని ఐదు గేలన్ల ఇనుపడ్రమ్‌లో పెట్టి, ఆ డ్రమ్మంతా టిన్ కాంక్రీట్‌తో నింపేసి లేరికి పంపాడు. అంతటితో ఆ ఆట ఆగలేదు. ఆ డ్రమ్‌లో ఏమొచ్చిందో తెలిసిన లేరి ఆ ప్యాంట్‌ని వెతికితీసి మరుసటేడాది పండగకు 600 పౌన్ల బరువుగల ఐరన్ సేఫ్‌లో ఉంచి, తలుపు తెరచుకోకుండా సోల్డరింగ్ చేసి, పంపాడు.




ఇలా కొన్నేళ్లు పంపించుకున్నారు. తర్వాత లేరి ఆ ప్యాంట్‌ని డొక్కుడబ్బాలో ఉంచి, దాన్ని బంతి ఆకారంలో నొక్కించి, 2000 పౌన్ల బరువుగల ఐరన్‌బాల్‌ను రాయ్‌కి పంపాడు. ఆ ప్యాంట్‌ని వెతికితీసే ప్రయత్నంలో అది కాలిపోయింది. దాంతో రాయ్ ఆ ప్యాంట్ బూడిదనే మరో ఏడాది లేరికి పంపాడు. ప్రస్తుతం ఆ బూడిద లేరి ఇంట్లోని ఫైర్‌ప్లేస్ పైభాగంలో ఉంది. ఈ చిత్రమైన ఆటని తాము సరదాకోసం ఆడామని పాత్రికేయులకు వారిరువురు తెలియజేశారు.

ఆదాయం బ్యాంక్‌లో జమచేస్తుండడంతో అదంతా తన స్వంతానికే అనే ఆలోచనతో లెక్కలేకుండా ఖర్చుచేయడం అలవాటైనట్లుంది. ఏదో చీరలకు, నగలకు, స్వంత అవసరాలకు వాడుకుంటే తప్పుపట్టాల్సిందేమీలేదు. పెద్దకొడుకు టూరు వెళ్తుంటే పదిలక్షలు యిచ్చింది. చిన్నకొడుకు స్పోర్ట్స్‌బైకు కొనుక్కుంటానంటే ఇరవైలక్షలకు చెక్ రాసింది. ఇప్పుడేమో ఎక్కడో కాటేజీకని ఏభైలక్షలు. హద్దులేకుండా పోతోంది. తనకు తెలియకుండా ఇంకెన్ని అనవసరపు ఖర్చులు పెడుతున్నదో?

సుబ్బారావు అన్యమనస్కంగానే స్నానం చేశాడు. డ్రస్ వేసుకుంటూనే హేమలతను కంట్రోల్ చెయ్యడం ఎట్లా అని ఆలోచిస్తున్నాడు. ఎందుకో ఆమె ఈరోజు గదిదాటి రాలేదు.

డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని టిఫిన్ చేస్తూ వంటమనిషిని అడిగాడు.

"మీ అమ్మగారు ఎక్కడ?"

"గదిలోనే వున్నారయ్యా! టిఫిన్ అక్కడికే తెమ్మన్నారు" అన్నది.

తను ద్వారకానంద స్వామి ఆశ్రమం తాలూకు వాళ్ళతో మాట్లాడినదంతా పేర

లల్ లైన్‌లో విన్నదేమో? అందుకే తన ఎదుటపడితే అడుగుతానని మొహం చాటేస్తున్నదా?

'హూс.. దీని సంగతి తేలుస్తాను' అనుకున్నాడు.

"మీ అమ్మగారిని నేను రమ్మన్నానని పిలువు" అన్నాడు సుబ్బారావు.

వంటమనిషి హేమలత గదిలోకి వెళ్ళితిరిగి వచ్చింది.

"అయ్యగారు! అమ్మగారికి వంట్లో బాగా లేదంట. మిమ్మల్నే రమ్మన్నారు" అన్నది.

టిఫిన్ చేయడం ముగించి, కాఫీ తాగి హేమలత గదిలోకి వెళ్ళాడు సుబ్బారావు. గొంతువరకు దుప్పటి కప్పుకుని పడుకుని వుంది ఆమె. భర్తని చూసి ముక్కుతూ, మూలుగుతూ లేచికూర్చుంది.

"ఏమైంది? జ్వరమా?" అని పలకరించాడు.

చాలా రోజులకు భార్యను పలకరించాడు. ఆమె ఒక్కసారిగా భర్తవైపు చూసి, "షుగర్ ఎక్కువైనట్లుంది. నీరసం, కాళ్ళులాగుతున్నాయి" అన్నది.

"షుగర్ చెక్ చేయించుకో మళ్ళీ" అన్నాడు.

"ఊс.." అని మూలిగింది.

"ద్వారకానందస్వామి ఆశ్రమం వాళ్ళు ఫోన్ చేశారు" అని మొదలుపెట్టాడు సుబ్బారావు.

"అలాగా? ఏంటంట?"

"నువ్వేదో కాటేజీ బుక్ చేశావని చెప్పారు"

"ఔనండీ! అప్పుడు చెప్పానుగా?"

"నాకెప్పుడు చెప్పావు?"

"అప్పుడే చెప్పానండీ! విశాఖపట్నం వెళ్ళినప్పుడే ఫోన్‌చేసి మరీ చెప్పాను. అందరూ కాటేజీలు బుక్ చేసుకుంటున్నారండీ, మనం గూడా ఒకటి బుక్ చేసుకుందాం అని చెబితే 'సరే' అన్నారు" అన్నది.

"నాకెప్పుడు చెప్పావు? చెప్తే గుర్తుండదా?"



"ఏమోనండీ! మర్చిపోయారేమో? అయినా మీకెన్ని పనులు? ఎన్ని య వ్వారాలు? క్షణం తీరిక లేకుండా వుంటా రాయె? నా మాటలు చెవికెక్కివుండవు" ఆమె మాటల్లో నిష్ఠూరం ధ్వనించింది.

సుబ్బారావుకి ఆమె మాటలు ఎక్కడో గుచ్చుకున్నాయి. మార్గరెట్‌తో పరిచయ మైన తర్వాత భార్యని పూర్తిగా నిర్లక్ష్యం చేస్తున్నాడు. లోగడ అప్పుడప్పుడు మాటా మంతీ అయినా వుండేవి. పడకలు ఎప్పుడో వేరయ్యాయి. ఆమెతో మాట్లాడే అవసరం గూడా లేనట్లు ప్రవర్తిస్తున్నాడు. ఆమెతో అప్పుడప్పుడు పిల్లల విషయంలో ఘర్షణలు పడినప్పటి నుంచి సత్సంబం ధాలు లేవు. రోజురోజుకీ ఇద్దరి మధ్య దూరం పెరిగిపోతూ వుంది. ఇప్పుడైనా ఆ కాటేజీ గొడవ బైటపడినందున భార్యతో మాట్లాడాల్సి వచ్చింది.

తాను మార్గరెట్‌తో గడుపుతూ వున్న సంగతి ఆమె చెవిన పడిందేమో? అందుకే తనను సూటిపోటి మాటలు అంటున్నదేమో అనిపించిందతనికి.

"ఇప్పుడేమైనా కొత్తగా బిజీ అయ్యానా? నా బిజినెస్సే అంత. నీ ఇష్టం వచ్చినట్లు నువ్వు డబ్బు ఖర్చుపెడుతూ పైగా దబా యిస్తున్నావా? " కోపంగా అన్నాడు.

"నేనేం దబాయించాను? ఉన్న సంగ తేగా చెప్పింది? "

"ఏంటి వున్న సంగతి? "

"నిజమే చెప్పాను. అక్కడ కాటేజీకి డబ్బుకడుతున్నానని"

"అబద్ధం చెప్పకు. ఆ ద్వారకానంద స్వామి పేరే ఇంత వరకు వినలేదు నేను.



అటువంటిది నాకు చెప్పానంటావేంటి? "

"అబద్ధం చెప్పాల్సిన ఖర్మేం పట్టింది నాకు? మీకు నామీద ఇష్టం పోయింది. నేనంటే అసలు పడనట్లు ప్రవర్తిస్తున్నారు. ఎందుకు నన్ను సాధిస్తున్నారు? నేనేం చేశాను? మీ దారికి నేను అడ్డం వచ్చానా? మీ ఇష్టం వచ్చినట్లు తిరుగుతుంటే వద్దన్నానా? " అంటూ ఏడవడం మొదలు పెట్టింది హేమలత.

సుబ్బారావు మతిపోయినట్లు చూశాడు. తను కాటేజీ సంగతి నిలదీస్తుంటే, ఆమె ఆ సంభాషణను పక్కదారి పట్టిస్తున్నది.

"ఏంటే నువ్వనేది? పిచ్చిపిచ్చిగా వుందా? " తీవ్రంగా అన్నాడు.

"ఔను. నాకు పిచ్చిపట్టింది. తీసుకెళ్ళి ఎర్రగడ్డ ఆస్పత్రిలో పడేయండి. పీడా విరగడైపోతుంది. లేకపోతే మీ చేత్తోనే కాస్త విషం యివ్వండి. చస్తాను. మీరు హాయిగా వుండొచ్చు" ఏడుస్తూనే గట్టిగా అన్నది.

"నువ్వు చస్తే, నేను హాయిగా వుండడం ఏంటే? మతి లేకుండా ఏదేదో అంటున్నావు? నీ పేరుతో డబ్బున్నదని ఇష్టం వచ్చినట్లు ఖర్చుపెడతావా? అక్కడ కాటేజీ ఏంటి? దానికి ఏభై లక్షలు తగలెయ్యడం ఎందుకు? ఎవడుంటాడు అక్కడకెళ్ళి? అన్నీ పిచ్చిపనులు చేస్తూ, పైగా నన్నే దబాయిస్తున్నావా? "

"కాటేజీకి డబ్బు కడితే నష్టం ఏమిటి? అదిగూడా మన పేరుతోనే ఉంటుంది. ఆస్తి కాదా ఆ బిల్డింగ్? అందులో నేను పాడు చేసేది ఏంటి? "

"ఆ.. అదో ఆస్తి! అదంతా మోసం. ఆశ్రమంవాళ్ళు అద్దెలకు యిచ్చి డబ్బు సంపాదించుకోవడానికి వేసిన ఎత్తు. నీలాంటి పిచ్చిమొహాలు దొరికారు వాళ్ళకి"

"ఐతే ఇప్పుడు ఏమంటారు? "

"ఏమంటానా? క్యాన్సిల్ చెయ్యమంటాను"

హేమలత విసురుగా లేచి వెళ్ళి కాటేజీ తాలూకు అగ్రిమెంట్లు, డాక్యుమెంట్లు, వగైరా తెచ్చి సుబ్బారావు చేతిలో పెట్టింది.

"మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి..." అని మంచం మీద పడుకుని ముసుగు తన్నింది.

సుబ్బారావు కోపంగా వెళ్ళిపోయాడు. ఆఫీసుకి వెళ్ళిన తర్వాత మేనేజర్‌ని పిలిచి కాటేజీ అగ్రిమెంట్ క్యాన్సిల్ చెయ్యమనీ, ఇచ్చిన అడ్వాన్స్ పాతిక లక్షలు రిటన్ చేయమని, ద్వారకానంద ఆశ్రమానికి లెటర్ పంపమని చెప్పాడు.

తర్వాత అతను కిరణ్‌రావు ఛాంబర్‌కి వెళ్ళి కూర్చున్నాడు. సుబ్బారావు సీరియస్‌గా ఉండడం చూసి ఇంట్లో ఏదో జరిగి వుంటుందని ఊహించాడు. ఆఫీస్ బాయ్ కాఫీ కప్పులు తెచ్చి ముందు పెట్టాడు.

"ఏంటోయ్.. ఏం జరిగింది? " అని అడిగాడు కిరణ్‌రావు నవ్వుతూనే.

హేమలత విశాఖపట్నంలోని ద్వారకానంద స్వామి ఆశ్రమంలో కాటేజీ బుక్ చేయడం గురించి సుబ్బారావు చెప్పాడు.

"వాళ్ళు అడ్వాన్స్ తిరిగి ఇస్తారని నమ్మకం లేదు. అటువంటి వాళ్ళకు తీసుకోవడమే తప్ప తిరిగి ఇచ్చే అలవాటు ఉండదు" అన్నాడు కిరణ్‌రావు.

"చూద్దాం. తిరిగి ఇవ్వకపోతే లీగల్‌గా ప్రొసీడ్ అవుదాం" అన్నాడు సుబ్బారావు.

"నీకు తెలియకుండా పాతిక లక్షలు అడ్వాన్స్ ఇవ్వడం తప్పే. ఆ సమయంలో ఆమె అదంతా ఆలోచించి ఉండదు. ఎందుకంటే ఆమెతో వెళ్ళిన సహచరులందరూ కోటీశ్వరుల ఇల్లాళ్లే కదా! మనం బిజినెస్ చేసి సంపాదిస్తాం. గవర్నమెంట్ ఆఫీసర్లు, పొలిటీషియన్లు చేసేది పెట్టుబడి లేని వ్యాపారం. ఖజానాకు చిల్లుపెట్టి కోట్లు గడిస్తారు. ఇంట్లోకి చేరే డబ్బంతా

నల్లధనమే. వాళ్లు ఎంతైనా ఇటువంటి కార్యక్రమాలకు ఖర్చుపెట్టి పుణ్యం, మోక్షం అనే భ్రమలో ఉంటారు. ఆమె గూడా అందరూ కాటేజీలు బుక్ చేస్తుంటే టెంప్ట్ అయి వుంటుంది. మాస్ మెంటాల్టీ అది. లాభమా? నష్టమా? అనే ఆలోచన ఉండదు" చెప్పాడు కిరణ్‌రావు.

"నువ్వు చెప్పింది నిజమే కావొచ్చు. దీని కంతకూ కారణం హేమలతను మనం కంపెనీలో డైరెక్టర్‌గా ఉంచడమే. డబ్బు తన చేతిలో ఉండడంతో ఇష్టం వచ్చిన ట్లుగా ఆడుతోంది. డబ్బంటే లెక్కలేకుండా ఉంది. ఇది ఇంతటితో ఆగదు" అన్నాడు సుబ్బారావు.

"ఐతే ఏమంటావు? "

"కంపెనీ నుంచి తొలగించడమే"

"అలా చేస్తే ఆమె ఫీలవుతుందేమో? కంపెనీ స్టార్టింగ్ నుంచి డైరెక్టర్‌గా ఉంటున్నది కదా? "

"నో సెంటిమెంట్"

"సరే! ఆడిటర్‌తో మాట్లాడదాం" అన్నాడు కిరణ్‌రావు.

తర్వాత ఆడిటర్ సలహా మేరకు, తను అనారోగ్య కారణాల వలన డైరెక్టర్‌గా తప్పుకుంటున్నట్లు ఆమెతోనే రాయించి పదవి నుంచి తప్పుకునేట్లు చేశారు. హేమలతకు లోపల బాధగా ఉన్నా తప్పని పరిస్థితిల్లో డాక్యుమెంట్ మీద సంతకం చేసింది.

కొన్నిరోజుల తర్వాత ఆమె అన్న రమణ తెనాలి నుంచి ఫోన్ చేసి "అమ్మాయ్! నా అకౌంట్‌లో పదిలక్షలు జమ చెయ్. అత్యావసరంగా కావాల్సి వచ్చింది. ఆర్నెల్ల తర్వాత సర్దుబాటు చేస్తాలే" అన్నాడు.

"నా దగ్గర లేవు అన్నయ్యా!" అంటూ జరిగినదంతా చెప్పింది.

"భలే పిచ్చి పని చేశావే" అన్నాడు రమణ.

"మరేం చెయ్యను? అలా చేయాల్సి




జపనీస్ రచయిత హారుకి మురాకమి నవలా రచనప్పుడు ఉదయం నాలుగింటికే లేచి ఐదారు గంటలు ఏకధాటిగా రాసుకుంటాడట! మధ్యాహ్నం పదికిలోమీటర్లు పరిగెత్తడం లేదా పదిహేనువందల మీటర్లు ఈదడం చేస్తాడు. తర్వాత కాసేపు పఠనం చేసి సంగీతం వింటాడు. ఏదిఏమైనా రాత్రి తొమ్మిదింటికల్లా నిద్రకుపక్రమిస్తాడు!

వచ్చింది. ఎందుకు ఆయనతో పేచీ అని సంతకం పెట్టేశాను" అన్నది హేమలత.

"ఇదంతా చూస్తుంటే నీ మీద ఏదో కుట్ర జరుగుతున్నట్లుగా నాకు అనిపిస్తోం దమ్మాయ్!" అన్నాడు రమణ.

"ఆయన నామీద కుట్రేం చేస్తాడు? "

"నీకు తెలీదు. బావ నిన్ను వదిలించుకోవాలని చూస్తున్నాడు"

"నీకెలా తెలుసు? "

"నీకెలా చెప్పాలో అర్థం కావడం లేదు. నాన్నకి తెలిసినప్పటి నుంచి బాధ పడుతున్నాడు"

"ఈ సంగతి నాన్నకేం తెలుసు? ఎవరు చెప్పారు? ఇప్పుడేగా నీకు చెప్పింది ఆ డైరెక్టర్ పదవి వదులుకున్నానని? "

"ఆ సంగతి కాదు"

"మరేంటి అన్నయ్యా!"

"బావ ఎవరో ఒకావిడతో తిరుగుతున్నాడు" చెప్పాడు రమణ.

"ఎవరు చెప్పారు మీకు? "

"చెప్పడం కాదు.. నాన్నతో పాటు, మన ఇంట్లో వాళ్ళందరం చూశాం"

"అందరూ చూశారా? ఎక్కడ? నాకేం అర్థం కావడం లేదు"

"సినిమా హీరో రిసెప్షన్‌కి బావ, ఆవిడ కలిసి వెళ్ళారు. టీవీలో వాళ్ళిద్దరూ చెట్టాపట్టాలేసుకుని తిరగడం అదంతా చూపిం

చారు. మా కళ్ళు మోసం చెయ్యవు కదా! వాళ్ళిద్దరూ మొగుడు పెళ్ళాల మాదిరిగానే అక్కడంతా తిరగడం, అందరితో నవ్వుతూ మాట్లాడడం చూశాం" చెప్పాడు రమణ.

"ఆవిడ ఎత్తుగా, బొద్దుగా, ఎర్రగా ఉంది కదూ? " అడిగింది హేమలత

"ఔను, ఐతే నీకూ అంతా తెలుసన్న మాట"

"ఆవిడ డాక్టర్. పేరు మార్గరెట్"

"ఐతే ఇక చెప్పేది ఏముంది? ఎర్రగా బుర్రగా ఉందని బావ దాని మోజులో పడ్డాడు. అసలు దాన్ని రహస్యంగా పెళ్ళి గూడా చేసుకున్నాడేమో? అందుకే నిన్ను కంపెనీ డైరెక్టర్ పదవి నుంచి తొలగించాడు. ఇప్పటికే ఆవిడను డైరెక్టర్ చేసి ఉంటాడు. ముందు ముందు అది పెత్తనం చేస్తుందేమో? నువ్వు ఇప్పుడే జాగ్రత్తపడాలి. లేకపోతే నువ్వు, నీ పిల్లలు వీధిన పడతారు" హితబోధ చేశాడు రమణ.

హేమలత ఏడవడం సాగించింది.




**మా**ర్గరెట్ ఫాదర్ అగస్టీన్ చనిపోయాడు. సుబ్బారావు దగ్గరుండి అంతిమయాత్రకు ఏర్పాట్లు చేశాడు. చర్చి పాస్టర్ ఇంటి దగ్గర ప్రార్థన కార్యక్రమం ఏర్పాటు చేశాడు. మార్గరెట్ తోటి డాక్టర్లు, హాస్పిటల్ స్టాఫ్ ఇంటికి వచ్చి ప్రేయర్లో పాల్గొన్నారు. సుబ్బారావు కేటరింగ్ వాళ్లని ఏర్పాటుచేశాడు. ఇంటికొచ్చినవారిని అందరినీ భోజనాలకి రావాలనీ హడావిడి పెడుతున్న సుబ్బారావు సెల్ ఫోన్ మోగింది.

"హలో!" అన్నాడు సుబ్బారావు.

"మిస్టర్ సుబ్బారావ్!"

"యస్. స్పీకింగ్"

"కేర్ ఫుల్ గా వినండి"

"ఎవరు మాట్లాడేది? "

"ముందు వినండి. నా పేరు మీకు అనవసరం. మీ అమ్మాయి స్వాతి కిడ్నాప్ అయింది. రెండు కోట్లు.. టూ క్రోర్స్ రెడీ చేసి పెట్టండి. ఎక్కడ ఇవ్వాలో తర్వాత చెప్తాను"

లైన్ కట్ అయిపోయింది.

సుబ్బారావు "హలో..!" అంటూనే ఉన్నాడు.

అతనికి మతిపోయినట్లయింది. షాక్ తిన్నవాడిలా అక్కడొక కుర్చీలో కూలబడిపోయాడు. వళ్ళంతా చెమటలు పట్టింది. గుండె దడదడలాడుతోంది. ఏమిటి తను విన్నది? స్వాతిని కిడ్నాప్ చేశారా? ఎవరు? స్వాతిని కిడ్నాప్ చేయడం ఏమిటి? చిన్న పిల్లల్ని కిడ్నాప్ చేస్తారు. వాళ్లు అమాయకంగా చాక్లెట్ ఇస్తేచాలు, కిడ్నాప్ వలలో పడతారు. స్వాతి పసిపిల్ల కాదే. ఇంటర్ చదువుతున్న పిల్ల. కిడ్నాపర్ల ట్రాప్‌లో ఎలా పడింది?

"సుబ్బారావ్? ఏమిటలావున్నావ్? ముఖమంతా చెమటలు పట్టిందేమిటి? " అంటూ వచ్చి అతని పక్కనే కూర్చుంది మార్గరెట్.

"మార్గరెట్.. ఒక ప్రాబ్లమ్ వచ్చింది"

"వాట్? "

"స్వాతిని ఎవరో కిడ్నాప్ చేశారు" సుబ్బారావు కంఠం వణికింది. అతని ముఖంలో భయం కనిపిస్తోంది.

# కొన్ని క్రిస్మస్ నిజాలు

చతుర ప్రపంచం

★ క్రిస్మస్ పుడ్డింగ్‌ను వండేటప్పుడు దాన్ని తూర్పు నుంచి పడమరవైపుకు కలియ బెట్టాలనే నిబంధన ఉంది.

★ యాభైఆరు శాతం మంది క్రైస్తవులు తమ పెంపుడు జంతువులకు క్రిస్టియన్ కరోల్స్‌ను పాడి వినిపిస్తారు.

★ ప్రతి ముగ్గురిలో ఇద్దరు డిసెంబరు 24 సాయంత్రం క్రిస్మస్ షాపింగ్ చేస్తారట.

★ యాభైమూడు శాతం మంది తమకు క్రితంసారి వచ్చిన, వాడని బహుమతులనే తిరిగి క్రిస్మస్ కానుకలుగా వేరేవారికి ఇస్తారట.

★ జీసస్ జన్మించిన బెత్లెహామ్‌లో 2001 క్రిస్మస్ రోజున 'హోటల్ బెత్లెహామ్'లోని 210 గదుల్లో 208 గదులు ఖాళీగానే ఉన్నాయట.




దీనికి కారణం అమెరికాలోని ట్విన్‌టవర్స్‌పైన ఉగ్రవాదుల దాడి జరగడంతో భయపడి ఎవరూ ఇజ్రాయిల్ వెళ్లలేదట.

★ ప్రతి ఏటా యూరప్‌లో దాదాపు 176 కోట్ల క్రిస్మస్ కొవ్వొత్తులు అమ్ముడవుతాయి.

★ క్రిస్మస్ సందర్భంగా మగాళ్లకు ఎక్కువగా వచ్చే బహుమతులు 'టై'లేనట.

★ సాంటాక్లాజ్‌కు ఆధారమైన సెయింట్ నికొలస్ పిల్లలకేకాక వడ్డీ వ్యాపారులకు, దొంగలకు కూడా ఆరాధ్యమేనట.

★ క్రిస్మస్‌రోజు ఎక్కువశాతం క్రైస్తవులు తమ తల్లిదండ్రుల వద్దకు వెళ్తుంటారు.

---

"వాట్? మీ స్వాతిని కిడ్నాప్ చేశారా? హౌ ఈజ్ ఇట్ పాజిబుల్? పెద్దపిల్ల గదా? ఎట్లా కిడ్నాప్ జరిగింది? "

"ఏమో తెలీదు. రెండు కోట్లు డిమాండ్ చేశాడు. మళ్ళీ కాల్ చేస్తానన్నాడు"

"పోలీస్ కంప్లైంట్ ఇవ్వు"

"వాళ్లు స్వాతిని ఏదైనా చేస్తే? "

"ఏం చేసినా పోలీసులకు తెలియజెయ్యకుండా మనం ప్రొసీడ్ అవగూడదు. ఇప్పుడు రెండు కోట్లు అడుగుతారు. తర్వాత నాలుగైదు అడుగుతారు. దేరీజ్ నో ఎండ్. అంత తొందరగా స్వాతిని ఏమైనా చేస్తారని అనుకోను" చెప్పింది మార్గరెట్.

సుబ్బారావు, కిరణ్‌రావుకి ఫోన్ చేశాడు. అతను అంతా విని "నువ్వు ఎక్కడున్నావో అక్కడే ఉండు. నాతో పాటు పోలీసుల దగ్గరకు వస్తే కిడ్నాపర్స్‌కి తెలియవచ్చు. వాళ్ళు ఎంతమందో తెలియదు. నిన్ను ఎవరైనా గమనించవచ్చు" అన్నాడు.

"నిజమే, మరిప్పుడు ఏం చేద్దాం? "

"నేను పోలీసుల దగ్గరికి వెళ్తాను. నువ్వు ఎప్పటికప్పుడు, వాళ్లెక్కడ్నుంచి కాల్ చేస్తున్నారో నెంబర్లు నోట్ చేసుకుని నాకు చెబుతూ ఉండు" అన్నాడు కిరణ్.

గంట తర్వాత కిడ్నాపర్ల నుంచి కాల్ వచ్చింది.

"సుబ్బారావ్! క్యాష్ రెడీ చేశావా? "

"రెడీగా ఉంది. ఎక్కడ ఇవ్వాలి? " అడిగాడు సుబ్బారావు.

"పోలీసులకు కంప్లైంట్ చెయ్యడం వంటి పిచ్చి పనులు చెయ్యకు. నువ్వేం చేస్తున్నా మాకు తెలిసిపోతూ వుంటుంది"

"నో.. నో..! నేను పోలీసుల దగ్గరకు వెళ్ళడం లేదు"

"గుడ్! క్యాష్ సూట్‌కేసులో సర్ది రెడీగా

వుంచు. ఎక్కడ హేండోవర్ చెయ్యాలో తర్వాత చెబుతాను. నీ కారుని ఎవరైనా ఫాలో అయితే మాకు తెలుస్తుంది. మీ స్వాతి ఖతమ్ అయిపోతుంది. తర్వాత ఏడిస్తే లాభం వుండదు"

"నేనెవరికీ చెప్పలేదు. నన్నెవరూ ఫాలో కారు"

"సరే చూస్తాం"

లైన్ కట్ అయింది. సుబ్బారావు ఆ నెంబర్ ల్యాండ్ లైన్‌లో నుంచి కిరణ్ సెల్ కి కాల్ చేసి చెప్పాడు. కొంచెం సేపైన తర్వాత కిరణ్ కాల్ చేశాడు.

"సుబ్బూ! వాళ్ళు ఒక కాయిన్ బాక్స్ నుంచి కాల్ చేశారు. అది మాదాపూర్ ఏరియా టవర్ నుంచి వచ్చింది. అంటే కిడ్నాపర్ మాదాపూర్ ఏరియాలో ఎక్కడో వున్నాడు. ఇప్పుడు కాల్ నెంబర్ చూసి ఏ టవర్ నుంచి వస్తుందో కనిపెట్టే టెక్నాలజీ వుంది. భయం లేదు. పోలీస్ పార్టీ మాదాపూర్ ఏరియాలో ఇన్వెస్టిగేషన్ చేయడానికి బయల్దేరింది. అనుమానాస్పదంగా కాయిన్ బాక్సుల దగ్గర, పబ్లిక్ బూతుల దగ్గర తచ్చాడుతున్నవాళ్ళు దొరికితే పట్టుకుంటారు. ఇదొక పార్ట్ ఇన్వెస్టిగేషన్‌లో. నువ్వు భయపడకు. ధైర్యంగా వుండు"

"లేదు. నేనేం భయపడ్డం లేదు" అన్నాడు సుబ్బారావు.

తర్వాత లంగర్‌హౌస్, మెహిదీపట్నం, అత్తాపూర్ ఏరియాల నుంచి కిడ్నాపర్లు కాల్ చేశారు. తరచుగా కాల్ చేసే ఏరియాలు మారుస్తున్న కిడ్నాపర్లు కారులో తిరుగుతూ వున్నారని పోలీసులు గ్రహించారు. స్వాతిని ఏదో ఒకచోట నిర్బంధించి, తాము కారులో తిరుగుతూ, ఏరియాలు మారుతూ ఫోన్లు చేస్తున్నారు. అంటే వాళ్ళకి గూడా లేటెస్ట్ టెక్నాలజీ గురించి అవగాహన వుందన్న మాట.

రాత్రి పదయినా గూడా స్వాతి ఇంటికి రాకపోవడం గమనించి హేమలత ఎన్ని సార్లు కాల్ చేసినా స్వాతి సెల్ నుంచి రెస్పాన్స్ లేదు. స్విచ్చాఫ్ చేసినట్లు సమాధానం వస్తోంది. ఇప్పటి వరకు రాకుండా వుండడం అంటే ఏదో ఒక సినిమాకి వెళ్ళి వుంటుందనుకోవచ్చు. పది దాటిపోయింది. స్వాతి రాలేదు. హేమలతకు ఆందోళన పెరిగింది. ఐతే ఈ మధ్య భర్తతో పూర్తిగా మాటలు లేవు.

ఇప్పుడు కాల్ చేసి కూతురు ఇంటికి రాలేదని చెబితే రెస్పాన్స్ ఎట్లా వుంటుందో తెలీదు. తిరిగి తననే నానా మాటలు అంటాడు. అందుకని పెద్దకొడుక్కి చెప్పింది.

మహేశ్వర్ తండ్రికి కాల్ చేశాడు.

"డాడీ! స్వాతి ఇంకా ఇంటికి రాలేదు"

"వస్తుందిలే" అని కాల్ కట్ చేశాడు సుబ్బారావు.

మహేశ్వర్‌కి ఆశ్చర్యం వేసింది. చెల్లెలు ఇంకా ఇంటికి రాలేదని చెబితే తండ్రి అంత లైట్‌గా ఎందుకు తీసుకున్నాడో అర్థం కాలేదు. స్వాతి ఎక్కడికి వెళ్ళిందో ఆయనకి తెలుసేమో? తండ్రికి చెప్పి వెళ్ళిందేమో? అనుకున్నాడు.

కొడుకు మౌనంగా వుండడం చూసి హేమలత అడిగింది.

"డాడీ ఏమన్నారు? "

"వస్తుందిలే అన్నాడు మమ్మీ" అన్నాడు మహేశ్వర్.

'స్వాతి ఇంటికి రాలేదన్న విషయం చెబితే భర్త ఎందుకు అంత తేలిగ్గా తీసుకున్నాడో! అంటే ఇంట్లోవాళ్ళ సంగతులు తను పట్టించుకోదల్చుకోలేదని అర్థమా?' అనుకుని ఆలోచనలో పడింది హేమలత.

ఇంటి బాధ్యత ఆయనకు పట్టనప్పుడు తనకు మాత్రం ఎందుకు? ఎవరెట్లా పోతే తనకేం? జరగవలసింది జరుగుతుంది.

విధిని ఎవరూ ఆపలేరు! అనే వేదాంత ధోరణిలో పడిపోయింది.

రొటీన్‌గా వేసుకునే టాబ్లెట్లతో పాటు, స్లీపింగ్ టాబ్లెట్ గూడా వేసుకుని పడుకుని నిద్రపోయింది హేమలత.

స్వాతి కిడ్నాపైన సంగతి ఇంట్లో తెలిస్తే, అంతా ఆందోళన పడతారని, హేమలత అసలే అనారోగ్యం మనిషని, అప్‌సెట్ అవుతుందనీ సుబ్బారావు ఆ సంగతి చెప్ప లేదు.

పదిన్నరకి కిడ్నాపర్ నుంచి కాల్ వచ్చింది.

"సుబ్బారావు! జూబ్లీహిల్స్ రోడ్ నెంబర్ సెవెంటీ దగ్గర సర్కిల్ వుంటుంది. ఆ ఏరియాలో నీ కారు ఆపి వుంచు. నువ్వు డ్రైవింగ్ సీట్లో వుండాలి. నీ పక్కనే సూట్ కేసు పెట్టి వుంచు. కారులో లైట్ ఆర్పి కూర్చో. ఏదో ఒక టైమ్‌లో మా మనిషి వచ్చి సూట్‌కేసు తీసుకుని, మీ స్వాతిని పంపించేస్తాడు. నీ కారు నెంబర్ చెప్పు. సరిగ్గా అరగంట తర్వాత నువ్వు అక్కడ వుండాలి"

సుబ్బారావు కారు నెంబర్ చెప్పాడు. అతను జరిగిన విషయం మార్గరెట్‌కి వివరించి బయల్దేరుతుంటే, తను గూడా అతనితో వస్తానని అన్నది. ఇప్పుడు వద్దులే అని ఒంటరిగా బయల్దేరాడు. సూట్ కేసులో పాత న్యూస్ పేపర్లు సర్ది లాక్ చేశాడు. ల్యాండ్‌లైన్ నుంచి కిరణ్‌కి ఫోన్ చేసి చెప్పాడు.

అరగంట తర్వాత జూబ్లీహిల్స్ రోడ్ నెంబర్ 70లో ఒక పక్కగా కారు ఆపుకుని కూర్చున్నాడు సుబ్బారావు. ఆ ఏరియా అతనికి సుపరిచితమే. కిడ్నాపర్ ఆ ప్రాంతాన్ని ఎందుకు సెలెక్ట్ చేసుకున్నాడో, అర్థమైంది. రోడ్డు నెంబర్ డెబ్బైలో నుంచి పారిపోయి లంగర్‌హౌస్ మీదుగా రింగు రోడ్డులోకి వెళ్ళి మాయమైపోవచ్చు. లేదా నేరుగా వెళ్ళిపోయి ముంబై నేషనల్ హైవే

## భళే భళే!

**అ**మెరికన్ నవలా రచయిత్రి బార్బరా కింగ్‌సాల్వర్‌కు నిద్ర లేస్తూనే మెదడు నిండా రచనకు సంబంధించిన అంశాలు మెదులుతాయట! అయితే ఒక పేజీ నవల పూర్తిస్థాయిలో రూపుదిద్దుకోవాలంటే దానికి ముందు వంద పేజీల వరకు రాయాల్సి వస్తుందని చెబుతుందామె!

గుండా పారిపోవచ్చు. సుబ్బారావు కారులో కూర్చుని ఆలోచిస్తూ వుండగా, డెబ్బై నెంబరు రోడ్డులో నుంచి ఒక కారు నెమ్మదిగా వస్తూ కనిపించింది. సుబ్బారావు అలర్టయ్యాడు. ఆ కారు ఇతని కారు పక్కనే ఆగింది. అందులో నుంచి ఒక యువకుడు దిగి సుబ్బారావు కారు దగ్గరికి వచ్చాడు. ఫ్రంట్ డోర్ గ్లాస్ మీద టకటకమని చప్పుడు చేశాడు. సుబ్బారావు డోర్ తీసి సూట్‌కేస్ అందించాడు.

అంతే అతని చుట్టూ పోలీసులు మూగారు. ఆ యువకుడు బిత్తరపోయి నిలబడిపోయాడు. ప్రతిఘటించడానికి గాని, పారిపోవడానికి గాని ప్రయత్నించ లేదు. పోలీసులు పెడరెక్కలు విరిచి పట్టుకుని వ్యాన్ ఎక్కించారు. అతను వచ్చిన కారులో డ్రైవరు మాత్రం వున్నాడు. అతన్ని గూడా అదుపులోకి తీసుకున్నారు.

★ ★ ★

అది రెండంతస్తుల ఇండిపెండెంట్ హౌస్. రవీంద్ర గేటు తీసుకుని లోపలకు వెళ్ళాడు. తలుపు మీద మూడుసార్లు చప్పుడు చేశాడు. తలుపు తెరుచుకుంది. లోపల స్వాతి వుంది. ఆమెకు ఎదురుగా రవీంద్ర కనిపించాడు.

"రవీ! సూట్‌కేసు ఏది?" అడిగింది స్వాతి.

రవీంద్ర బిత్తరచూపులు చూస్తూ, గుటకలు మింగుతున్నాడు. నోట మాటలు రావడం లేదు.

"మా డాడీ డబ్బివ్వలేదా? " అని అడుగుతోంది స్వాతి.

ఇంతలో రవీంద్ర పక్కనే సుబ్బారావు ప్రత్యక్షమయ్యాడు. వరసగా కిరణ్‌రావు, పోలీస్ ఇన్‌స్పెక్టర్, కానిస్టేబుల్స్‌ని చూసేసరికి స్వాతి ముఖం వెలవెలబోయింది. భయంతో కళ్ళు పెద్దవయ్యాయి. నిలువెల్లా వణికిపోతోంది.

సుబ్బారావు ముందుకు వచ్చి స్వాతి చెంప పగలగొట్టాడు. స్వాతి వెక్కి వెక్కి ఏడవసాగింది.

"సుబ్బా! ఊరుకో...!" అని కిరణ్‌రావు స్వాతి చెయ్యి పట్టుకుని వెంట తీసుకుపోయాడు.

★ ★ ★

"సార్! నా పేరు రవీంద్ర. మా నాన్న త్యాగరాజు, సినిమా ప్రొడ్యూసర్. ఐతే ఇప్పుడు సినిమాలేం తియ్యడం లేదు. గతంలో తీసిన రెండు సినిమాలు దెబ్బతిని నష్టం వచ్చింది. నేను డ్యాన్స్, యాక్షన్ నేర్చుకుంటున్నాను. అదే స్కూల్లో స్వాతి గూడా డ్యాన్స్ నేర్చుకుంటోంది. మేమిద్దరం ప్రేమించుకుంటున్నాం. స్వాతి ఫాదర్ పెద్ద కోటీశ్వరుడు. రెండు కోట్లు పెట్టుబడి పెడితే నేను హీరోగా, స్వాతి హీరోయిన్‌గా సినిమా ప్లాన్ చెయ్యొచ్చని ఐడియా వచ్చింది. అయితే ఆయనకు ఇటువంటివి ఇష్టం వుండవని ఈ కిడ్నాప్ ఐడియా స్వాతి చెప్పింది. ఆమె ఏదో ఇంగ్లీష్ సినిమాలో ఇటువంటి ఐడియా చూసిందట. కొంచెం రిస్క్ అయినా వర్కవుట్ అవుతుందనిపించి ప్లాన్ చేశాం" చెప్పాడు రవీంద్ర.

పోలీస్ కమిషనర్ ఆఫీసులో టీవీ ఛానల్స్, ప్రెస్ రిపోర్టర్స్ ముందు స్టేట్‌మెంట్ ఇచ్చాడు రవీంద్ర.

"సినిమా వేషాల వ్యామోహంతో మనుషులు రకరకాల నేరాలకు పాల్పడుతున్నారు. ఏ విధంగానైనా సినిమా తియ్యాలి. అందులో వేషం వేయాలి. అదొక పిచ్చిలా తయారైంది. ఒకడు సినిమా తియ్యడానికి దొంగనోట్లు అచ్చుగొడతాడు. మరొకడు తాళాలు వేసిన ఇళ్ళను టార్గెట్ చేసి పగలగొట్టి దోపిడీలు చేస్తాడు. మరొకడు ఏటీయమ్ మెషీన్ విప్పదీసి డబ్బు దొంగిలించాలని చూస్తాడు. ఇవన్నీ ఇప్పటివరకు మనం చూశాం. ఈ కేసు మరీ విచిత్రంగా వుంది. స్వాతి ప్రియుడితో కలిసి తనను కిడ్నాప్ చేశారని నాటకం ఆడించింది. ఆమె తండ్రి సమయస్ఫూర్తితో వ్యవహరించి, పోలీసుల సాయంతో ఆటకట్టించాడు కాబట్టి సరిపోయింది. ఆయనే గనుక కూతుర్ని ఏమైనా చేస్తారని భయపడి డబ్బుయిచ్చివుంటే, ఏం జరిగేది? " అన్నాడు పోలీస్ కమిషనర్.

"మరొక తెలుగు కళాఖండం తయారయ్యేది. రవీంద్ర హీరో, స్వాతి హీరోయిన్ అయ్యేవారు" అన్నాడు ఒక జర్నలిస్ట్.

అంతా పకపక నవ్వారు.

స్వాతి కిడ్నాప్ నాటకం టీవీలలో టెలికాస్ట్ అయింది. న్యూస్ పేపర్లలో స్వాతి, రవీంద్రల ఫొటోలతో సహా అచ్చయి సంచలనం సృష్టించింది.

ఒక టీవీ ఛానల్ 'సినిమా వ్యామోహంలో అమ్మాయిలు - తల్లిదండ్రుల బాధ్యత' అని మేధావులు, సినిమా పెద్దలను స్టుడియోలో కూర్చోబెట్టి చర్చాకార్యక్రమం నిర్వహించింది.

★ ★ ★

"కిరణ్! నేను హైదరాబాద్ వచ్చి తప్పు చేశాననిపిస్తుందోయ్!" అన్నాడు సుబ్బారావు.




కిరణ్‌రావు ఉదయమే సుబ్బారావు ఇంటికి వచ్చి కూర్చున్నాడు. తన పథకం బెడిసికొట్టడంతో స్వాతి ఏదైనా అఘాయిత్యం చేస్తుందేమో, కూతురి మీది కోపంతో సుబ్బారావు ఏమైనా చేస్తాడేమో నని అనుమానించి, అతన్ని ఒంటరిగా వుండనీయగూడదనుకున్నాడు.

"ఏం? ఎందుకలా అనుకుంటున్నావ్?"

"ఉద్యోగం చేస్తున్నప్పుడే హాయిగా వున్నాననిపిస్తోంది. వ్యాపారంలో కోట్లు గడించి ఏం సాధించాను? డబ్బును కూరలో వుప్పులాగా ఎంత అవసరమో అంతే వాడుకుంటే మంచిదన్నారు పెద్దలు. ఇప్పుడు అదంతా మర్చిపోయాం. డబ్బు ఎక్కువైపోయింది. ఉప్పు ఎక్కువైతే పదార్థాలు ఎలా సహించవో, ఇప్పుడు డబ్బు ఎక్కువై కుటుంబ సంబంధాలు గూడా చేదెక్కిపోయాయి. ఇంట్లో ఎవరేం చేస్తున్నారో అర్థం కావడం లేదు. పెద్దోడి చదువు పూర్తి కాలేదు. చిన్నోడు పోయి హాస్టల్లో చేరాడు. ఇంట్లో చదువు సాగడం లేదట. ఇక ఈ పిల్లకు చదువు మీద శ్రద్ధ లేదు. సినిమా స్టార్ కావాలనుకుంటుంది. ఆ తల్లిని ఏమీ అనేట్లు లేదు. అసలు తల్లి పిల్లల్ని పట్టించుకుంటే ఇంతదాకా వచ్చేదా?" అని వాపోయాడు సుబ్బారావు.

"ఎక్కడి లొసుగులు అక్కడ వుంటాయ్ సుబ్బా! ఏమో ఎవరికి తెలుసు? నువ్వు ఏ చీఫ్ ఇంజనీరో అయి కోట్లు కూడబెట్టే వాడివేమో? అసలు సి.ఇ. దాకా ఎందుకు? ఇ.ఇ.లే కోట్లు సంపాదిస్తున్నారిప్పుడు. ఎంతమంది బ్లాక్ మనీ సంపాదించి దొరికిపోవడం లేదూ? అప్పుడు మాత్రం కుటుంబం సవ్యంగా వుండేదని ఎలా అనుకుంటాం? నెపం అంతా ఆమె మీద ఎందుకు వేస్తావ్?" అన్నాడు కిరణ్‌రావు.

"ఔన్లే! తప్పంతా నాదే! అసలు డబ్బు సంపాదించడమే నా తప్పు" అన్నాడు సుబ్బారావు.

## ఎందుకు పనికొస్తావు?

ఉపాధ్యాయ వృత్తిలో ఉన్న మునిమాణిక్యంవారు ఒకసారి హెడ్‌మాస్టర్ ఉద్యోగానికి ఇంటర్వ్యూకు వెళ్లారు. అక్కడి సెలెక్షన్ కమిటీ అధ్యక్షుడు మునిమాణిక్యం పేరును వినగానే ముఖం చిట్లిస్తూ, 'అయితే ఆ కథలూగ్రా రాసేది మీరేనా?' అన్నాడు.



'ఔను, నేనే. ఎందుకు?' అని మునిమాణిక్యం అన్నారు.

'కథలు రాసే నువ్వు పిల్లలకు మేస్టారుగా ఏం పనికొస్తావయ్యా?' అన్నాడు విసుగ్గా.

'చిత్తం! మేస్టారుగా పనికిరానని నాకూ తెలుసండీ. కానీ హెడ్‌మేస్టారుగా పనికొస్తానేమోననే ఇక్కడికి వచ్చాను' అన్నారు మునిమాణిక్యం ఏమాత్రం తడుముకోకుండా.

"నీ ధోరణి నీదేనోయ్? డబ్బు సంపాదించడం తప్పంటావేంటి? డబ్బు లేకుండా పూటగడుస్తుందా? ప్రతిదానికీ డబ్బు కావాలి. ఐతే సవ్యంగా వుపయోగించుకునే నేర్పు కావాలి అంతే"

"నిజమేనోయ్! మనం గొప్పకోసం సంపద ప్రదర్శన చేస్తున్నాం. మేడలు కడుతున్నాం. అవసరం వున్నా లేకపోయినా బంగారు నగలు, డైమండ్‌నెక్లెస్‌లు కొంటున్నాం. ఇదివరకు ఏదైనా ఇంట్లో పెళ్ళివుంటే బంగారం కొనడం చేసేవాళ్ళు. ఇప్పుడు ఫ్యాషన్ మారిందని తెలిస్తే

చాలు వేలం వెర్రిగా బంగారం దుకాణాల మీద ఎగబడి కొంటున్నాం. మనిషికొక కారు.. ఇంట్లో ఎవరూ ఏ పనీచేయరు, అన్నింటికీ పనిమనుషులు, లేకపోతే యంత్రాలు. ఒళ్ళు వంచకపోవడంతో నలభై ఏళ్ళు దాటక ముందే షుగర్, బీపీ అని జబ్బులు. హాస్పిటల్స్‌ను బాగు చెయ్యడం కోసం వాటిచుట్టూ తిరగడం. తిరుపతికెళ్ళినంత ఈజీగా పిల్లలు ఫారిన్ టూర్లు వెళ్లొస్తున్నారు. పెద్దోడు దుబాయ్‌లో నాలుగు లక్షలు పెట్టి వాచీ కొన్నాడంటే అర్థం చేసుకో" ఆవేదనతో అన్నాడు సుబ్బారావు.

కిరణ్‌రావు నవ్వాడు.

"కొనేవాళ్ళుండబట్టే తయారు చేస్తారు. అది బిజినెస్ కల్చర్. కారు లక్ష రూపాయలకు వస్తుంది. పది కోట్లకూ వస్తుంది. కొనేవాడుండబట్టే గదా పదికోట్ల కారు తయారవుతోంది. ముందు ముందు ఓ మోస్తరు సంపన్నులకు ఇంటికొక విమానం వచ్చినా ఆశ్చర్యం లేదు. జరిగే దాన్ని ఎవరు ఆపగలరు? "

"అదంతా పోనియ్యవోయ్! నాకీ ఇల్లంటే విరక్తి పుడుతోంది. ఏమి ఇల్లాలు? ఏం పిల్లలు? పరువు తీస్తున్నారు. మగ పిల్లలే అదుపు తప్పుతున్నారనుకుంటే, నేనేం తక్కువని ఆడపిల్ల గూడా తయారైంది" అన్నాడు సుబ్బారావు.

"ఏం చేస్తాం? ఇప్పుడు ఇళ్ళల్లో పెద్దవాళ్ళు లేరు, పిల్లలకు మంచిబుద్ధులు నేర్పడానికి. తాతనో, అమ్మమ్మనో, నాయనమ్మనో ఎవరైనా వుంటే అన్నీ గమనించి అదుపులో వుంచేవారు కుటుంబాలలో. ఇప్పుడేమో వాళ్ళున్నా వూళ్ళలో వుండిపోతున్నారు. ఇక్కడ పిల్లలు ఇండిపెండెంట్‌గా పెరుగుతున్నారు. ఒకర్ని చూసి మరొకరు అనుసరిస్తున్నారు. ఎవర్ని తప్పుబట్టగలం? "

"ఇప్పుడు స్వాతి సంగతి ఏం చేయాలో తోచడం లేదు. ఏం ఐడియాలు దాని బుర్రలో! క్రిమినల్ బ్రెయిన్‌లా వుంది. ఏదో ఒకరకంగా డబ్బు గుంజడానికి కిడ్నాప్ నాటకం ఆడించింది. ముందు ముందు ఇది మర్డర్లు గూడా చేయిస్తుందేమో? "

"అంతమాట ఎందుకులేవోయ్! ఏదో చిన్నతనం"

"వయసు చిన్నదే. బుద్ధి పెద్దది. ఏం చేయాలి దాన్ని? "

"ఆ కుర్రాడ్ని లవ్ చేశానంటోందిగా? వాళ్ళనాన్నతో మాట్లాడి పెళ్ళి చేస్తే సరి"

"వాడితో దీని సంసారం సవ్యంగా సాగుతుందంటావా? వాడికీ చదువున్నట్లు లేదు. నాటకాల రాయుడే. సినిమా హీరోగా స్థాండవ్వాలంటే మాటలా? "

"ఏమో! వాళ్ళ ఫాదర్ ప్రొడ్యూసర్ అంటున్నాడుగా! మాట్లాడదాం. ఇంత దూరం వచ్చాక తప్పేముంది? " అన్నాడు కిరణ్‌రావు.

"సరే! మాట్లాడు"

"చెల్లెమ్మతో గూడా మాట్లాడు. ఏమంటుందో? "

"నేను దానితో మాట్లాడేదేం లేదోయ్! అది పిల్లల్ని సరిగా పెంచివుంటే ఇదంతా జరిగేదా? మగ పిల్లలు సరే! ఆడపిల్లనైనా జాగ్రత్తగా చూడాలా? అదీ లేదు. ఎంతసేపూ స్వామీజీలు, బాబాలు అని టూర్లు తిరగడం, డబ్బు తగలేయడం"

"సరే! జరిగినదాన్ని పోనివ్వు. తల్లికి చెప్పకుండా పిల్ల పెళ్ళి చేస్తావా ఏంటోయ్! బాగుండదు" అన్నాడు కిరణ్‌రావు.

"నేనేం మాట్లాడను? ఏది మాట్లాడబోయినా, నెపం నా మీదకు నెడుతుంది. నువ్వు ఇల్లు పట్టించుకోవడం లేదని దబాయిస్తుంది. దాన్ని కదిపి నేను బీపీ తెచ్చుకోను" అన్నాడు సుబ్బారావు.

"నువ్వు మరీ మొండిగా వుంటున్నావ్!

దేన్నికైనా పట్టువిడుపులుండాలి. లేకపోతే సంసారం ఎట్లా సాగుతుంది? సరే! నేనే తనతో మాట్లాడతా!" అన్నాడు కిరణ్‌రావు.

హేమలత తనకేం అభ్యంతరం లేదంది, పిల్ల పెళ్ళిచేస్తే. కిరణ్‌రావు ఏదో ఒకటి సెటిల్ చేద్దామని, సుబ్బారావుని బలవంతంగా వెంటబెట్టుకుని త్యాగరాజు ఇంటికి వెళ్ళాడు.

త్యాగరాజు కమలానగర్‌లోని ఒక అపార్ట్‌మెంట్‌లో ఫ్లాట్ తీసుకుని వుంటున్నాడు. రవీంద్ర వీళ్ళిద్దరినీ తండ్రికి పరిచయం చేశాడు. అతను మంచివాడే. ఇద్దర్నీ గౌరవించాడు.

"సార్! వీడు చిన్నప్పటి నుంచి సినిమా వాతావరణంలో పెరిగాడు. కాబట్టి హీరో అయిపోవాలని కలలు గంటున్నాడు. నాకైతే ఇష్టంలేదు. వీడే యాక్షన్ అనీ, డ్యాన్స్‌లనీ ప్రిపేరవుతున్నాడు. మా వాడని కాదుగాని, ఒడ్డూపొడుగు బాగానే వున్నాడు. ఒకప్పుడైతే ఏమోగాని ఇప్పుడు హీరోవేషం ఇచ్చేవాళ్ళెవరూ లేరు. హీరోలు, డైరెక్టర్లు, ప్రొడ్యూసర్లు తమ తమ వారసుల్ని హీరోలు చేస్తున్నారు. తమ పిల్లలకు అందచందాలు, ప్రతిభ లేకపోయినా వారిని పెట్టి వరుసగా సినిమాలు తీసి జనంమీదకు వదులుతున్నారు. తర్వాత అదే అలవాటైపోతున్నది. అది వారికే సాధ్యపడుతుంది. నేను గూడా ప్రొడ్యూసర్నే. కాని ఏం లాభం? సినిమా బిజినెస్ సక్సెస్‌వెంట పరుగెత్తుతుంది. నేను మంచి అభిరుచితో ఓ మోస్తరు సినిమాలు తీసి సంపాదించింది గూడా పోగొట్టుకున్నాను. కాబట్టి నేను వీడిని హీరోగా పెట్టి సినిమా తీసే పరిస్థితి లేదు" త్యాగరాజు సినిమా ఫీల్డు గురించి, తన గురించి వివరంగా చెప్పాడు.

అతను చెప్పిందంతా యథార్థమే అని అర్థమైంది.

"మరి మీ వాడి భవిష్యత్తు ఎలా వుండాలనుకుంటున్నారు?" అడిగాడు సుబ్బారావు.

"నేను వాడి భవిష్యత్తు బాగుండాలని ఇంజనీరింగ్ కాలేజీలో చేర్పించాను. ఇప్పుడు మూడో సంవత్సరం. కాని వాడు సినిమా హీరో కావాలనుకుంటున్నాడు" అన్నాడు త్యాగరాజు.

"ఔనంకుల్! నాకు హీరో కావాలని

## ఇవేం పెద్ద కోరికలో!?

తను సృష్టించిన భార్య 'కాంతం' పాత్రతో మునిమాణిక్యం అనేక హాస్యస్ఫోరక సంభాషణలు జరిపారు. అలాంటి ఒక సందర్భంలో ఆయన కాంతంతో 'ఎవ్వరికీ అర్థంకాని కవిత్వం రాసేవారికి గజారోహణాదులు చేస్తారు. అందరికీ తెలిసేలా రాసే



నాలాంటి వచన రచయితకి గజం గుడ్డ కూడా ఇవ్వరు' అని వాపోయాడు.

'పోనీలెండి.. కవిగారి సన్మానాన్ని మీరు మొండిగోడెక్కి చూశారు కదా! ఇప్పటికి మొండి గోడెక్కినా, మున్ముందు క్రమంగా తక్కినవి కూడా ఎక్కుతారులెండి' అంటూ కాంతం ఓదార్చింది.

'నాకేం అంత పెద్దపెద్ద కోరికలు లేవు. భోజనం చేయటానికి ఒక పెద్ద వెండి కంచం, మధ్యలో బంగారం పువ్వుండాలి. కాస్త అటు ఇటు తిరగటానికి కారుంటే చాలు.. నాది అని చెప్పుకునేందుకు, ప్రయోజకుడినని నిరూపించుకునేందుకు కొంచెం పొలంపుట్రా ఉంటే సరిపోతుంది. ఇక వీటితోపాటు సొంతానికి ఓ కొంప, ఒకింత బ్యాంకు బాలెన్స్ కావాలంతే' అన్నాడాయన సింపుల్‌గా.

ఇం[టెస్ట్" అన్నాడు అక్కడే వుండి అంతా వింటున్న రవీం[ద.

"బాగానే వుంది. కాని ఎలా? నిన్ను హీరోగా ఎవరు చేస్తారు? నిన్ను పెట్టి సినిమా ఎవరు తీస్తారు? " ప్రశ్నించాడు సుబ్బారావు.

"మీరే అంకుల్!" అన్నాడు రవీం[ద.

సుబ్బారావు అదిరి పడ్డాడు.

"నేనా? " అన్నాడు.

"ఔను అంకుల్! మీరు కన్‌స్ట్రక్షన్ కంపెనీ నడుపుతున్నారు. ఇదీ అంతే. సినిమా కంపెనీ ఒకటి స్టార్ట్ చెయ్యండి. ఇది గూడా బిజినెస్సే గదా!" తేలిగ్గా అన్నాడు రవీం[ద.

అతని ధోరణి చిరాకు కలిగించింది సుబ్బారావుకి. తం[డి అంతా నిజమే చెప్పాడు. సాధకబాధకాలు వివరించాడు. అది అందరికీ కుదిరే వ్యాపారం కాదని నిర్మొహమాటంగా అన్నాడు. వీడికి అర్థం కావడం లేదు. ఒకటే ధోరణిలో వున్నాడు.

"మేం కన్‌స్ట్రక్షన్ కంపెనీ పెట్టామంటే, అందులో మాకు పట్టుంది. మేం ఇంజనీర్లం. మాకు అన్నీ తెలుసు. అందుకే సక్సెస్ అయ్యాం. సినిమా బిజినెస్‌లో మాకు ఎ.బి.సి.డిలు తెలియవు. మేమేం చెయ్యగలం? " కూల్‌గా అన్నాడు సుబ్బారావు.

"మా డాడీకి అనుభవం వుంది కదా అంకుల్! మీ దగ్గర డబ్బుంది. హేపీగా బిజినెస్ చేయవచ్చు? " అన్నాడు రవీం[ద.

"చూడు బాబూ! నాకు తెలిసిన బిజినెస్సే నేను చేస్తాను. తెలియని దాంట్లోకి దిగను. ఎవర్నో నమ్ముకుని నేను డబ్బు ఇన్వెస్టు చెయ్యను" గట్టిగా అన్నాడు సుబ్బారావు.

"సరే! మీ వుద్దేశ్యం ఏమిటో చెప్పండి" అన్నాడు త్యాగరాజు.

"నేను మధ్యలో మాట్లాడుతున్నానని అనుకోకండి. సుబ్బారావుతో నాది పాతికేళ్ళ అనుబంధం. అతని వుద్దేశ్యం నాకు అర్థమైంది" అన్నాడు కిరణ్‌రావు.

"సరే! మీరు చెప్పండి" అన్నాడు త్యాగరాజు.

"ఇప్పుడున్న పరిస్థితుల్లో మీ వాడి కోరిక తీరే అవకాశం లేదు. మీ వాడిని పెట్టి సినిమా తీస్తాం అనుకోండి. కొన్ని కోట్లు కావాలి. కాని ఆ సినిమా హిట్ అవుతుందా? పెట్టిన డబ్బు తిరిగి వస్తుందా? మీ వాడు హీరోగా సెటిల్ అవుతాడా? అంటే చెప్పలేం. గ్యారెంటీ లేదు. అదంతా లాటరీ"

"నిజమేనండీ! ఏం చేద్దామో చెప్పండి" అన్నాడు త్యాగరాజు.

"మీ వాడ్ని ఇంజనీరింగ్ పూర్తి చేయమనండి. అంతే చాలు. మా కంపెనీలో చేరిపోవచ్చు. అప్పుడు పెళ్ళి గురించి ఆలోచిద్దాం" అన్నాడు కిరణ్‌రావు.

రవీం[ద అసంతృప్తిగా చూశాడు. త్యాగరాజు కొడుకువైపు చూశాడు. తమ మాటే ఫైనల్ అని సుబ్బారావు, కిరణ్‌రావు త్యాగరాజు దగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

★ ★ ★

రెండురోజులు హేమలత ఇంట్లో కనిపించలేదు. వంట్లో బాగోలేదేమో? లేకపోతే కూతురు చేసిన నిర్వాకానికి దిగులుపడి పడుకుందేమో అనుకున్నాడు. సుబ్బారావు వారంలో సగంరోజులు రా[తిళ్ళు ఇంటికి రావడంలేదు. ఒక్కోసారి పగలు గూడా రాడు. రెండు, మూడురోజులు అ[డస్ వుండదు. అడిగేవాళ్ళు లేరు. లోగడ ఒకపూట లంచ్‌కి రాకపోయినా, ఎక్కడైనా పార్టీవుండి డిన్నర్‌కి వెళ్ళినా హేమలతకు చెప్పేవాడు. ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయి. పిల్లలు చెడిపోవడానికి నువ్వు కారణం అంటే, నువ్వు

పట్టించుకోక పోవడం అని ఒకళ్ళనొకళ్ళు మాటామాటా అనుకోవడం మొదలుపెట్టారు. ఇద్దరూ కలిస్తే పోట్లాటేగాని మామూలు సంభాషణ లేదు. భార్యాభర్తల మధ్య వుండవలసిన సత్సంబంధం మృగ్యమైంది. ఇప్పుడు పిల్లలకు గూడా అన్ని సంగతులు తెలుస్తున్నాయి. తండ్రి ఇంటికి ఎందుకు రావడంలేదో వారికి అర్థమైంది. వారికి అదేమంత సీరియస్ సంగతికాదు.

"మీ అమ్మగారు ఇంకా లేవలేదా?" మార్నింగ్‌వాక్‌కి వెళ్ళివచ్చి సోఫాలో కూర్చుని కాఫీ తాగుతూ ఫ్లోరింగ్ క్లీన్ చేస్తున్న పనిమనిషిని అడిగాడు సుబ్బారావు.

"అమ్మగారు వూరెళ్ళారు గదండి" అన్నది పనిమనిషి సుబ్బారావుని వింతగా చూస్తూ.

"ఊరెళ్ళిందా?"

"ఔనండి. రుక్మిణి మేడమ్‌గారు, అమ్మగారు విశాఖపట్నం వెళ్ళారండి"

పనిమనిషి చెప్పింది వెంటనే జీర్ణంకాలేదు సుబ్బారావుకి. 'దీనికి బుద్ధిలేదు. ఆ మోసగాడు స్వామి ఆశ్రమానికి వెళ్ళి వుంటుంది' అనుకుని వుడికిపోయాడు.

అక్కడ హేమలత ద్వారకానందస్వామికి తన కష్టాలన్నీ మొరపెట్టుకుంటోంది. పిల్లల సంగతి అలా వుంచితే భర్త ఈ నడివయసులో ఇంకో ఆడదాని వలలో పడిపోవడం సహించలేకపోతున్నాననీ, కంపెనీలో తన పదవి వూడగొట్టించాడనీ, ముందు ముందు దాన్ని పెళ్ళి చేసుకుని ఆస్తిని కట్టబెట్టి అన్యాయం చేస్తాడేమోనని బెంగగా వుందనీ గోడు వెళ్ళబోసుకుంది.

గొప్పవారి గోత్రాలన్నీ స్వామికి ఎరుకే. కోట్లకు పడగలెత్తిన వారింట ఇప్పుడు ఎవరూ సుఖంగా లేరు. రకరకాల సమస్యలతో సతమతమవుతున్నారు.

దేశంలో ఎంతోమంది స్వాములు, బాబాలు మోసగాళ్ళని రుజువవుతున్నా ఎవరికీ డిమాండ్ తగ్గడం లేదు. తమ సమస్యలకు విరుగుడు ఈ ఆశ్రమాల్లోనే లభిస్తుందని నమ్ముతున్నారు. తమ క్రమశిక్షణా రాహిత్యాన్ని, చేసే పాపాల్ని, అక్రమాలను పక్కనపెట్టి ఆశ్రమాలలో వుపన్యాసాలు వింటూ, భజనలు చేస్తూ మన శ్శాంతి పొందుతున్నామని ఆత్మవంచన చేసుకుంటూ బతికేవాళ్ళే ఎక్కువయ్యారు.

హేమలత కుటుంబానికి పట్టిన గ్రహపీడ వదలాలంటే చండీయాగం చేయిస్తాననీ, దానితో మళ్ళీ కుటుంబంలో కలతలు తీరి, కష్టాలు గట్టెక్కుతాయనీ, ఇంట్లో సుఖశాంతులు వర్థిల్లుతాయనీ, శుభకార్యాలు జరుగుతాయనీ ద్వారకానందస్వామి సెలవిచ్చాడు. హేమలత పరమానంద భరితురాలై, స్వామివారిచ్చిన చండీయాగం వివరాలు, అందుకు పిలవవలసిన వేదపండితుల అడ్రసులు వగైరాలతో పాటు పది లక్షల ఖర్చు అంచనాతో ఇంటికి చేరింది.

"ఏమండీ మన పొరపాటో, గ్రహపాటో జరిగినవన్నీ మర్చిపోదాం. నేను ఇక నుంచి మిమ్మల్ని ఏమీ అనను. మీ విషయాలలో జోక్యం చేసుకోను" అంటూ మొదలుపెట్టింది హేమలత.

ఆమె అప్పుడే పూజామందిరంలో పూజలు ముగించి వచ్చినట్లుంది. తలంటు పోసుకున్న జుట్టు విరబోసుకుంది. అందులో సగంపైనే తెల్లవెంట్రుకలు వెండితీగల్లా మెరుస్తున్నాయి. ముఖానికి పసుపురాసుకుని, బ్రిటీష్‌కాలం నాటి తులం రూపాయికాసంత కుంకుమ బొట్టు దిద్దుకుంది. జాతరలో రంగం చెప్పేదానిలా పూనకం వచ్చినట్లు మాట్లాడుతోంది. చాలారోజుల తర్వాత భార్య అంత ప్రశాంతంగా ఎందుకు వుందో అతనికి అంతుపట్టలేదు. విశాఖపట్నం స్వామి

హితబోధలు చేసిన ఫలితమా? అని ఆలోచించాడు.

"మంచిదే..!" అన్నాడు నిర్లిప్తంగా చూస్తూ.

"మన ఇంటికి గ్రహశాంతి చేయించాలండీ. ఏదో పీడ పట్టుకుంది. అందుకే ఇన్ని జరుగుతున్నాయి. చండీయాగం చేస్తే పట్టుకున్న పీడలన్నీ విరుగుడై పోతాయని ద్వారకానంద స్వామి సెలవిచ్చారు. ఆయన ఎందరిళ్ళల్లోనో చండీయాగాలు చేయించి గ్రహపీడలు తొలగించారట. మనం గూడా చండీయాగం చేయించాలి. ఎంతత్వరగా చేయిస్తే అంత మంచిదట" అంటూ యాగానికి వేసిన పదిలక్షల ఎస్టిమేట్ కాగితాలు అందించింది సుబ్బారావుకి.

అదిచూసి సుబ్బారావుకి ఒళ్ళుమండిపోయింది. చర్మానికి కారం పూసుకున్నట్లయింది. హేమలత వైపు ఎగాదిగా చూశాడు.

"నువ్వు కాటేజీకి యిచ్చిన అడ్వాన్స్ పాతిక లక్షల సంగతి ఏమిటి? మనకి అవసరం లేదని తెలియజేశాం గదా? ఆ డబ్బు ఎప్పుడిస్తారట? " అన్నాడు.

"మనం వద్దన్న కాటేజీకి వేరే ఎవరైనా కావాలని ముందుకొచ్చి, వారు అడ్వాన్సు యిచ్చినప్పుడు మనకి తిరిగి ఇస్తారట. ఇప్పటికిప్పుడు డబ్బు తిరిగి ఇవ్వమంటే ఎలా? కాటేజీలు కట్టడానికి ఖర్చు చేస్తున్నాం కదా? అని చెప్పాడు మేనేజర్" చెప్పింది హేమలత.

"ఐతే ఆ డబ్బు యిచ్చినప్పుడు చండీయాగం సంగతి చూద్దాం" అని ఆ కాగితాలు తిరిగి హేమలత చేతిలో పెట్టాడు సుబ్బారావు.

అప్పటివరకు ప్రశాంతంగా కనిపించిన హేమలత వుగ్రరూపం దాల్చింది. ఆమె ముఖం కోపంతో ఎర్రబడింది. ముక్కుపుటాలు అదురుతున్నాయి. కళ్ళు పెద్దవయ్యాయి.

**భళ భళే!**

చిన్నకథల ఉత్తమ రచయితగా అవార్డు పొందిన నాథన్ ఇంగ్లాండర్‌కు ఇయర్ ఫోన్స్‌లో చక్కని సంగీతం వింటూ రాసుకోవడం అలవాటయింది! మెయిల్స్ చెక్ చేసుకోవడం, ఫేస్‌బుక్ చూడ్డం వంటి పనులకు మాత్రం దూరంగా ఉంటాడట. ఆ సమయంలో ఎవ్వరైనా ఫోన్ చేస్తే రచనకు ఆటంకం కలుగుతుందని సెల్‌ఫోన్ స్విచాఫ్ చేస్తాడట!

"నాకు తెలుసండీ.. నాకు తెలుసు. మీరు పడనివ్వరు. నెత్తిమీద శనిగ్రహం ఎక్కి కూర్చుంటే, ఎందుకు పడనిస్తారు? " అన్నది గట్టిగా.

సుబ్బారావు మాట్లాడలేదు. ఆమెవంక చూస్తుండిపోయాడు. ఏదో చేస్తే, మరేదో జరుగుతుందని నమ్మేవాళ్ళు అంతకంటే ఏం మాట్లాడతారులే అనుకుని మౌనంగా వుండిపోయాడు.

"బోడిగుండుకీ, మోకాలుకీ ముడిపెట్టినట్లుగా ఆ కాటేజీకి కట్టిన డబ్బుకి, చండీయాగానికి సంబంధం ఏమిటి? "

"డబ్బు సంబంధం" తాపీగా చెప్పాడు.

"ఆ డబ్బు ఎక్కడికి పోతుంది? కాటేజీ మనకి వద్దన్నాం, ఇస్తారు"

"ఇచ్చినప్పుడే చేద్దాం చండీయాగం"

"అప్పటిదాకా పట్టిన శని అట్లాగే వుంచుకుందామా? "

"యాగాలు, యజ్ఞాలు చేస్తే అంతా మారిపోతుందా? అంతా నీ పిచ్చి. లక్షలు వదిలించుకోవడమే తప్ప ఏదీ జరగదు"

"ముందే ఎందుకంటారు అటువంటి మాటలు? "

"ఎటువంటి మాటలైనా నీకు అర్థమై చావవులే. ఇప్పుడే చెప్తున్నా! ఈ యాగాలు, యజ్ఞాలు నాకు ఇష్టం లేదు"

"మీకు ఇష్టం లేకపోతే నాకుంది. నేను చేయిస్తాను"

"ఆడదానివి నీకే అంత పట్టుదల వుంటే, డబ్బు సంపాదిస్తున్న మగాడ్నినైన నాకెంత వుండాలే? ఇదుగో ఇప్పుడే చెప్తున్నా.. నాకు ఇష్టంలేని పనులు చేస్తే ఇంట్లోకి అడుగుపెట్టను" తీవ్రంగా అన్నాడు సుబ్బారావు.

"నాకు తెలుసండీ మీరెందుకు వద్దంటున్నారో? " వెక్కిరింపుగా అన్నది హేమలత.

"ఏంటే నీకు తెలిసింది? "

"ఆ కిరస్తానీ దాన్ని కట్టుకున్నారుగా! అందుకే!" హేమలత నోటిలో నుంచి మాటలు పూర్తిగా రాకముందే, వుగ్రుడైపోయిన సుబ్బారావు, ఆమె జుట్టు పట్టుకుని పైకి లేవదీసి ఎడాపెడా వాయించాడు.

"చంపేస్తాను.. ఇంకొకమాటన్నావంటే!" అంటూ ఆవేశంతో వూగిపోతున్నాడు.

"చంపెయ్యండి. పీడా వదిలిపోతుంది. దానితోనే కులకండి..." అంటూ పెద్దగా ఏడవడం మొదలుపెట్టింది హేమలత.

సుబ్బారావు చరచరా ఇంట్లోనుంచి వెళ్ళిపోయి కారెక్కి కూర్చున్నాడు.

"ఆఫీసుకి పోనియ్!" అన్నాడు.

ఆ సమయంలో ఇంట్లో పిల్లలు ఎవరూ లేరు. పనిమనుషులు బిక్కుబిక్కుమంటూ చాటుకి వెళ్ళిపోయారు. వాళ్ళకి తెలిసినంతవరకు బహిరంగంగా కీచులాడుకోలేదు. అయ్యగారు అమ్మగార్ని కొట్టనూలేదు. వాళ్ళు చూడ్డం ఇదే మొదలు.

★ ★ ★

హేమలత తండ్రిని, అన్నను తెనాలి నుంచి పిలిపించింది. ఇంట్లో పరిస్థితులు వివరించింది. భర్తకి, తనకు వచ్చిన విభేదాలు చెప్పి, ఎట్లా పరిష్కరిస్తారో మీ ఇష్టం అని భారం వాళ్ళమీద మోపింది.

కొలసాని సుబ్బారాయుడు చదువుకోలేదు గాని అపారమైన లోకజ్ఞానం గడించినవాడు. సకల రోగ నివారిణి జిందా తిలిస్మాత్ అన్నట్లు, ఇంటి సమస్యలన్నీ పోగొట్టి ప్రశాంతత చేకూరడానికి స్వామి సెలవిచ్చిన చండీయాగం మాత్రమే పరిష్కారమని ఆమె గాఢంగా నమ్ముతున్నదని గ్రహించాడు.

కూతురి సంసారం ఇంత సంక్షోభంలో వున్నదని అతనికి తెలియదు. మధ్య తరగతి కుటుంబాలలో సమస్యలకి మూలం డబ్బుతో ముడిపడి వుంటుంది. వీళ్ళకి డబ్బు సమస్యలేదు. డబ్బెక్కువైపోయినందున కలుగుతున్న సమస్యలు. ఇప్పుడు వీటికి పరిష్కారం ఎవరి చేతిలోనూ లేదని సుబ్బారాయుడికి తెలిసిపోయింది. పిల్లలు ఎవరి అభిరుచికి తగినట్లు వాళ్ళు జీవిస్తున్నారు. వాళ్ళకి బుద్ధి చెప్పి సక్రమమైన మార్గంలో నడిపించాల్సిన బాధ్యతవున్న భార్యాభర్తలు ఎడమొహం పెడమొహంగా వున్నారు. ఎవరి పట్టుదల వారిది. ఇద్దరూ కలిసి జీవించే అవకాశం తక్కువగా కనిపిస్తున్నది.

సుబ్బారావు నడివయసులో మరొక ఆడదానికి చేరువయ్యాడు. అదేమంత సీరియస్ సంగతికాదు. తన తాతల దగ్గర్నుంచి వూళ్ళల్లో చూస్తూనే వున్నాడు. నడివయసుకి వచ్చిన ధనిక రైతుపెద్దలు, వూళ్ళో చివర మరొక ఆడదాన్ని వుంచుకోవడం మామూలే. భార్యలు గూడా సర్దుకుపోతారు. ఆ వయసులో ఆడవారికి ముసలితనం వచ్చేస్తుంది. అల్లుళ్ళు, కోడళ్లు వచ్చేస్తారు. మనుమలు చుట్టుముట్టి వుక్కిబిక్కిరి చేస్తుంటారు. స్త్రీలు వాళ్ళకి సేవలు చేయడం, వండి పెట్టడంలోనే అమితమైన తృప్తిని అనుభవిస్తారు. పిల్లలు పుట్టడం వలన స్త్రీ శరీరంలో మార్పు గూడా వస్తుంది. కొందరు లావుగా అయిపోతారు. అటువంటి భార్య మీద మగాడికి

ఆకర్షణ వుండదు. భార్యకు భర్తమీద ఆసక్తి గూడా వుండదు. 'ఆయనకి ఓపిక వుంది, సుఖం వెతుక్కుంటున్నాడు' అని సర్దుకుని వూరుకుంటుంది. ఆర్థిక మూలాలమీద ప్రభావం చూపనంతవరకు ఇల్లాలు సహిస్తుంది. లేకపోతే కల్లోలమే.

ఇక్కడ సుబ్బారావుకి చేరువైన ఆడది డబ్బుకోసం కాదు. ఆవిడ డాక్టర్. ఆవిడకు భర్త, పిల్లల గొడవలేదు. ఇతని డబ్బు కోసం ఆవిడ చేరువవ్వలేదనేది వాస్తవం. ఒక్కోసారి అనూహ్యమైన సంఘటనలు జరిగి జీవితం మలుపు తిరుగుతుంది. అది సుబ్బారావు విషయంలో స్పష్టంగా కనిపిస్తున్నది. ఇన్నాళ్లూ బుద్ధిమంతుడిలా వున్న అతని జీవితంలోకి మరొక స్త్రీ ప్రవేశించడం ఆశ్చర్యకరమే. అందుకు కారణాలు ఎవరూ వూహించలేరు.

ఇప్పుడు అల్లుడ్ని ఆ ఆడదాని గురించి నిలదీయడం అనవసరం. సమస్య ఇంకా జటిలం కావడం తప్ప వుపయోగం లేదు. పిల్లలంతా పెద్దవాళ్ళయ్యారు. వాళ్ళకి పెళ్ళి చేయాల్సి వుంది. హేమలతకు ముందు జీవితం ఏ లోటు లేకుండా జరిగేట్టు చూడ్డమే కర్తవ్యంగా సుబ్బారాయుడికి తోచింది.

సుబ్బారాయుడు, రమణ ఆఫీసుకి వెళ్ళి కిరణ్‌రావుని కలిశారు. అప్పుడు అక్కడ సుబ్బారావు లేడు. ముఖ్యమైన పనిమీద ఢిల్లీ వెళ్ళాడని తెలిసింది.

"రండి... రండి రాయుడు గారూ!" అని తన ఛాంబర్‌లోకి ఆహ్వానించాడు కిరణ్‌రావు.

"రమణా! బాగున్నావా!" అని అతన్ని పలకరించాడు.

తండ్రీకొడుకులిద్దరూ తనతో మాట్లాడ్డానికి వచ్చారని గ్రహించాడు కిరణ్‌రావు. ఏవుంది తనతో చెప్పడానికి? పిల్లల్ని దారిలో పెట్టాలి. భార్యాభర్తలకు సఖ్యత కూర్చాలి. ఇవేగా అనుకున్నాడు.



## భలే భలే!

ఎ.జె. జాకొబ్స్ ముందుగా తన రచనకు ఔట్‌లైన్ రాసుకుంటాడు! తిరిగి దాన్ని కొంచెం విపులంగా రాస్తాడు. ఆ తర్వాత రచన పూర్తయ్యేదాకా ఆ అంశాలను మరింత విశదపరుస్తూ రాయడంతో పుస్తకం చివరి రూపం దాలుస్తుంది! అయితే ఆయన ట్రెడ్‌మిల్ మీద నడుస్తూ రచనలు చేయడానికి వీలుగా కంప్యూటర్‌ను బిగించుకున్నాడట!

"ఎట్లావుందండీ మీ వ్యాపారం?" అని క్యాజువల్‌గా అడిగాడు సుబ్బారాయుడు.

"ఏమీ బాగాలేదండీ. ప్రాజెక్టులన్నీ ఆగిపోయాయి. రియల్ ఎస్టేట్ బూమ్ సడన్‌గా పడిపోయింది. మేము ఎక్కువ రేట్లు యిచ్చి భూములు కొన్నాం. సిమెంట్, స్టీల్ ధరలు ఎక్కువున్నప్పుడు కన్‌స్ట్రక్షన్స్ మొదలు పెట్టాం. ఎక్కువ ఐటీ ఉద్యోగుల కోసం ప్లాన్ చేశాం. అమెరికాలో ఆర్థిక సంక్షోభం వలన ఇక్కడివాళ్ళకి వుద్యోగాలు పోతున్నాయి. ఉన్నవాళ్ళకి జీతాలు తగ్గిపోయాయి. ఇది ఎట్లావుందంటే అమెరికాలో స్విచ్చాఫ్ చేస్తే ఇండియాలో కరెంట్ పోయినట్లుగా వుంది" అనవ్వాడు కిరణ్‌రావు.

"మా వాడికీ అట్లాగే వుందండీ. డిపార్ట్‌మెంట్ వాళ్ళు పనులు చేయించుకుంటున్నారు. బిల్లులు పాస్ కావడంలేదు. ఫండ్స్ లేవంటారు. మరి లేనప్పుడు టెండర్లు పిలవడం, పనులు చేయించడం ఎందుకండీ? ఏం గవర్నమెంటో?" అన్నాడు సుబ్బారాయుడు.

"అప్పుల్లో మునిగి వున్నాం అని మనకి పనిచేసే లేబర్ వూరుకోరు గదా? అక్కడక్కడా తెచ్చి సర్దుతున్నాం. ఇంతకంటే కిరాణా కొట్టు నయం" అన్నాడు రమణ.

"అని మనం అనుకుంటున్నాం. కిరాణా

కొట్టు వాళ్ళని కదిలించండి. ఇప్పుడు మా దగ్గర ఎవరు కొంటున్నారండీ? పెద్ద పెద్ద మాల్స్, సూపర్‌బజార్లకెళ్ళి కొంటున్నారు. మేం దివాలా తీస్తున్నాం అంటారు" అన్నాడు కిరణ్‌రావు.

"ఏమిటోనండీ.. ప్రపంచం వింతగా మారిపోతున్నది. డబ్బున్నా లేకపోయినా ఎవరూ సుఖంగా వున్నట్లు కనిపించడం లేదు" అన్నాడు సుబ్బారాయుడు.

"నిజమేనండీ. మాకు ఇన్నాళ్ళూ బాగానే వుంది. ఇప్పుడు కష్టాలు మొదలయ్యాయి. మా వెంచర్స్ కదలడంలేదు. ఎవరూ కొనడం లేదు. బ్యాంకులు అప్పులివ్వడం తగ్గించాయి. మాకు ఇంకొక కొత్తబెడద వచ్చింది. భూముల రేట్లు పడిపోయిన తర్వాత మొదలుపెట్టిన వాళ్ళకి బాగానే వుంది. అదే సమయానికి సిమెంట్, స్టీల్ ధరలు తగ్గాయి. చౌకగా ఫ్లాట్స్ కట్టి అమ్ముతున్నారు. మాకు అలా గిట్టుబాటు కాదు. మావి కొనేవాళ్ళులేరు. ఏమవుతుందో తెలియడంలేదు. లక్షలుపోసి కొన్న మిషనరీ పనిలేక తుప్పుపట్టి పోతోంది. ఏదో పేరుకు ఆఫీసు నడుపుతున్నాం. మాది మునిగిపోతున్న పడవలా వుంది" అని వాపోయాడు కిరణ్‌రావు.

సుబ్బారాయుడు కొంచెంసేపు మౌనంగా వుండిపోయాడు. ఆఫీస్ బాయ్ కాఫీలు తెచ్చాడు. అవి తాగిన తర్వాత మొదలుపెట్టాడు.

"అమ్మాయి ఫోన్ చేస్తే వచ్చామండీ" అన్నాడు.

"అలాగా!" అన్నాడు కిరణ్‌రావు.

"అమ్మాయికి భక్తి ఎక్కువ. బాబాలనీ, స్వాములనీ తిరుగుతూ వుంటుంది. ఇంట్లో గ్రహస్థితి బాగాలేదనీ, చండీ యాగం చేస్తే అంతా కుదురుకుంటుందనీ అమ్మాయి నమ్మకం. అందుకు అల్లుడు ఒప్పుకోవడం లేదట. ససేమిరా అన్నాడట. ఎన్నడూలేనిది కొట్టాడట గూడా! ఈ వయసులో గొడవలేంటి, సర్దుకుపోవాలి గాని. ఎంత డబ్బో ఖర్చవుతున్నది. ఆ చండీయాగం ఏదో చేయిస్తే ఏం బోయింది? లాభం వుందోలేదో తర్వాతి సంగతి. అమ్మాయికి తృప్తికలుగుతుంది గదా? అల్లుడికి అంత పట్టుదల ఎందుకు? " అన్నాడు సుబ్బారాయుడు.

కిరణ్‌రావుకి ఇదంతా కొత్తసంగతేం కాదు. తెలిసిందే. సుబ్బారాయుడి నోటితో విన్నాడు, అంతే.

"అతి సర్వత్రా వర్జయేత్ అన్నారు కదండీ. అలావుంది పరిస్థితి. భక్తి వుంటే వుండనివ్వండి. మనశ్శాంతికోసం బాబాలు, స్వాముల ప్రవచనాలు వినడానికి వెళ్తే వెళ్ళనీయండి. అంతవరకు తప్పు పట్టాల్సింది ఏమీలేదు. అదొక మత్తులాంటిదని కొందరంటారు. మన మనుగడకి నష్టం రానంతవరకు ఫరవాలేదు. అదే సర్వస్వమని నమ్మి లక్షలు ఖర్చు పెట్టడం మంచిదికాదు గదా!" అన్నాడు కిరణ్‌రావు.

"మీరు అంటున్నది అర్థమైంది. అమ్మాయి కాటేజీ కోసం పాతికలక్షలు ఇవ్వడం గురించేగా? అందరూ ఇస్తుంటే, తనూ ఇచ్చింది. అల్లుడు క్యాన్సిల్ చేయించాడట"

"ఔను"

## కొత్తగాలి...

**పేదరికం**
**క్షణక్షణం ఏడ్పిస్తుంది**
**మరణం**
**ఒక్కసారే ఏడ్పిస్తుంది**

*- అంబటి వెంకటశివారెడ్డి,*
*యర్రగుంట్ల, కడప జిల్లా*

"ఇప్పుడు గొడవ ఏంటంటే, ఆ స్వామి వచ్చి చండీయాగం చేయిస్తే, పదిలక్షలు ఖర్చవుతాయట. అల్లుడు వద్దనడం లేదు గాని కాటేజీ క్యాన్సిల్ చేసినందున రావాల్సిన డబ్బులు వచ్చాక చేయిద్దాం అంటాడట. దానిమీదే ఇద్దరూ ఘర్షణ పడ్డారట. అల్లుడు అమ్మాయి మీద చెయ్యి చేసుకున్నాడట. ఇదేమైనా బాగుందా? " అన్నాడు సుబ్బారాయుడు.

కిరణ్‌రావు మౌనంగా వుండిపోయాడు. తర్వాత నెమ్మదిగా అన్నాడు.

"సుబ్బారావు చెప్పినట్లే చేస్తే ప్రాబ్లమ్ ఏమిటండీ? "

"గ్రహశాంతి జరిగితే సుఖపడతామనీ, ఎంత తొందరగా యాగం చేయిస్తే అంత మంచిదనీ అమ్మాయి ఆత్రుత. ఆమె నమ్మకం అది. అంతకంటే ఏం లేదు"

"నేనలా అనుకోవడంలేదు" అన్నాడు కిరణ్‌రావు.

"మరేమనుకుంటున్నారు? "

"ఆశ్రమంవాళ్ళు ఆ సొమ్ము తిరిగి ఇవ్వరు. ఆ సంగతి అమ్మాయికి తెలుసు. అందుకే తొందరపెడుతున్నది. ఆ సంగతి సుబ్బారావు గ్రహించే రెండిటికీ ముడిపెట్టాడు" అన్నాడు కిరణ్‌రావు.

"పోనీ ఇవ్వరే అనుకోండి. గోడకు కొట్టిన సున్నం అనుకుందాం. ఎంతో డబ్బు కళ్ళముందు మంచినీళ్ళ మాదిరి ఖర్చు చేస్తున్నారు. అమ్మాయి తృప్తికోసం ఆ యాగం ఏదో చేస్తే, కొంపలు మునిగిపోయేది ఏమిటి? " కొంచెం కోపంగా అన్నాడు సుబ్బారాయుడు.

"మనం ఏం చెబుతాం? అది అతని డబ్బు కదా? అతనికి ఇష్టం లేనప్పుడు బలవంతంగా ఖర్చు పెట్టమని చెప్పలేం కదా? గట్టిగా ప్రెస్ చేస్తే, అదేదో ఖర్చు మిమ్మల్ని పెట్టమని అంటాడనుకోండి, మీరు పెడతారా? " అన్నాడు కిరణ్‌రావు.

గొంతులో పచ్చివెలక్కాయ పడ్డట్టయింది సుబ్బారాయుడికి.

★ ★ ★

'డబ్బు సంగతి తర్వాత చూద్దాం. నేను సర్దుబాటు చేస్తాను. మీరు వచ్చి చండీయాగంలో పాల్గొనండి' అని అల్లుడిని ఫోన్‌లోనే బతిమాలాడు సుబ్బారాయుడు.

సుబ్బారావు వినలేదు. అల్లుడికి ఇష్టం లేకుండా చేయిస్తే, ఆ తర్వాత ఎటుపోయి ఎటు వస్తుందో? హేమలత మాత్రం యాగం చేయించాల్సిందే అని మొండికెత్తి కూర్చుంది. 'చండీయాగం చేయాలంటే భార్యాభర్తలు హాజరు కావాలి' అని పండితులతో చెప్పించాడు సుబ్బారాయుడు.

"నా ఇంట్లో జరిగితే చాలు. ఎవరు యాగం చేశారన్నది ముఖ్యంకాదు. అన్నయ్య, వదిన పీటలమీద కూర్చుని జరిపిస్తారు. సరిపోతుంది" అన్నది హేమలత.

సుబ్బారాయుడు తెలివితక్కువ వాడు కాదు. కూతురింట్లో అయినా, తన కొడుకు కోడలు కూర్చుని చండీయాగం చేస్తే అదంతా తన నెత్తినే పడుతుంది. తనే చేయించాడంటారు. అందుకని చిలుమూరులో వున్న సుబ్బారావు తమ్ముడు సౌభాగ్యరావుని పిలిపించాడు. అతనికి పరిస్థితులు వివరించాడు. మీ అన్న మొండిగా వున్నాడు. అతని తరఫున నువ్వు నీ భార్య జరిపించండి. ఫలితం మీ అన్న కుటుంబానికి దక్కుతుంది అని వూదరగొట్టాడు. అన్నావదినల మధ్య గొడవల సంగతి అతనికీ తెలుసు. సుబ్బారాయుడు చెప్పింది గూడా సమంజసంగానే వుందనిపించింది.

ఎందుకైనా మంచిదని ఢిల్లీలో వున్న అన్నకి ఫోన్‌చేసి చెప్పాడు సౌభాగ్యరావు. తను వెళ్లక, తమ్ముడిని గూడా వద్దంటే బాగుండదనుకున్నాడు సుబ్బారావు.

"నీ ఇష్టంరా! నాకేం అభ్యంతరంలేదు"

అన్నాడు సుబ్బారావు.

సౌభాగ్యరావు కిరణ్‌రావు దగ్గరికి వెళ్ళి జరిగిందంతా చెప్పాడు. సుబ్బారాయుడు అఖండుడు. తెలివిగా జనాన్ని ఇరికించి తమాషా చేసేరకం అని కిరణ్‌రావు గ్రహించాడు.

"వాళ్ళేం చెబితే అది చెయ్యి. నువ్వు రూపాయి ఖర్చు పెట్టకు. పొరపాటున గూడా ఎక్కడా సంతకం చెయ్యకు. మీ అన్న మామ సామాన్యుడు కాదు" అని నవ్వాడు కిరణ్‌రావు.

సుబ్బారాయుడి సంగతి అందరికంటే ఎక్కువ సౌభాగ్యరావుకే తెలుసు. తెనాలి పక్కవూర్లోనే గదా అతను వుండేది.

## కొత్తగాలి... 

**డాలర్‌కి**
**మేళతాళాలు!**
**రూపాయికి**
**చావుమేళాలు!!**

**– యు. చిట్టిబాబు,**
కొత్తపాల్వంచ, ఖమ్మం జిల్లా

మొత్తానికి విశాఖపట్నం నుంచి ద్వారకా నందస్వామిని, వేదపండితులను పిలిపించి వైభవంగా చండీయాగం జరిపించింది హేమలత. తన పంతం నెగ్గించుకుంది.

సుబ్బారావు తన పట్టుదల సడలించుకో లేదు. చండీయాగం చేస్తే, ఇంట్లో అడుగు పెట్టనని తను చెప్పిన మాటమీద నిలబ డ్డాడు. ఇంటిముఖం చూడ్డంలేదు. మార్గ రెట్ ఇంట్లోనే వుంటున్నాడు. తనను పెంచి, పెద్దజేసి విద్యాబుద్ధులు చెప్పించిన పాస్టర్ అగస్టీన్ చనిపోయిన తర్వాత, ఒంటరితనం నుంచి దూరంచేసి తోడుగా వుంటున్న సుబ్బారావు ఆమెకు ఆత్మీయుడ య్యాడు. ఆమెకు నవజీవనం మొదలైంది. పెళ్ళికాలేదనే, భర్తలేడనే కొరత తీరింది. ఆమె జీవితం వుత్సాహంగా సాగిపో తోంది. సుబ్బారావుతో కలిసి జీవిస్తున్న మార్గరెట్ అంటే, ఎవరికీ చిన్నచూపు లేదు. డాక్టర్ మార్గరెట్ అంటే రోగులకు దేవత. ఆ అభిప్రాయం సడలలేదు.

లోగడ వారాంతంలో రెండురోజులుండి గడిపి వెళ్ళే సుబ్బారావు, శాశ్వతంగా తన ఇంట్లోనే వుండడం మార్గరెట్‌కి ఆనం దమే. అతని ఇంటి గురించి, భార్యాబిడ్డల గురించిన ఆలోచన ఆమెకు లేదు. ఆమెకు తన గురించిగానీ, తనను లోకులు ఏమను కుంటారో అనిగానీ గిల్టీ ఫీలింగ్ లేదు. కాని సుబ్బారావుకి వుంది.

తను మార్గరెట్ ఇంట్లో కారు ఎక్కి కూర్చుంటాడు. ఆఫీసుకి వెళ్ళి దిగుతాడు. ఎక్కడికి వెళ్ళాలన్నా కారులోనే. ఇంటికి కారులో వస్తాడు. తను మామూలు జనంతో కలవడు. తన గురించి తెలిసినా ఎవరూ ముఖం మీద అనరు. కాని మార్గ రెట్? పబ్లిక్‌లోకి వెళ్తుంది. హాస్పిటల్లో తోటి డాక్టర్లు, స్టాఫ్, రోగులతో కాలం గడు పుతుంది. ఏదైనా సందర్భంలో చాటు గానో, సూటిగానో, ఫలానా సుబ్బారావుని ఇంట్లో పెట్టుకుంది అని కామెంట్ చేస్తే? భరించగలదా? ఏమైనా ఫీలవదా?

సుబ్బారావు మార్గరెట్ గురించి ఆలో చించాడు.

"మార్గరెట్! మనం పెళ్ళి చేసుకుందాం" చెప్పాడు సుబ్బారావు.

మార్గరెట్ నవ్వింది.

"ఇప్పుడు ఎందుకు? " అన్నది.

"ఇదివరకంటే, అప్పుడప్పుడు వచ్చిపోయే వాడిని. ఇప్పుడు ఇక్కడే వుండిపోతు న్నాను. బాగుండదు"

"ఎవరికి? "

"చూసేవారికి"

"ఎవరు చూసేవారు? వంటమనిషా? పనిమనిషా? లేకపోతే వాచ్‌మనా? "

"వాళ్ళకు కాదు.. ఇరుగుపొరుగు వాళ్ళకి"

"హూc... ఇరుగు పొరుగు? ఇదేం పల్లెటూరనుకున్నావా? లేకపోతే కాకినాడ అనుకున్నావా? హైదరాబాద్ సిటీ! ఇక్కడ ఎవరికి ఎవరు? మన గురించి ఇరుగు పొరుగు పట్టించుకుంటారా? నువ్వు చాలా కాలంగా వస్తున్నావుగదా? పక్కింట్లో ఎవరున్నారు చెప్పు? "

సుబ్బారావు మౌనంగా వుండిపోయాడు.

"చెప్పలేవు. ఎందుకంటే వాళ్ళ గురించి మనం పట్టించుకోం. మన గురించి వాళ్ళూ అంతే. నీకొక సంగతి తెలుసా? మా డాడీ చనిపోయిన రోజు వాళ్ళెవరూ తొంగిచూడ లేదు. మన మతం, మన కులం కాక పో వచ్చు. కానీ మానవత్వమూ లేదా? "

"వాళ్ళ సంగతి పోనీ! మనకి కంఫర్టబుల్‌గా వుండాలి కదా? " అన్నాడు సుబ్బారావు.

"నువ్వు ఇక్కడ కంఫర్టబుల్‌గా లేవా? ఈ ఇంట్లో నీకేం తక్కువైంది. నీ ఇంట్లో వున్నది, ఇక్కడ లేనిది ఏమిటి చెప్పు? "

"ఇంట్లో అని కాదు. మనం ఫంక్షన్లకి, పార్టీలకి కలిసి వెళ్తున్నాం. భార్యాభర్తల్లాగే బిహేవ్ చేస్తున్నాం. మన ముందు ఎవరేం అనకపోయినా, చాటుగానైనా అనుకోరా? "

"ఏమనుకుంటారు? "

"పెళ్ళి లేకుండా ఇద్దరూ కలిసి వుంటున్నారని? "

"ఇప్పుడు లివిన్ కల్చర్ వంటపట్టించుకున్నాం కదా? మనం వయసులో పెద్ద వాళ్ళం. మనకి పిల్లలు కలిగే ఛాన్స్‌లేదు. వాళ్ళ భవిష్యత్తు ఏమిటి అని వర్రీ అవసరం లేదు. మరి జాబ్ చేస్తున్న చిన్నవయసు వాళ్ళు కలిసే వుంటున్నారుగా! కొందరు పిల్లల్నిగూడా కంటున్నారుగా? వాళ్ళేం వర్రీ అవుతున్నట్టులేదు. మనమెందుకు ఫీలవ్వాలి? "

"ఏమో? ఐ ఫీల్ గిల్ట్"

"మనం పెళ్ళి చేసుకోవడం పెద్దపని కాదు. పెళ్ళి చేసుకుంటాం. ఫ్రెండ్స్‌కి పార్టీ ఇస్తాం. ఇక మేం భార్యాభర్తలం అని డిక్లేర్ చేస్తాం. దానివలన ప్రాబ్లమ్స్ వున్నాయిగా? " అన్నది మార్గరెట్.

"మనం పెళ్ళి చేసుకుంటే ఏం ప్రాబ్లమ్స్ వుంటాయనుకుంటున్నావ్? నా వైఫ్ గురించేనా? దాని సంగతి నాకు తెలుసు. దానికి పూజలు, పునస్కారాలు, యాగాలు చెయ్యడం కావాలి. స్వాములు, బాబాలు అని తిరుగుతుంటుంది. నేను ఎన్ని పెళ్ళిళ్ళు చేసుకున్నా పట్టించుకోదు" అని నవ్వాడు సుబ్బారావు.

"మనం పెద్దవాళ్ళం. ఇప్పుడు లివ్ ఇన్ తప్పేంకాదు. ఇలాగే వుందాం" అన్నది మార్గరెట్.




చీకటి పడుతూ వుండగా సైట్‌లో నుంచి బయల్దేరాడు సుబ్బారావు. అతను రావడం గమనించి దూరంగా నిల్చుని సిగరెట్ తాగుతున్న డ్రైవర్, దాన్ని కిందపడేసి చెప్పు కింద నలిపి, గబగబా అడుగులు వేసుకుంటూ కారుదగ్గరికి వచ్చి నిలబడ్డాడు.

సుబ్బారావు సెల్ మోగింది.

'మోడెమ్ మీద డిస్‌ప్లే అయిన నెంబర్ కొత్తదిగా వుంది. ఎవరో? ' అనుకున్నాడు.

"హలో!" అన్నాడు.

"అన్నయ్యా! నేను అంజలిని"

"అంజలీ బాగున్నావా? " అని పలకరించాడు.

"బాగున్నాను అన్నయ్యా! మా ఇంటికి రావాలి ఒకసారి. ఇప్పుడు వీలవుతుందా? తర్వాత వీలయినప్పుడైనా సరే!"

"ఏమిటమ్మా విశేషం? "

"కొంచెం నీతో మాట్లాడాలి"

'అంజలి తనకి కాల్ చెయ్యడం అరుదు. ఇప్పుడు ఏదో మాట్లాడాలని రమ్మన్నదంటే ఏదో విశేషం వుంది. ఇంకేం వుంటుంది? తను, హేమలత విడాకులు తీసుకోబోతున్నామని వాడు చెవిన వేశాడేమో? తన బ్రెయిన్‌వాష్ చెయ్యడానికి రమ్మన్నదేమో' అనుకున్నాడు. ఇప్పుడు వెళ్ళకుండా వాయిదా వేస్తే, ఆ విషయమే మనసులో మెదులుతూ వుంటుంది. 'ఎందుకు రమ్మన్నదో ఏమో' అని ఆలోచనలు వస్తుంటాయి. అదేదో ఇప్పుడే వెళ్తే సరిపోతుంది' అనుకున్నాడు.

"సరేనమ్మా! ఇప్పుడే వస్తాను" అన్నాడు.

కారెక్కి కూర్చున్నాడు.

"కిరణ్ ఇంటికి పోనీ..!" అన్నాడు.

వెళ్ళగానే స్నాక్స్‌పెట్టి, కాఫీ యిచ్చింది అంజలి. తర్వాత ఎదురుగా కూర్చుంది.

"వీడు ఏడమ్మా? ఇంకా రాలేదా? " అని అడిగాడు.

"మామూలే. లేటుగా వస్తారు" అన్నది.

"చెప్పమ్మా? ఏంటి విశేషాలు? "

"పిల్లల పెళ్ళి చేసేద్దాం అనుకుంటున్నాం అన్నయ్యా!"

"వెరీగుడ్! కానివ్వండి. ఒకపనైపోతుంది" అని నవ్వాడు.

"మహేశ్వర్‌ది ఎంటెక్ అయిపోయిందటగా? "

"ఔనమ్మా! ఏదో ముక్కీమూలిగీ అయిందనిపించాడు"

"నయమేకదా! ఇక కంపెనీలో అప్రెంటీస్‌గా చేర్చెయ్యండి"

"ఆ సంగతి వాడితో మాట్లాడాలి. వాడిష్టం! మన కంపెనీలో చేరతానంటే నాకేం ప్రాబ్లమ్ లేదు. అమెరికా పోతానంటే పంపిస్తాను"

"కావ్య డిగ్రీ అయిపోయింది. తనకి ఇష్టం అని ఫ్యాషన్ టెక్నాలజిలో కోచింగ్ తీసుకుంటోంది"

"సరే! తనకి ఇష్టమైంది చెయ్యనీ"

"ఎప్పట్నుంచో అనుకుంటున్నాం కావ్యని మహేశ్వర్‌కి ఇచ్చి పెళ్ళిచేస్తే బాగుటుందని. పాతికేళ్ళ పైబడి మీరిద్దరూ స్నేహితులు. బిజినెస్‌పార్ట్‌నర్స్. ఇప్పుడు బంధువులం అయితే ఇంకా దగ్గరవుతాం" అన్నది అంజలి.

సుబ్బారావు హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు. ఆమె తనకి, హేమలతకు ఉన్న కుటుంబ స్పర్ధల గురించి అడుగుతుందేమో, సర్దుకుపొమ్మని సలహా ఇస్తుందేమో అనుకున్నాడు. తను వివరణ ఇచ్చుకోవాల్సి వస్తుందనుకున్నాడు. మార్గరెట్ గురించి ఎత్తుతుందేమో? ఏం చెప్పాలా అని ఆలోచిస్తున్నాడు. ఆమె నుంచి అటువంటి మాటలు రాకపోయేసరికి 'హమ్మయ్య' అనుకున్నాడు.

"మీ అల్లుడినే అడుగమ్మా! నీకు ఆ మాత్రం స్వతంత్రం లేదా? మధ్యలో నాదేం లేదు" అని నవ్వాడు.

"నీకు చెప్పకుండా సరాసరి అల్లుడిని అడగటం బాగుంటుందా? " అన్నది అంజలి.

"వాడికి, వాళ్ళమ్మకి ఓకే అయితే, నాకు డబుల్ ఓకే. సరేనా? " అన్నాడు.

"కావ్య పెళ్ళి గురించి నాకేం దిగులు లేదు. దానికి మహేశ్వర్ అంటే చిన్నప్పటి





నుంచి ఇష్టమే. కలిసిమెలిసి పెరిగారు"

"అటువంటి ఆలోచన నాకూ వస్తుం దేది. దేనికైనా టైమ్ రావాలమ్మా! అందుకే నేను ఎత్తలేదు. మరి శ్రీరామ్ సంగతి ఏంటి? వాడు డాక్టరయ్యాడుగా! ముందు వాడి పెళ్ళి చేయాలనుకోవడం లేదా? "

కొడుకు సంగతి ఎత్తగానే అంజలి ముఖం కళా విహీనమైంది. అప్పటి వరకు ఎంతో సంతోషంగా ఉన్నదల్లా దిగులుగా కనిపించింది.

"వాడి సంగతి ఏం చెప్పాలో అర్థం కావడం లేదన్నయ్యా!" అన్నది తలవంచు కుని.

సుబ్బారావు ఆమె ధోరణి బట్టి గ్రహిం చాడు. శ్రీరామ్ ఎవర్నో ప్రేమించి ఉంటాడు. అదంతా అంజలికి ఇష్టం ఉండి ఉండదు.

ఈరోజుల్లో అది మామూలే గదా! ఇందులో బాధపడడానికి ఏముంది? స్వాతి, ఆ రవీంద్రని ప్రేమిస్తున్నానని అంటే తనేం చేయగలిగాడు? కాకపోతే స్వాతిని తన కోడలిగా చేసుకోవాలనే ఉద్దేశ్యం అంజలికి ఉండి ఉంటుంది. అది ప్పుడు జరిగేపని కాదు.

"మనం ఎన్నో అనుకుంటాం. అవన్నీ సాకారమవుతాయా? కొన్ని జరుగుతాయి. మరికొన్ని అనుకోనివి జరుగుతాయి. మన చేతిలో ఏముంది? అడ్జస్టయిపోవడమే"

"శ్రీరామ్ పెళ్ళి ఘనంగా చేద్దామని కలలు కన్నాను అన్నయ్యా!"

"ఇప్పుడేమైందమ్మా? ఎందుకు వర్రీగా ఉన్నావు? సంబంధం కుదిరితే ఘనంగానే చేద్దాం. నేను దగ్గరుండి అన్ని ఏర్పాట్లు గ్రాండ్‌గా చేస్తాను గదా? "

"వాడు దిక్కూమొక్కూ లేని అనాథ పిల్లను ప్రేమించాడట. పెళ్ళి చేసే స్థోమత వాళ్ళకి ఎక్కడుంటుంది? "

"అనాథా? అంటే తల్లిదండ్రులు లేని

## నవంబరు - 2013
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **సిరివెళ్ళ రవీంద్రకుమార్** - రెవెన్యూ కాలనీ, కర్నూలు
2. **యం.వి.ఎస్. మూర్తి** - యన్. కె. నగర్, కొత్తగూడెం
3. **చింతపల్లి నాగేశ్వరరావు** - ప్రసాదంపాడు, విజయవాడ
4. **జె. రాజగోపాలరావు** - ఎ.ఎస్. రావ్ నగర్, హైదరాబాద్
5. **టి. ప్రదీప్‌శర్మ** - హనుమేష్ నగర్, గుంతకల్లు

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. మధు | 6. అశోక్ |
| 2. శోభ | 7. ఎలీనర్ క్యాటన్ |
| 3. మనోరమ | 8. వర్జీనియా వూల్ఫ్ |
| 4. భానుమూర్తి | 9. ముట్నూరి కృష్ణారావు |
| 5. జోగినాథం | 10. మల్లాది రామకృష్ణశాస్త్రి |

పిల్లా? "

"ఔను. ఆ పిల్ల అనాథాశ్రమంలో ఉండి చదువుకుంది. తల్లిదండ్రులెవరో తెలీదు"

"ఆ పిల్ల వీడికెక్కడ పరిచయమైంది? "

"వీడితో పాటు మెడికల్ కాలేజీలో చదువుకుందట"

"ఐతే అమ్మాయి డాక్టరన్నమాట. ఇంకెందుకు దిగులు? హాయిగా డాక్టర్ కోడలిగా వచ్చి ఇంట్లో ఉంటుంటే సంతో షించాల్సింది పోయి వర్రీ అవు

తావెందుకు? "

"ఎంత డాక్టరైనా ఏం గౌరవం అన్నయ్యా? పిల్ల తల్లిదండ్రులు ఎవరంటే ఏం చెప్పగలం? పెళ్ళి గూడా గుట్టుచప్పుడు కాకుండా ఆర్యసమాజంలో చేసుకుంటే సరిపోతుంది అంటుందట. అట్లా చేస్తే మన పరువేంకాను? "

"ఆ అమ్మాయి పెరిగిన వాతావరణాన్ని బట్టి అటువంటి ఆలోచన చేసి ఉంటుంది. సింపుల్‌లైఫ్ అనుభవించింది కాబట్టి జీవితంలో అన్నీ అలాగే జరగాలనుకుంటారు. అందులో తప్పు బట్టడానికేం లేదు. ఆమె కోరుకుందని అలా జరగనిస్తామా? మనమే గ్రాండ్‌గా చేద్దాం పెళ్ళి"

"శ్రీరామ్ చిన్నప్పటి నుంచి బుద్ధిగా చదువుకున్నాడు. డాక్టరయ్యాడు. పెద్ద కుటుంబంలో పిల్లను కోడలిగా తెచ్చుకోవాలనుకున్నాను. ఇప్పుడు వీడు నా కలలన్నీ కల్లలు చేశాడు"

"నువ్వింతగా ఎందుకు బాధపడుతున్నావో నాకు అర్థం కావడంలేదు. శ్రీరామ్ కాని పనేం చేశాడు? వయసులో ఉన్న వాళ్ళు కలిసి మెలిసి తిరుగుతుంటే ఆకర్షణ పుడుతుంది. ఇష్టం కలుగుతుంది. పెళ్ళి చేసుకుని సుఖంగా ఉండాలనుకుంటారు. తప్పేంటి? "

అంజలి మాట్లాడలేదు. కొడుకు విషయంలో ఆమె సంతోషంగా లేదు. తమ హోదాకి, అంతస్తుకి తగిన సంబంధం చేయాలని ఎవరైనా ఆశిస్తారు. నయమే కూతురైనా తల్లి కంట్రోల్లో ఉంది. చెప్పిన సంబంధం చేసుకోవడానికి సిద్ధంగా ఉంది. కావ్య గూడా ఎవర్నయినా ప్రేమించి ఉంటే అంజలి తల్లకిందులైపోయి ఉండేది.

"సరే అన్నయ్యా! కావ్య పెళ్ళి గ్రాండ్‌గా చేసి నా కోరిక తీర్చుకుంటాను. మహేశ్వర్‌తో మాట్లాడు" అన్నది.

"శ్రీరామ్ పెళ్ళిమాత్రం సింపుల్‌గా ఎలా కానిస్తాం? మనకి తగినట్లే గ్రాండ్‌గా చేద్దాం. ఆ బాధ్యత నాది. సరేనా? "

"ఆడపిల్ల పెళ్ళికి మనం డబ్బు ఖర్చుపెడతాం. మగపిల్లవాడి పెళ్ళికి గూడా మనమే డబ్బు ఖర్చుపెట్టుకునే ఖర్మ పట్టింది" నిష్ఠూరంగా ధ్వనించాయి అంజలి మాటలు.

అనాథ కోడలు ఆమెకు ఇష్టం లేదు. ఆ పిల్ల చదువుకుని డాక్టర్ కాగలిగింది. కాని సమాజం ఆమె స్థోమతను ప్రశ్నిస్తున్నది. ఆమె పుట్టుపూర్వోత్తరాలు కావాలి.

"అంజలీ! ఆ పిల్ల వివరాలు నాకు ఇవ్వు. నేను మాట్లాడతాను" అన్నాడు.

"ఆ పిల్లని ఇంటికి తీసుకొచ్చి ప్రేమించానని చెప్పాడు వాడు, అంతే! వివరాలు నాకు తెలీవు"

"ఆ అమ్మాయి బాగుందా? అందంగా ఉందా? "

"ఆc ఎర్రగా బుర్రగా ఉంది. మా వాడిని వలలో వేసుకుంది"

"ఏం.. మీవాడు తక్కువ తిన్నాడా? అసలు శ్రీరామే ఆ పిల్ల వెంటబడి వలలో వేసుకున్నాడేమో కదా? " అని పకపక నవ్వాడు సుబ్బారావు.

"ఆc వాడికి అంత తెలివుందీ? అమాయకుడు"

"తల్లికళ్ళకి బిడ్డలు అమాయకంగా, నోట్లో నాలుక లేనివాళ్ళలా కనబడతారు లేమ్మా!" అన్నాడు.

అంజలి నవ్వింది.

"నేను శ్రీరామ్‌తో మాట్లాడతాలే! ఆ పిల్ల గురించి ఎంక్వయిరీ చేస్తాను. నువ్వు అదేపనిగా అనాథ పిల్లని ఆలోచిస్తూ బుర్ర పాడుచేసుకోకు. ఎక్కడ పుట్టిపెరిగితే ఏమిటి? పిల్ల బుద్ధిమంతురాలైతే చాలు. పద్మం బురదలో పుడుతుందని నీకు తెలుసుగా!" అన్నాడు.

మర్నాడు ముందుగా పెద్దకొడుకు

మహేశ్వర్‌తో మాట్లాడాడు సుబ్బారావు. అంజలి చెప్పిన విషయం ప్రస్తావించాడు. కావ్యను పెళ్ళి చేసుకోవడానికి తనకే మాత్రం అభ్యంతరం లేదన్నాడు. కావ్యంటే తనకు ఇష్టమేనన్నాడు.

"పెళ్ళి చేసుకోవడానికి ఇప్పుడు రెడీ యేనా? " అడిగాడు సుబ్బారావు.

"రెడీయే డాడీ"

"బాగా ఆలోచించి చెబుతున్నావా? "

"ఇందులో బాగా ఆలోచించడానికి ఏవుంది డాడీ. చిన్నప్పటినుంచి కావ్య అంటే ఇష్టమే. కావ్యగూడా నన్ను ఇష్టపడు తోంది"

"అది ఓకే. పెళ్ళయ్యాక మీరిద్దరూ గెటాన్ కావాలి గదా? నువ్వు ఏదైనా జాబ్‌కోసం ట్రై చేస్తున్నావా? "

"కంప్యూటర్ కోర్సులు చేస్తున్నాను డాడీ. అవి పూర్తయ్యాక ఏదొక జాబ్ వస్తుంది"

"గుడ్. జాబ్‌కోసం ట్రై చెయ్! నిన్ను నువ్వు ప్రూవ్ చేసుకో. ముందు సంపాదన గురించి ఆలోచించు. ఆ తర్వాత పెళ్ళి. ఓకే!"

"ఓకే డాడీ" చెప్పాడు మహేశ్వర్.

తర్వాత కిరణ్‌రావుకి జరిగిన విషయం చెప్పాడు.

"మహేశ్వర్‌కి బాధ్యత తెలియాలని అలా చెప్పాను. ఎక్కడా జాబ్ సంపాదిం చుకోలేకపోతే అప్పుడు మన కంపెనీలో అప్రెంటీస్‌గా చేరుద్దాం"

"మంచి ఆలోచన" అన్నాడు కిరణ్‌రావు.

"ఉద్యోగం సంపాదించడం ఎంత కష్టమో, డబ్బుకి ఎంత విలువ ఉంటుందో వాడికి తెలియాలి. జాబ్ చేయనివ్వకుండా మనం కంపెనీలో చేరిస్తే వాడికి బాధ్యత తెలీదు. పెళ్ళికి తొందరేం లేదు. ఈలో

పల కావ్య తన కోర్సులు పూర్తి చేస్తుంది" అన్నాడు సుబ్బారావు.

"ఔను. నాకు నీ ఆలోచన నచ్చింది"

"శ్రీరామ్ పెళ్ళి ముందు చేసేద్దాం. వాడు లవ్ చేసిన పిల్లని కలుసుకుని మాట్లాడతాను"

"ప్రొసీడ్" అన్నాడు కిరణ్‌రావు.

శ్రీరామ్ ప్రేమించిన 'వెన్నెల' ఆకాంక్ష లేడీస్ హాస్టల్లో ఉంటున్నదని తెలిసి అడ్రస్ తీసుకుని వెళ్ళాడు సుబ్బారావు. ముందుగా తను వస్తున్నట్లు ఫోన్ చేసి చెప్పడంవల్ల ఆమె అతను వచ్చాడని తెలియగానే వచ్చి విజిటర్స్ హాల్లో కలుసుకుంది.

## కొత్తగాలి...

**కష్టాల కొలిమిలో**
**శిలువను మోస్తున్న**
**'దైవం' నేటి సగటు మనిషి!**

**– యు. చిట్టిబాబు,**
కొత్తపాల్వంచ, ఖమ్మం జిల్లా

"నమస్కారం అంకుల్" అన్నది వస్తూనే.

సుబ్బారావు ఆమెను చూడగానే స్టన్ అయ్యాడు. కొన్ని నిమిషాలు మాట్లాడలేక పోయాడు. ఆమె రూపం అతన్ని ఆశ్చర్యంలో ముంచెత్తింది.

"అంకుల్ కాఫీ తీసుకోండి"

వెన్నెల అతని చేతికి కాఫీ కప్పు అందించి ఎదురుగా కూర్చుంది.

"శ్రీరామ్ నీ గురించి చెప్పాడమ్మా! వాళ్ళ పేరెంట్స్‌కి నిన్ను పరిచయం చేశాడటగదా" అన్నాడు సుబ్బారావు.

"ఔను అంకుల్. నన్ను వాళ్ళింటికి తీసుకెళ్ళాడు"

"చెప్పమ్మా! శ్రీరామ్ నీకు ఎక్కడ పరిచయం? "

"మెడికల్ కాలేజీలో. నా సీనియర్ శ్రీరామ్. ఇద్దరి అభిరుచులు కలిశాయి. తనే ప్రపోజ్ చేశాడు. నేను ఓకే చేశాను" నవ్వింది వెన్నెల.

"నీగురించి చెప్పమ్మా? స్పెషలైజేషన్ ఏదైనా చెయ్యలేకపోయావా? "

"నావంటి అనాథ యం. బి. బి. యస్. పూర్తి చెయ్యడమే గొప్ప. ఇంకా స్పెషలైజేషన్ కూడానా? "

"ఏం? ఎందుకు చెయ్యగూడదు? ఇప్పుడు బ్యాంకులు ఎడ్యుకేషన్ లోన్స్ గూడా ఇస్తున్నాయి కదా? "

"అదంత ఈజీకాదు అంకుల్. అప్పుచేసి చదవడం, దాన్ని వడ్డీతో సహా తీర్చడం, అదంతా నాకు ఇంట్రెస్ట్ లేకపోయింది. ఇప్పటికి చదివింది చాలనిపించింది. జాబ్‌లో చేరిపోయాను. శ్రీరామ్ స్పెషలైజేషన్ చేశాడు గదా! చాలు"

"శ్రీరామ్ ఫాదర్ కిరణ్‌రావు, నేనూ శ్రీశైలంలో జూనియర్ ఇంజినీర్స్‌గా జాబ్‌లో చేరాం. కిరణ్‌రావుది ఇండిపెండెంట్ మెంటాల్టీ. మా జాబ్‌లో బాసిజం మామూలు. అతను అడ్జెస్ట్ కాలేకపోయాడు. ముందు తను జాబ్‌కి రిజైన్ చేశాడు. తర్వాత నేను గూడా. హైదరాబాద్ వచ్చి కన్‌స్ట్రక్షన్ కంపెనీ స్టార్ట్ చేశాం. సెటిల్ అయ్యాం" తమ గురించి చెప్పాడు సుబ్బారావు.

"ఒక ప్రయత్నం వృథా కారాదని అంటారు. మీరు ప్రూవ్ చేశారు. గవర్నమెంట్ జాబ్‌కి రిజైన్ చేసి ఇండిపెండెంట్‌గా బతకడానికి ప్రయత్నించడం అభినందనీయమైన విషయం" మెచ్చుకుంది వెన్నెల.

"కిరణ్‌రావు ఫ్యామిలీ మా ఫ్యామిలీతో




దశాబ్దాలుగా అనుబంధం కలిగి ఉంది. శ్రీరామ్ చెల్లెలు కావ్యను మా మహేశ్వర్ కిచ్చి మేరేజ్ చెయ్యబోతున్నాం. ఇన్నాళ్ళూ ఉన్న స్నేహం, బంధుత్వంగా గూడా మారబోతోంది"

"కంగ్రాట్స్ అంకుల్"

"ఇంకా నీ గురించి చెప్పు వెన్నెలా? "

"శ్రీరామ్ చెప్పే ఉంటాడుగా అంకుల్. నా గురించి చెప్పడానికి పెద్దగా ఏం లేదు. నాకు తల్లిదండ్రులు ఎవరో తెలీదు. అనాథాశ్రమంలో పెరిగాను. ఫాదర్ మోజెస్ నన్ను శ్రద్ధగా పెంచి, చదువు చెప్పించారు. ఆయన నిబద్ధత కలిగిన జీసస్ భక్తుడు. ప్రేమతత్వం ఆయన నుంచే నేర్చుకున్నాను. ఎవరినీ ద్వేషించకుండా ప్రేమించడం, వారి బాధలు తీర్చే అవకాశం ఉండటమనేది ఒక్క డాక్టర్‌కే సాధ్యమని నాకు బోధించారు. అందుకే నేను మెడిసిన్‌లో చేరాను. నా సంపాదనలో కొంత ఆశ్రమానికి డొనేట్ చేస్తున్నాను. అది నావంటి ఎందరో అనాథలకు ఉపయోగపడుతుంది. శ్రీరామ్‌కి ఈ విషయం తెలుసు. అతను నన్ను ప్రోత్సహిస్తాడు" చెప్పింది వెన్నెల.

"మీ పెళ్ళి సింపుల్‌గా జరగాలని అంటున్నావని మీ కాబోయే అత్త అంజలి చెప్పింది"

"నిజమే అంకుల్. నా తరపున ఎవరూ లేరు. అంత ఆర్భాటంగా పెళ్ళి చేసుకుని ఎవర్ని ఆనందింపజేయాలి, చెప్పండి? "

"అలా ఎందుకు అనుకుంటావు? ఇప్పుడు ఆ ఆశ్రమంలో ఉన్న ఫాదర్, ఆయాలు, అక్కడ ఆశ్రయం పొందుతున్న పిల్లలు అందరూ నీ వాళ్ళే కదా? "

"అఫ్ కోర్స్!"

"తాముగూడా బాగా చదువుకుని వెన్నెలలా సెటిల్ అవ్వాలనే ఆలోచన పిల్లల్లో కలుగుతుంది. ఆ పెళ్ళిసందడిలో ఒక్కరోజైనా ఆ పిల్లలు ఆనందంగా గడపగలుగుతారు. రకరకాల పదార్థాలు రుచి చూసి కడుపునిండా తింటారు. వారి మనసుల్లో కొత్త ఆలోచనలు పుట్టుకొస్తాయి. బాగా చదువుకోవాలని పట్టుదల పెరుగుతుంది"

వెన్నెల సుబ్బారావు వైపు ఆశ్చర్యంగా చూసింది.

"అంకుల్! నేను ఇవన్నీ ఆలోచించలేదు. నిజమే, ఆ ఆశ్రమంలో ఉన్నవాళ్ళంతా నావాళ్ళే. వాళ్ళతో నాది విడదీయరాని అనుబంధం. థాంక్స్ అంకుల్. మీరు నాలో కొత్త ఆలోచన ప్రవేశపెట్టారు"

"వెన్నెలా! పెళ్ళి ఇద్దరు వ్యక్తులకి మధ్య జరిగినా, దాని ద్వారా రెండు కుటుంబాలు అనుసంధానమవుతాయి. ముఖ్యంగా అత్తగారి కుటుంబంతో ఆడపిల్ల పూర్తిగా కలిసిపోతుంది. ఇక ఆమె జీవితం ఆ వ్యక్తుల మధ్య గడపాల్సి ఉంటుంది. వారి అభిప్రాయాలు, అభిరుచుల్ని గౌరవించాలి! అప్పుడే ఆ పెళ్ళి సక్సెస్ అయినట్టు" అన్నాడు సుబ్బారావు.

"నేను ఆ కుటుంబంలో ఇమడలేనని మీ అనుమానమా అంకుల్? "

"కాదు. మీ అత్తకు తన కొడుకు పెళ్ళి అన్ని సంపన్న కుటుంబాలలో జరిగే పెళ్ళిలా వైభవంగా జరపాలనే కోరిక ఉంది. ఎందుకంటే ఆమె దశాబ్దాలుగా ఎందరో సంపన్న కుటుంబాల పెళ్ళిళ్ళకు

హాజరై ఉంటుంది కదా? ఇప్పుడు మొదటిసారి తమ కుటుంబంలో జరిపే పెళ్ళిగూడ ఆ స్థాయిలో జరపాలని కోరుకుంటోంది. తమ బంధుమిత్రులకు మంచి విందు ఇచ్చి తృప్తి కలిగించాలని వారికి ఉంటుంది. మనం కాదనగూడదు"

సుబ్బారావు చెప్పింది శ్రద్ధగా విన్నది వెన్నెల.

"మీరు చెప్పింది న్యాయంగా, సమంజసంగా ఉంది అంకుల్. సింపుల్‌గా పెళ్ళి చేసుకోవాలనేది



నా అభిప్రాయం మాత్రమే. వైభవంగా జరిపే పెళ్ళికి నేను వ్యతిరేకిని కాదు. దానికి ఖర్చుపెట్టడానికి డబ్బు మాత్రం నా దగ్గర లేదు. అంతే" చెప్పింది వెన్నెల.

"డబ్బు గురించి ఆలోచించొద్దు వెన్నెలా! నీకు తల్లిదండ్రులు లేరనే, అనాథననే భావం నీ మనసులోనుంచి తొలగించుకో. ఇక నుంచి నువ్వు నా బిడ్డవు. నన్ను డాడీ అని పిలువు. నీకు అమ్మగూడా ఉంది 'మమ్మీ' అని పిలవడానికి. నీ పెళ్ళి మేమే చేస్తాం. నీకు కాబోయే అత్త నాకు చెల్లెలు. ఇప్పుడు వియ్యపురాలు గూడా! ఆమె కోరికలు తీర్చడం నా బాధ్యత. ఏమంటావు? "

వెన్నెల మౌనంగా ఉండిపోయింది. ఆమె మనసు మూగపోయింది. నోటిలోనుంచి మాటలు రావడం లేదు. ఉద్వేగంతో ఆమె పెదవులు అదురుతున్నాయి. మంచు బొమ్మలా కరిగిపోయింది.

వెన్నెల లేచి వచ్చి వంగి సుబ్బారావు పాదాలకు నమస్కారం చేసింది. ఆమె కన్నీళ్లు పడి అతని పాదాలు తడిశాయి.



"వెన్నెలా? వాటీజ్ దిస్. లే... లే...!" అంటూ ఆమెను లేవదీశాడు.

ఎండి నెర్రెలు విచ్చిన భూమి మీద తొలకరి జల్లులు పడినప్పుడు ఆ నేల కరిగి ముద్దయినట్లుగా, ఇన్నాళ్ళూ ప్రేమరాహిత్యంతో పెరిగిన వెన్నెలపై ఒక్కసారిగా సుబ్బారావు ప్రేమ, అనురాగం, ఆప్యాయత కురిపించేటప్పటికి, ఆమె ద్రవించిపోయింది.

"తప్పమ్మా! ఏడవగూడదు...!" అంటూ ఆమె బుగ్గలపై జారుతున్న కన్నీళ్ళను కర్చీఫ్‌తో తుడిచాడు.

"ఏడుపు కాదు అంకుల్. పట్టరాని ఆనందం. సంతోషం కలిగినప్పుడు గూడా కన్నీళ్ళు వస్తాయి కదా!" అన్నది వెన్నెల.

"నిజమేనమ్మా! నీవి ఆనందాశ్రువులు. ఇక నుంచి నన్ను అంకుల్ అని పిలిస్తే ఒప్పుకోను. డాడీ అని పిలవాలి. ఓకేనా!" మందలింపుగా అన్నాడు సుబ్బారావు.

"డాడీ...!" అన్నది వెన్నెల.

"గుడ్...!" అని సుబ్బారావు ఆమె తల మీద చెయ్యివేసి నిమిరాడు.

★ ★ ★

సెల్‌ఫోన్ అదేపనిగా మోగుతూ ఉంటే సుబ్బారావుకి మెలకువ వచ్చింది. కళ్ళు తెరిచి చూశాడు. బెడ్‌లైట్ మసక వెలుగులో వాల్‌క్లాక్‌వైపు చూశాడు. పదకొండు దాటింది. అదే సమయంలో పక్కనే పడుకున్న మార్గరెట్ కళ్ళు తెరిచింది.

"ఎవరు అర్ధరాత్రి కాల్ చేశారు? " అని అడిగింది.

"హలో!" అన్నాడు సుబ్బారావు.

"సుబ్బూ! అర్జెంట్‌గా జూబ్లీహిల్స్ పోలీస్ స్టేషన్‌కి వచ్చెయ్!" చెప్పాడు కిరణ్‌రావు.

"వాట్ హేపెండ్? " ప్రశ్నించాడు సుబ్బారావు.

"ఇక్కడికి రా ముందు" అని కాల్ కట్ చేశాడు అతను.

సుబ్బారావు లేచి వళ్ళు విరుచుకున్నాడు.

"ఏమైంది? " రెట్టించింది మార్గరెట్.

"ఏమో! కిరణ్ జూబ్లీహిల్స్ పోలీస్‌స్టేషన్‌కి రమ్మన్నాడు" చెప్పాడు సుబ్బారావు.

సుబ్బారావు వాష్‌బేసిన్‌లో ముఖం కడుక్కున్నాడు. ఫ్రిజ్‌లోనుంచి వాటర్ బాటిల్ తీసుకుని ఎత్తి గటగటా నీళ్ళు తాగాడు. డ్రెస్ చేసుకుని బయల్దేరుతుంటే మార్గరెట్ అడిగింది.

"నేనూ రానా!"

"ఎందుకులే? "

"కాదు. ఏం జరిగిందోననే టెన్షన్‌తో డ్రైవ్ చేయడం మంచిది కాదు. నేను డ్రైవ్ చేస్తాను కారు" అంటూ బయల్దేరింది మార్గరెట్.

కారు పోలీస్ స్టేషన్ ముందు ఆగింది. సుబ్బారావు, మార్గరెట్ కారు దిగారు. గేట్ ముందే నిలబడి ఉన్నాడు కిరణ్‌రావు. సుబ్బారావు అడక్కముందే చెప్పాడు.

"పబ్బులో గొడవైంది. మన మహేష్ రవీంద్రను చితకబాదాడట. పోలీస్ కంప్లైంట్ ఇస్తే, స్టేషన్‌కి తీసుకొచ్చారు"

"రవీంద్రంటే స్వాతి ఫ్రెండేనా? "

కిరణ్‌రావు తల ఊపాడు.

"వాడికీ, వీడికి గొడవేంటి? ఎందుకు తన్నుకున్నారు? "

"నీకు అదంతా మహేష్ చెబుతాడు. వెళ్ళి అడుగు" అన్నాడు.

లాకప్‌లో ఉన్నాడు మహేశ్వర్. డ్యూటీలో ఉన్న ఎస్సై, డాక్టర్ మార్గరెట్‌ను గుర్తుపట్టాడు.

"డాక్టర్! నమస్తే" అన్నాడు లేచి నిల్చుని విష్ చేస్తూ.

"నమస్తే! బాగున్నారా? " అని పలకరించింది అతన్ని.

"బాగున్నాను మేడమ్! మీరేంటి ఇలా వచ్చారు? " అని అడిగాడు.

"మావాడేదో గొడవలో ఇరుక్కున్నాడట గదా!" అన్నది.

"ఈ కుర్రాడు మీ బాబా? " ఆశ్చర్యం వ్యక్తం చేశాడు.

మార్గరెట్ తల ఊపింది. ఎస్సై వారిద్దరూ కూర్చోవడానికి కుర్చీలు ఆఫర్ చేశాడు. సెల్‌లో ఉన్న మహేశ్వర్‌ని తీసుకొచ్చి వారి ముందు నిలబెట్టాడు.

మహేశ్వర్ తల వంచుకుని నిలబడ్డాడు.

"ఏం జరిగిందిరా! వాడిని ఎందుకు కొట్టావు? " అడిగాడు సుబ్బారావు.

మహేశ్వర్ మార్గరెట్ వైపు అదోలా చూస్తూ, మాట్లాడకుండా నేల చూపులు చూస్తూ నిలబడ్డాడు.

మార్గరెట్ ఎదురుగా ఉండడంతో చెప్పడానికి సంకోచిస్తున్నాడని అర్థమైంది.

"చెప్పు, ఫర్వాలేదు" అన్నాడు.

"డాడీ! ఆ రవీంద్రగాడు చీట్. పబ్బులో స్వాతితో వాడి బిహేవియర్ నాకు నచ్చలేదు. స్వాతిని ఇన్సల్ట్ చేశాడు"

"వాళ్ళిద్దరూ ఫ్రెండ్స్ కదా? "

"వాడు సెల్ఫిష్ ఫెలో డాడీ. ఎవడో ఫైనాన్సర్ ఉన్నాడట. వాడిని మంచి చేసుకుంటే స్వాతిని హీరోయిన్ చేస్తాడట. వాడి దగ్గరికి వెళ్దామని బలవంతం చేస్తున్నాడు. స్వాతి 'నో' చెప్పుంటే, వాడు బూతులు తిడుతూ కొట్టబోయాడు. అందుకే కొట్టాను డాడీ!"

అదంతా చెబుతుంటే మహేశ్వర్ ముఖం కోపంతో ఎర్రబడింది. సుబ్బారావుకి కూడా నెత్తురు మరిగింది. ఆ రవీంద్రగాడు ఎదురుగా ఉంటే కింద పడేసి పీక





# కళ్లు తెరిపించు దేవుడా!

కింగ్‌జేమ్స్ వర్షన్ ఇంగ్లిష్ బైబిల్ చదివే నేటి క్రైస్తవులు విలియం టిన్‌డేల్‌కు రుణపడి ఉన్నారు. ఇతనికి 'ఫాదర్ ఆఫ్ ఇంగ్లిష్ బైబిల్' అని పేరు. హిబ్రూ నుంచి ఇంగ్లిష్‌లోకి బైబిల్‌ను అనువదించడం నేరమని క్రీ.శ. 1408లో బ్రిటిష్‌చర్చి శాసించింది. వందేళ్ల తర్వాత ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్ యూనివర్సిటీల్లో చదివిన విలియంకు బైబిల్‌ను ఇంగ్లిష్‌లోకి అనువదించాలనే కోరిక కలిగింది. అతను పాఠాలు చెప్పే ఓ పిల్లవాడి ఇంటికి భోజనానికి వచ్చే వారిలో క్రైస్తవ ఫాదర్లు ఉండేవారు. వారి మాటలను బట్టి బైబిల్‌లోని విషయాలు వారికి తెలియవని గ్రహించిన విలియం, లండన్‌లోని బిషప్ టంగ్‌స్టాల్‌ను బైబిల్‌ను అనువదించడానికి అనుమతి కోరాడు. కానీ ఆయన నిరాకరించాడు. క్రీ.శ. 1524లో కొందరు ఇంగ్లిష్ వ్యాపారుల సాయంతో, జర్మనీలోని హేంబర్గ్ నగరానికి వెళ్లిన విలియం ఎంతో కష్టపడి బైబిల్‌ను ఇంగ్లిష్‌లోకి అనువదించాడు.


విలియం టిన్‌డేల్

అప్పుడే అచ్చుయంత్రం కనిపెట్టడంతో విలియం వాటిని ఆరువేల కాపీలు ముద్రించి ఇంగ్లండ్‌కు రహస్యంగా పంపాడు. వాటిని అమ్మగా వచ్చిన లాభంతో మరికొన్ని బైబిల్స్ ముద్రించి పంపాడు. ఎనిమిదో కింగ్ హెన్రీ గూఢచారులను పంపి, విలియం జాడను కనుగొన్నాడు. తర్వాత అతడ్ని ఇంగ్లండ్‌కు రప్పించి, ఏడాదిన్నరకాలం పాటు ఆ నేరాన్ని విచారించి, మరణశిక్షను విధించాడు. క్రీ.శ. 1536లో విలియంపై మరణశిక్ష అమలయింది. అతని ఆఖరిప్రార్థన 'లార్డ్! ఇంగ్లండ్‌రాజు కళ్లు తెరిపించు' అనేది.

మూడేళ్ల తర్వాత క్రీ.శ. 1539లో ఆ ప్రార్థన ఫలించింది. ఎనిమిదో కింగ్ హెన్రీ 1539లో చర్చికి వచ్చే భక్తులకు ఇంగ్లిష్ బైబిల్‌ను అందుబాటులో ఉంచాలనే శాసనం చేసాడు. ఆయన తర్వాత ఇంగ్లండ్‌ను పాలించిన కింగ్‌జేమ్స్ మరింత పకడ్బందీగా బైబిల్‌ను అనువదింపజేసాడు. దీనికి ప్రేరణ విలియం టిన్‌డేల్ కృషే.

మీద కాలుపెట్టి చంపాలనిపించింది. తనకే అంత ఆవేశం వస్తోంది, జరిగింది వింటూవుంటే. స్పాట్‌లో చెల్లెలిమీద దౌర్జన్యం చేస్తుంటే యువకుడైన మహేష్ కొట్టడంలో తప్పేముంది? ఇంకా నయం.. గొంతు పిసికి చంపలేదు.

"వాడెక్కడున్నాడు ఇప్పుడు? "

"దెబ్బలు తగిలాయి సార్! హాస్పిటల్‌కి పంపించాం" చెప్పాడు ఎస్సై.

"ఏ హాస్పిటల్లో ఉన్నాడు వాడు? నేను చూడాలి వాడిని" అన్నాడు సుబ్బారావు.

సుబ్బారావులో అంతులేని ఆవేశాన్ని గమనించాడు ఎస్సై.

"సార్! ఇప్పుడు వద్దులెండి. రేపు ఉదయం చూద్దురుగాని" అన్నాడు.

"స్వాతి ఏది? "

"ఇంటికెళ్లింది" చెప్పాడు మహేశ్వర్.

కొంచెంసేపైన తర్వాత పోలీస్‌స్టేషన్‌కి కమిషనర్ నుంచి కాల్ వచ్చింది. సుబ్బారావుతో బెయిల్ మీద సంతకం చేయించుకుని మహేశ్వర్‌ని వదిలేశాడు ఎస్సై.

కిరణ్‌రావు మహేశ్వర్‌ని కారులో ఎక్కించుకుని, "నేను ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాలే" అన్నాడు.

సుబ్బారావు, మార్గరెట్ కారెక్కి ఇంటికి బయల్దేరారు.

సుబ్బారావు త్యాగరాజుకి ఫోన్ చేశాడు తర్వాత.

"నమస్కారం త్యాగరాజు గారూ! నేను స్వాతి ఫాదర్‌ని.. సుబ్బారావుని మాట్లాడు



తున్నాను"

"మీరా? ఏంటి సుబ్బారావుగారూ మీ వాడు మా రవిని చితక్కొట్టాడు?"

"ఇప్పుడు మీ రవీంద్ర ఎక్కడున్నాడు? హాస్పిటల్ నుంచి ఇంటికి వచ్చాడా?"

"ఇప్పుడు ఇంట్లో రెస్ట్ తీసుకుంటున్నాడు"

"ఏమైంది? కాళ్లూచేతులు ఏమైనా విరిగాయా?"

"అదేంలేదులెండి. ఏవో దెబ్బలు!" నీళ్ళు నమిలాడు త్యాగరాజు.

"సర్లెండి, జరిగిపోయిందేదో జరిగిపోయింది. ఇప్పుడు మీరు ఇంట్లో ఉంటారా?"

"ఉంటానండీ? ఎందుకు అడుగుతున్నారు?"

"నేను మీ వాడికి సారీ చెప్పాలనుకుంటున్నానండీ" అన్నాడు సుబ్బారావు.

"అయితే రండి" అన్నాడు త్యాగరాజు.

"ఓకే...!" అని కాల్ కట్ చేశాడు.

"సుబ్బారావ్! నీకేమైనా మతిపోయిందా? ఆ కుర్రవెధవకి నువ్వెళ్ళి సారీ చెప్పడం ఏమిటి?" కోపంగా అన్నది మార్గరెట్.

సుబ్బారావు నవ్వాడు.

"తప్పదు" అన్నాడు.

"నాకేం అర్థం కావడంలేదు. మరీ అంత మంచితనం పనికిరాదు. మన మంచితనాన్ని వాళ్ళు చేతగానితనం అనుకుంటారు" చెప్పింది మార్గరెట్.

"వాళ్ళు ఏదో అనుకుంటారని మన పద్ధతులు మార్చుకోలేంగదా!" అన్నాడు సుబ్బారావు.

"సరే! నీ ఇష్టం" అన్నది మార్గరెట్.

సుబ్బారావు కిరణ్‌రావుకి కాల్ చేశాడు.

"కిరణ్! నీకు త్యాగరాజు ఇల్లు తెలుసు గదా? స్వాతిని తీసుకుని అక్కడికి వచ్చెయ్! నేనూ వచ్చేస్తున్నాను"

"ఇప్పుడెందుకు సుబ్బూ! వాడింటికి?"

"పనుంది"

"వాడితో ఇంకా మాటలేంటి? బేవార్స్ గాడని తేలిపోయిందిగా? పైగా స్వాతిని తీసుకెళ్ళడం ఏమిటి వాడింటికి?"

"నువ్వు తీసుకురా! చెబుతాను" విసుగ్గా అన్నాడు సుబ్బారావు.

సుబ్బారావు వెళ్లేసరికి త్యాగరాజు ఇంటి ముందు కిరణ్‌రావు కారు ఆగి ఉంది. ఇద్దరూ కారులోనే కూర్చుని ఉన్నారు. సుబ్బారావు కారు పార్క్ చేసి "రావోయ్!" అన్నాడు కిరణ్‌రావుతో.

అందరూ త్యాగరాజు ఇంట్లోకి వెళ్ళారు. వీళ్ళని చూసి ముందుకు వచ్చాడు త్యాగరాజు.

"నమస్కారం" అన్నాడు.

సుబ్బారావు అతనికి విష్ చేసి సోఫాలో కూర్చున్నాడు.

"మీ వాడిని పిలిపించండి" అన్నాడు సుబ్బారావు.

త్యాగరాజు లోపలకు వెళ్ళి కొడుకుని వెంటబెట్టుకుని వచ్చాడు. రవీంద్ర వస్తూనే "నమస్తే అంకుల్!" అన్నాడు.

"పబ్బులో ఏం జరిగింది?" అడిగాడు సుబ్బారావు.

"మామూలుగానే పబ్బులో స్వాతిని

## కొత్తగాలి... 

**అక్షరానికి ప్రాణం**
**మాట**
**మాటకు ప్రాణం**
**అర్థమే!**

– వాసా ప్రభావతి,
హైదరాబాద్

కలుసుకుని మునిస్వామి గురించి చెప్పాను అంకుల్"

"మునిస్వామి ఎవడు? "

"చాలా సినిమాలకు ఫైనాన్స్ చేసాడు అంకుల్"

"ఫైనాన్షియర్ అన్నమాట"

"ఔను అంకుల్. అతను ఎవర్నికైనా డైరెక్టర్‌కో, ప్రొడ్యూసర్‌కో రికమెండ్ చేస్తే స్వాతికి హీరోయిన్ ఛాన్స్ ఇస్తారు. అందుకని మునిస్వామిని కలుసుకుందామని అన్నాను. స్వాతి తనకి ఇష్టం లేదంది. అయితే ఇక సినిమా ఛాన్స్‌ల గురించి అడగవద్దన్నాను. తను నాతో ఘర్షణ పడింది. పెద్దగా కేకలు పెట్టింది. ఇంతలో మహేష్ వచ్చి నన్ను కొట్టాడు" చెప్పాడు రవీంద్ర.

"మునిస్వామికి స్వాతిని తార్చి నువ్వు హీరో ఛాన్స్ కొట్టేద్దామని కాదా? " ప్రశ్నించాడు సుబ్బారావు.

"నాకోసం కాదంకుల్! స్వాతికోసమే..." రవీంద్ర పూర్తిగా చెప్పకముందే సుబ్బారావు ఆవేశంతో లేచెళ్ళి రవీంద్ర చెంప మీద ఈడ్చి కొట్టాడు.

ఆ దెబ్బకు రవీంద్ర కిందపడ్డాడు. పడ్డవాడిని లేవనీయకుండా కాలితో తన్నడం మొదలుపెట్టాడు సుబ్బారావు. రవీంద్ర కేకలు పెడుతూ తన్నులు కాచుకోవడానికి చేతులు అడ్డం పెడుతున్నాడు.

"ఎందుకండీ కొడతారు? పోలీసుల్ని పిలిపిస్తాను" అని అరుస్తూ ముందుకు వచ్చాడు త్యాగరాజు.

"అక్కడే నిలబడు. ముందుకు వచ్చావంటే షూట్ చేస్తాను" సుబ్బారావు జేబులో నుంచి పిస్టల్ తీశాడు.

త్యాగరాజు భయంతో వణుకుతూ నిలబడిపోయాడు. కిరణ్‌రావు సుబ్బారావుని అడ్డుకున్నాడు.

"ఇక చాల్లే సుబ్బూ! వీడో పిచ్చికుక్క. వీడిని కొట్టడం ఎందుకు? వీడి పాపాన వీడే పోతాడు, పద!" అన్నాడు కిరణ్‌రావు.

"ఒరేయ్ బద్మాష్! ఇంకెప్పుడైనా మా స్వాతి ముఖం చూసినా నిన్ను కాల్చి చంపుతాను. అర్థమైందా? " ఆగ్రహంతో అని బైటకు నడిచాడు సుబ్బారావు.

స్వాతి భయంతో నిలువెల్లా వణికిపోతూ ఏడవసాగింది. కిరణ్‌రావు ఆమె భుజం మీద చెయ్యివేసి నడిపించాడు.

"నువ్వెందుకే ఏడుస్తావు? నిన్ను కన్నందుకు మేం ఏడవాలి. ఈ రోజు నుంచి నీకు కాలేజీ, ఇల్లు దట్సాల్. సినిమాలు, డ్యాన్సులు, పబ్బులు అంటూ తిరిగితే చంపేస్తాను" గట్టిగా కేకలు పెట్టాడు స్వాతిని వేలితో బెదిరిస్తూ.




"రావ్ మనం పెళ్ళి చేసుకుందాం" ప్రపోజ్ చేసింది మార్గరెట్.

సుబ్బారావు ఆశ్చర్యపోలేదు. మార్గరెట్ వెన్నెలను చూసిన దగ్గర నుంచి అంతర్మథనంలో మునిగి పోయింది. వెన్నెల జీవితానికి తన జీవితానికి దగ్గరి పోలికలున్నాయనిపించింది. తను తల్లిదండ్రుల తిరస్కారణకు గురై అనాథగా పెరిగింది. కనీసం టీనేజ్ వరకైనా తను తల్లిదండ్రుల ప్రేమానురాగాలు చవిచూసింది. పాపం వెన్నెలకు అదీ లేదు. పసిగుడ్డు నుంచి అనాథే. ఆమె పెళ్ళి తల్లిదండ్రు

లుగా దగ్గరుండి జరిపిస్తామని సుబ్బారావు మాట ఇవ్వడం సంతోషం కలిగించింది. వెన్నెల గూడా ఆనందంగా ఉంది. ఇన్నేళ్లకు తనకు చెప్పుకోవడానికి పేరెంట్స్ దొరికినందుకు ఎంతో సంతోషిస్తోంది.

కానీ తాము లివ్ఇన్ పద్ధతిలో కలసి వుంటున్నారు. పైకి ఎవరూ అనకపోయినా తాను సుబ్బారావు ఉంపుడుగత్తెననే భావిస్తారు. వారికా అవకాశం ఎందుకు ఇవ్వాలి? అందుకే మార్గరెట్ ప్రపోజ్ చేసింది.

"పెళ్ళా? " అన్నాడు సుబ్బారావు.

ఒకప్పుడు అతను పెళ్ళి ప్రపోజల్ తెస్తే తను ఒప్పుకోలేదు. అప్పటి కారణాలు వేరు. వెన్నెల రాకతో ఆమెలో మార్పు వచ్చింది. వెన్నెలకు తల్లిదండ్రులుగా పెళ్లి జరిపించాలంటే తాము భార్యాభర్తలు అవడం అనివార్యం.

"మన మతాలు వేరు. కాబట్టి సివిల్ మ్యారేజ్ చేసుకుందాం. మతాలు మార్చుకోనవసరం లేదు. ఎవరి మతం వారిది. ఎవరి ఆచారం వారిది" అన్నది మార్గరెట్.

సుబ్బారావుకి ఇందులో ఒప్పుకోకపోవడానికి ఏమీ లేదు. ఎటువంటి పరిస్థితులనైనా ఎదుర్కోవడానికి సిద్ధపడ్డాడు. మార్గరెట్, సుబ్బారావు సివిల్ మ్యారేజ్ చేసుకున్నారు.

తర్వాత వాళ్ళు వెన్నెలను దత్తత తీసుకున్నారు. ఇప్పుడు వెన్నెల అనాథ కాదు. ఆమెకు తల్లిదండ్రులు లభించారు. ఎంత అదృష్టం! వెన్నెల హాస్టల్లో రూమ్ ఖాళీ చేసి మార్గరెట్ ఇంటికి చేరింది. మార్గరెట్ ఎంతో సంతోషంగా ఉంది. ఇన్నేళ్ళూ బ్రహ్మచారిణిగా వుంది. ఇప్పుడు సుబ్బారావుకి ఇల్లాలైంది. కలిసొచ్చే రోజొచ్చి డాక్టర్ అయిన కూతురు నడిచొచ్చింది. ఇక అల్లుడొస్తాడు. ముందు ముందు మనుమలు పుట్టుకొస్తారు.

సుబ్బారావు డాక్టర్ మార్గరెట్ని పెళ్ళి చేసుకున్నాడనే వార్త తాటాకు మంటలా బంధువర్గంలో వ్యాపించింది. హేమలత తండ్రి సుబ్బారాయుడు హుటాహుటిన హైదరాబాద్ వచ్చాడు. అప్పటికే హేమలత ఏడ్చి ఏడ్చి ఇక ఏడవడానికి కూడా ఓపిక లేక నిస్త్రాణగా పడిపోయింది. తండ్రిని, తమ్ముడిని చూసి ఆమెకు దుఃఖం పొంగుకొచ్చింది.

"ఏడ్చి లాభం ఏంటమ్మా? ఇప్పుడేం చేయాలో ఆలోచించు" అన్నాడు సుబ్బారాయుడు.

"భార్య బతికుండగా మరొక పెళ్ళి చేసుకుంటాడా? రూల్స్ ఒప్పుకోవు" అన్నాడు రమణ.

"ఇన్నాళ్ళూ దాన్ని ఉంచుకున్నాడని తెలిసినా ఊరుకున్నాం. ఏకంగా పెళ్లి చేసుకుంటాడా? ఈ వయసులో ఇదేం పాడు బుద్ధి? ఛీ...ఛీ...!" ఈసడించుకున్నాడు సుబ్బారాయుడు.

"అక్కా! నువ్వు బాధపడి ఏం లాభం? స్థిమితపడు" అని ఓదార్చాడు రమణ.

"బాధపడి లాభం లేదని తెలిసినా, బాధపడకుండా ఉండడం ఎలారా? ఆడదానిగా పుట్టడం కంటే అడవిలో మ్రానై పుట్టడం మంచిదని అందుకే అన్నారు.

## కొత్తగాలి...

**రంగు ఏదైనా సరే**
**ఎలుకలను పట్టేదే నిజమైన పిల్లి!**
**రూపం ఎలాంటిదైనా సరే**
**సుగుణాలు కల్గినవాడే**
**నిజమైన మనిషి!!**

*– గుర్రం శారదాశ్రీనివాస్,*
*చెరుకుపల్లి, గుంటూరు జిల్లా*

ఏడవడానికే ఆడది పుట్టింది. అంతకంటే చేసేది ఏముంది.? దేవుడు నా తలరాత అట్లా రాశాడు" కన్నీళ్ళు తుడుచుకుంటూ అన్నది హేమలత.

"తలరాతేంటి అక్కా! ఈ వయసులో రెండో పెళ్ళి చేసుకోమని దేవుడు ఆయన తలమీద రాశాడని ఊరుకుంటావా? అది చేతగానితనం"

హేమలత మాట్లాడలేదు. ఈ పరిస్థితుల్లో ఏం చేయాలో తండ్రీకొడుకులు బాగా ఆలోచించుకునే వచ్చారు.

"జరిగిపోయిందేదో జరిగిపోయింది. ఏడుస్తూ కూర్చున్నందువల్ల లాభంలేదు" అన్నాడు సుబ్బారాయుడు.

"ఇప్పుడేం చేయను నాన్నా!" అన్నది హేమలత.

"విడాకులు ఇచ్చెయ్!" తీవ్రంగా అన్నాడు సుబ్బారాయుడు.

"విడాకులా...? " అన్నది హేమలత.

ఆమెముఖం వెలవెలాపోయింది. నిర్ఘాంతపోయింది. ఆ మాట శరాఘాతంలా గుండెలో గుచ్చుకుంది. పెళ్ళయిన కొద్ది సంవత్సరాలకే భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలొచ్చి విడాకులు తీసుకోవడం తను విన్నది. కాని తన భర్తతో పాతికేళ్ళు కాపురం చేసింది. నడి వయసులో కొచ్చింది. ముగ్గురు ఎదిగిన పిల్లలున్నారు. వాళ్ళకి పెళ్ళీడొచ్చింది. పెళ్ళిళ్ళు చేయాలి. ఇప్పుడు విడాకులా? భర్తలేని తన కుటుంబానికి గౌరవం వుంటుందా? బంధువులు ఎట్లా భావిస్తారు? కేవలం ఆస్తి మాత్రమే గౌరవమా?

"ఔనక్కా! నాన్న చెప్పినట్టు విను. బావ ఇక ఎటూ ఇంటికి రాడు. కొత్త పెళ్ళాం మోజులో అక్కడే వుంటాడు. ఎవరో పిల్లను దత్తత చేసుకున్నారంట. ఆ పిల్లకి పెళ్ళి చెయ్యాలంట. కిరణ్‌రావు కొడుక్కే యిచ్చి చేస్తారంట. అటువంటి వాడితో తెగతెంపులు చేసుకుంటే పీడాపోతుంది" కోపంగా చెప్పాడు రమణ.

తండ్రి, తమ్ముడు విడాకులిచ్చి భర్తతో తెగతెంపులు చేసుకోమని చెప్పడం హేమలతకు మింగుడు పడడం లేదు. ఆ భావం అసలు జీర్ణం కావడం లేదు.

సుబ్బారావుకి విడాకులిచ్చి వదిలించుకోమని చెప్పడం వెనుక తండ్రీ కొడుకుల స్వలాభం గూడా అంతర్గతంగా వుంది. ఇప్పుడు అల్లుడి ఆస్తులతో పోల్చుకుంటే వాళ్ళది హీనమే. హేమలత విడాకులు ఇవ్వడం జరిగితే కోట్ల ఆస్తులు దక్కుతాయి. పిల్లలు చిన్నవాళ్ళు. వాళ్ళకి లోకజ్ఞానం వుండదు. కాబట్టి ఆ ఇంట్లో చేరి పెత్తనం చెయ్యొచ్చు. తెనాలి నుంచి తమ కుటుంబం హైదరాబాద్‌కి మకాం మార్చి హాయిగా వుండొచ్చు.

"నువ్వు వూఁ అంటే ప్లీడరుతో మాట్లాడతా!" అన్నాడు రమణ.

"తొందరెందుకు? నేను ఆలోచించుకోవాలి. పిల్లలు ఏమంటారో! వాళ్ళతో గూడా మాట్లాడతా!" అన్నది హేమలత.

తండ్రీ కొడుకులు నిరాశ పడ్డారు.

★ ★ ★

"మీ మామ విడాకులిమ్మని కూతురిపై ఒత్తిడి తెస్తున్నాడని తెలిసింది" అన్నాడు కిరణ్‌రావు, సుబ్బారావుతో.

సుబ్బారావు మాట్లాడలేదు. ఇన్నాళ్ళూ తను కుటుంబంతో అంటీముట్టనట్టుగా వుంటున్నా బాధ వుండేది కాదు. అంతా తనవాళ్ళే అన్న భావం వుండేది. హేమలత విడాకులు ఇవ్వడం అంటూ జరిగితే భార్యాపిల్లలు శాశ్వతంగా దూరమైపోతారు. ఆ భావమే అతన్ని బాధిస్తోంది.

"ఇట్లా జరుగుతుందని అనుకోలేదు కిరణ్!" అన్నాడు సుబ్బారావు.

అతని గొంతులో బాధ తొంగిచూసింది.

"ఇందులో నీ తప్పు కూడా ఉంది

సుబ్బా" నెమ్మదిగా అన్నాడు కిరణ్

"ఏంటి మార్గరెట్ తో పెళ్ళా? " అడి గాడు.

"అదికాదు, బిజినెస్‌లో బిజీ అంటూ నువ్వు ఫ్యామిలీని నెగ్లెట్ చేయడం, పిల్లల్ని పట్టించుకోకపోవడం, బాధ్యత అంతా నీదే అని చెల్లెమ్మ మీద తోసె య్యడం.. ఎందుకో తప్పుగా అనిపిస్తు న్నాయి. డబ్బు తెచ్చి ఇంట్లో పడేస్తే సరి పోతుందా? " అన్నాడు కిరణ్‌రావు.

సుబ్బారావులో పశ్చాత్తాపం కనిపి స్తోంది. కిరణ్‌రావు అన్నదాంట్లో తప్పు లేదు.

> కొత్తగాలి... 
>
> **ఆ వోల్వోలో**
> **టిక్కెట్టు ధర ఎక్కువే**
> **సరాసరి**
> **స్వర్గానికే కదా మరి!**
>
> *– గుడిమెట్ల గోపాల కృష్ణ,*
> అరసవిల్లి

"నిజమే" అన్నాడు బాధగా.

జరిగిపోయిన దానికి బాధపడి ఏం ప్రయోజనం? అతనిలో అంతర్మథనం మొదలైంది.

హేమలతతో పెళ్ళి తర్వాత చాలాకాలం సంసార జీవితం సక్రమంగానే గడిచింది. భార్యాపిల్లలే సర్వస్వంగా గడిపాడు. పుట్టిల్లు వదిలి తనతో కాపురానికి వచ్చిన హేమలత తనతో కంఫర్టబుల్ గానే జీవితం గడిపింది. మిడిల్ క్లాస్ జీవితం నుంచి క్రమంగా హైసొసైటీలోకి ప్రవేశిం చాక, డబ్బు బాగా గడించడం మొదలుపె ట్టాకే ప్రాబ్లమ్స్ మొదలయ్యాయి. మధ్యత రగతి జీవితమే బాగున్నట్టు ఇప్పుడు అని పిస్తోంది.

"పిల్లలు అందరు ధనవంతుల పిల్లల్లాగే ఆడంబరాలకు అలవాటుపడ్డారు. విలా సాల జీవితం వలన, హైసొసైటీలోని పోకడల వలన సమస్యల్లో ఇరుక్కుని కు టుంబంలో కలతలకు కారణమయ్యారు. తల్లి దృష్టిలో పిల్లలు ఎప్పటికీ చిన్నవాళ్ళ లాగే కనపడతారు. అందువలన ఆమె కఠినంగా వ్యవహరించలేకపోయింది. అప్పుడు నువ్వు పిల్లల్ని అదుపులో పెట్టడా నికి ప్రయత్నించి వుంటే పరిస్థితులు చేయి జారి వుండేవికాదు. ఏమనుకోకు. నా మనసులో మాట చెప్పాను" అన్నాడు కిర ణ్‌రావు.

సుబ్బారావు తను అన్న మాటలకు ఫీల య్యాడేమోనని సంకోచించాడు కిరణ్‌రావు. ఎంత స్నేహం, చదువు వున్నా నిజం ని ష్ఠూరంగా వుంటుంది. ముఖం మీద అంటే కొందరు హర్టవుతారు గూడా!

"నువ్వన్న దాంట్లో అబద్ధం ఏవుంది. నిజమే మాట్లాడావు. జరిగిన దాంట్లో నా తప్పు గూడా వుంది. ఏంటో మొదటి నుంచి మొండిగా వుండడం అలవాటైంది. సంసారం సాఫీగా సాగాలంటే పట్టు విడు పులు వుండాలని ఇప్పుడు అర్థమైంది" మనస్ఫూర్తిగా అన్నాడు సుబ్బారావు.

"ఒకవేళ హేమలత విడాకులు కావాలని అడిగితే వెంటనే ఒప్పుకోకు. ఇప్పుడీ వయ సులో విడాకులు తీసుకోవడం అభిలష ణీయం కాదు. పిల్లల పెళ్ళిళ్ళు కావాలి. వాళ్ళ కోసమైనా కలిసుండాలి. సొసైటీ కోసమైనా నువ్వు ఇంటితో సంబంధం తెంచుకోవద్దు. వాళ్ళు పట్టుబట్టినా కోర్టులో కేసు తొందరగా తేలదు. భార్యాభర్తల్లో ఎవరు ఒప్పుకోకపోయినా కేసు సాగుతూ వుంటుంది. క్రమంగా ఆమెలో కూడా మార్పు వస్తుంది. పిల్లల కోసమైనా రాజీ పడుతుంది. ఏమంటావు? " అన్నాడు కిర

ణ్‌రావు.

"భలేవాడివే! నేను వెంటనే ఎందుకు ఒప్పుకుంటాను? మార్గరెట్‌తో ఎఫైర్ గమ్మత్తుగా కుదిరింది. వెన్నెలకు తల్లిదండ్రులు లేని కొరత తీర్చడానికే పెళ్ళి చేసుకున్నాం. అంత మాత్రాన నా భార్యాపిల్లలను వదులుకుంటానా? " అన్నాడు సుబ్బారావు వుద్వేగంతో.

శ్రీరామ్, వెన్నెలల పెళ్ళికి పిలవడానికి వచ్చిన కిరణ్‌రావు, అంజలి దంపతుల ముందు బాధపడింది హేమలత.

"సారీ వదినా! నేను పెళ్ళికి రాలేను. పిల్లల్ని పంపుతాలే" అన్నది హేమలత కళ్ళు తుడుచుకుంటూ.

అంజలికి ఆమె మీద సానుభూతి కలిగి కళ్ళల్లో నీళ్ళొచ్చాయి. తనను కట్టుకున్న భర్త మరొక ఆడదానితో కలిసి పెళ్ళిపీటల మీద కూర్చుని పెళ్ళి చేయిస్తుంటే ఎంత బాధగా వుంటుంది? గుండె పగిలిపోదా? మనసు ముక్కలవదా? తన స్థానంలో భర్త పక్కన వున్న స్త్రీని చూస్తూ ఎవరు మాత్రం తట్టుకోగలరు?

"అమ్మాయ్! జరిగిపోయిన దానికి బాధపడి ప్రయోజనం లేదు. ఏదో అలా జరిగిపోయింది. మార్గరెట్‌ని నీ చెల్లెలు అనుకో. మనసు ప్రశాంతంగా వుంటుంది" అన్నాడు కిరణ్‌రావు.

అది అంత సులభం కాదని అతనికి తెలుసు. అంతకంటే ఏం చెప్పాలో తోచలేదు అతనికి.

"వదినా! నిన్ను మెచ్చుకుంటున్నాను. మీ నాన్న ఎంత ఒత్తిడి చేసినా అన్నయ్యకు విడాకులివ్వడానికి నువ్వు ఒప్పుకోలేదని తెలిసి చాలా సంతోషించాను. స్పోర్టివ్ డెసిషన్ వదినా! పెద్ద మనసు నీది. తప్పుల్ని క్షమించడం గూడా గొప్పతనమే" అన్నది అంజలి.

"ఇందులో నా గొప్పతనం ఏవుంది వదినా? ఈ వయసులో విడాకులు

## భలే భలే!

ఫ్రెంచి నవలా రచయిత్రి జార్జ్ సాండ్ ప్రతిరోజూ రాత్రి సమయంలో దాదాపు 20 పేజీలు రాసుకునేదట! ఆమె జబ్బు పడిన తన బామ్మగారికి రోజంతా సేవలు చేయడం వల్ల రాత్రివేళల్లో రాసుకునే అలవాటు చేసుకుందట! రాసిన కాపీలు తన దగ్గర లేకపోతే క్రితం రాత్రి ఏమి రాసిందో, తన రచనకు పెట్టుకున్న శీర్షికేంటో కూడా తెల్లారాక గుర్తుండేవి కావట!

ఎందుకు? నలుగురూ నవ్వుతారు. పిల్లల కోసం మేం కలిసి వుండాలి. ఆయన ఇంటికి వచ్చిపోతుంటేనే గౌరవం. అయినా తప్పంతా ఆయనదే కాదుగా? నాదీ ఉంది. ఆయనకు ఇష్టం లేని పనులు చాలా చేశాను" అంటూ కళ్ళు తుడుచుకుంది హేమలత.

"నువ్వు పెళ్ళికి రాకపోతే నా మీద ఒట్టే. నా కొడుకు పెళ్ళికి వస్తున్నావు అంతే. నా కోడలు అనాథ అని అన్నయ్య పెద్ద మనసుతో దత్తత చేసుకుని గౌరవం కల్పించాడు. కేవలం ఆ పిల్ల పెళ్ళి బాధ్యత తీసుకోవడానికే డాక్టర్ని పెళ్ళి చేసుకున్నాడు. అర్థం చేసుకో" అన్నది అంజలి.

హేమలత తల వూపి వూరుకుంది. ఏం మాట్లాడలేదు.

★ ★ ★

పెళ్ళికి రావడం ఇష్టంలేదని హేమలతను వదిలెయ్యలేదు కిరణ్‌రావు. తను హేమలత దగ్గరకు వెళ్ళి కూర్చున్నాడు.

"అమ్మాయ్! నువ్వు వస్తేగాని నేను బయల్దేరను" అంటూ మొండిగా కూర్చున్నాడు.

చేసేదేం లేక హేమలత బయల్దేరింది. వీళ్ళిద్దరూ కారు దిగిరావడం చూసిన సుబ్బారావు సంతోషించాడు.

"హేమా! ఇంత ఆలస్యం అయిందేం? పిల్లలంతా ఎప్పుడో వచ్చేశారు" అని పలకరించాడు సుబ్బారావు.

హేమలత ముభావంగా వుంది.

పెళ్ళికి వచ్చిన బంధుమిత్రులంతా వెన్నెలని సంభ్రమాశ్చర్యాలతో పరికించారు. ఎందుకంటే వెన్నెల అచ్చుగుద్దినట్టు డాక్టర్ మార్గరెట్ లాగా వుంది.

పెళ్ళితంతు ముగిసిన తర్వాత శ్రీరామ్, వెన్నెల దంపతులు కిరణ్‌రావు, అంజలి, సుబ్బారావు, మార్గరెట్‌లకు పాదాభివందనాలు చేశారు. కొత్త దంపతులను హేమలత దగ్గరకు తీసుకెళ్ళాడు కిరణ్‌రావు.

"వెన్నెలా! మీ పెద్దమ్మ" అని హేమలతను పరిచయం చేశాడు కిరణ్‌రావు.

వెన్నెల, శ్రీరామ్ ఆమె పాదాలు తాకుతుంటే హేమలత వుద్వేగంతో దుఃఖం ఆపుకోలేకపోయింది. కళ్ళు నీళ్ళతో నిండగా కొత్త దంపతులకు అక్షింతలు వేసి ఆశీర్వదించింది.

'పాపం హేమలత' అన్నట్టు అంతా ఆమెను జాలిగా చూశారు. ఎంత నరకం అనుభవిస్తున్నదో అనుకుని సానుభూతి చూపించారు. కిరణ్‌రావు, అంజలి ఆమెను ఓదార్చారు. అంజలి ఆమెను పట్టుకుని కుర్చీలో కూర్చోబెట్టింది. హేమలత కన్నీళ్ళు తుడుచుకుని యాంత్రికంగా కూర్చున్నది.

"ఇప్పుడు మీకొక సంగతి చెప్పాలి" అన్నాడు సుబ్బారావు అందర్నీ వుద్దేశించి.

"ఇంకేంటి చెప్పేది? " అన్నాడు కిరణ్‌రావు నవ్వుతూ.

"అన్నయ్య ఏదో కొత్త విషయం చెప్పదల్చుకున్నాడేమో? చెప్పనివ్వండి" అన్నది అంజలి.

ఆమె చాలా ఆనందంగా వుంది. కొడుకు ఒక అనాథ పిల్లను ప్రేమించానని చెప్పినప్పుడు దిగులు పడింది. వీడు ఎక్కడ గుళ్ళో పెళ్ళి చేసుకుని, పూలదండలు మెళ్ళో వేసుకుని సినిమాల్లో చూపించినట్టు ఇంటికి వచ్చి 'అమ్మా! ఇదుగో నీ కోడలు' అంటాడేమోనని హడలిపోయింది. అటువంటి ప్రమాదం జరగనందుకు సంతోషంగా వుంది. బంధుమిత్రుల సమక్షంలో వైభవంగా పెళ్ళి జరిగింది. అంతా సుబ్బారావు చొరవే.

"వెన్నెల మార్గరెట్ దత్తపుత్రిక అని మీరు అనుకుంటున్నారు. అంతేకాదు వెన్నెల ఆమె కన్నకూతురు గూడా!" చెప్పాడు సుబ్బారావు.

మార్గరెట్ ఉద్వేగంతో ఆనందబాష్పాలు రాల్చింది.

"వెన్నెలను తొలిసారి హాస్టల్లో చూసినప్పుడే ఆమె మార్గరెట్ కన్నకూతురని గ్రహించాను. మార్గరెట్ మల్లీశ్వరిగా కాకినాడలో ఎలా వుండేదో అచ్చంగా ఇప్పుడు వెన్నెల అలాగే వుంది. నేనే ప్రత్యక్ష సాక్షిని. వెన్నెల అనాథ పిల్లని మా అంజలికి ఏమూలో బాధగా వుందని నాకు తెలుసు. ఏం చేయాలో వెంటనే స్ఫురించింది. మార్గరెట్‌కి వెన్నెలను చూపించాను. పాస్టర్ అగస్టీన్ వెన్నెలను అనాథాశ్రమంలో చేర్పించాడని రుజువైంది. తల్లి బతికుండగా వెన్నెల అనాథ ఎలా అవుతుంది? వెన్నెలకు లీగల్‌గా తల్లిదండ్రులు అవడం కోసమే మేం సివిల్ మేరేజ్ చేసుకున్నాం" చెప్పాడు సుబ్బారావు.

అందరూ హర్షధ్వానాలతో పెళ్ళి మండపాన్ని మారుమోగించారు. అక్కడ అందరూ ఆనందంగా వున్నారు.

హేమలత మాత్రం ఆగకుండా కురుస్తున్న కన్నీళ్ళను తుడుచుకుంటూ వుంది. ఇంకా అక్కడ వుండి అందరి సానుభూతిని, జాలిని భరించే శక్తి లేక ఆమె అక్కడ్నుంచి లేచి నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ ఇంటికెళ్ళిపోయింది. ©

# మూడు సింగాల పురం!



తాజ్‌మహల్ భారతదేశాన్ని జ్ఞప్తికి తెప్పిస్తుంది. మరి సింగపూర్ అంటే మనకు గుర్తుకొచ్చేదేమిటి? ఆ దేశంలో ఉన్న మూడు వేర్వేరు సింహాల బొమ్మలు. అక్కడి మొదటిబొమ్మ మెర్‌లైన్ సింహం. ఇది సగం సింహం, సగం చేప. నోటిభాగం నుండి నీళ్ళు వదులుతూ సింగపూర్ నది మధ్యన నిర్మించిన ప్లాట్‌ఫాం మీద శ్వేత వర్ణంతో మెరిసిపోయే ఈ సింహమత్స్యపు బొమ్మ ప్రపంచవ్యాప్తంగా పర్యాటకులను ఆకర్షిస్తోంది. తెలుగు సినీపరిశ్రమ ఎన్నో పాటల చిత్రీకరణను ఇక్కడ చేసింది. సింగపూర్ అసలు పేరు సింహపుర. సింగం అంటే సింహం, పూర్ అంటే పురం అని అర్థం. 1970లలో సింగపూర్ పర్యాటకశాఖ ఓ లోగో రూపొందించాలని పోటీ నిర్వహించింది. అలెక్ ఫ్రేసర్ బ్రూనక్ అనే వ్యక్తి ఇప్పుడున్న సింహం నమూనా రూపొందించాడు. తెలివిగా అతను సింగకు చిహ్నంగా సింహంతలను, మిగతా భాగానికి తమ దేశ ప్రజల సాంప్రదాయిక వేటలో భాగమైన చేపను వాడుకున్నాడు. మత్స్యకన్యను ప్రేరణగా తీసుకుని తలలేని చేపమొండేనికి సింహంతలను జోడించాడు. టూరిజం బోర్డు బ్రూనక్ నమూనాను ఆమోదించింది. అలా సింహం బొమ్మ ఆ దేశ చిహ్నంగా మారింది. 1972లో దీన్ని సింగపూర్ నది ఒడ్డున ఏర్పాటు చేశారు. ఆనాటి ప్రారంభోత్సవ సభలో ప్రధాని లీకువాన్ యూన్ 'వెల్‌కమ్ ఆల్ విజిటర్స్ టు సింగపూర్' అని పిలుపునిచ్చాడు. అప్పటి నుండి సింగపూర్‌కు పర్యాటకుల తాకిడి ఎక్కువయింది. 2002 సెప్టెంబర్ 15న ఈ బొమ్మను సింగపూర్ నది ఒడ్డు నుండి మెరీనా సముద్రపాయలో పుల్లర్‌టన్ హోటల్ సమీపానికి తరలించారు. అక్కడే పార్కు, బొమ్మ చుట్టూ సముద్రవిహారానికి బోట్లు ఏర్పాటు చేసారు. ఈ బొమ్మ ఎత్తు 8.6 మీటర్లు. దీని నోటి నుండి వచ్చే నీరు సుమారు 15మీటర్ల దూరంలో పడుతుంది.

మెల్లమెల్లగా సింగపూర్ సింహ-మత్స్యపు బొమ్మకు ప్రపంచవ్యాప్తంగా పేరొచ్చింది. దాంతో వ్యాపారులు ఈ చిహ్నాన్ని విచ్చలవిడిగా తమ ప్రచారంకోసం వాడుకోసాగారు. అందువల్ల టూరిజంబోర్డు ఈ చిహ్నం వాడకంపై ఆంక్షలు విధించింది. ప్రసిద్ధిచెందిన ఈ సింగపూర్ సింహంబొమ్మలో మగలక్షణాలు కనిపించవు. ఈ లోటును తీర్చటానికన్నట్లు మరొక సింహపు బొమ్మ నిర్మాణం జరిగింది. సంతోషా అనే ఓ ప్రయివేట్ పర్యాటక సంస్థ ఏకంగా 37 మీటర్ల ఎత్తైన సింహం బొమ్మను ఓ పర్వతం మీద ఏర్పాటు చేసింది. ఇది కూడా సగభాగం చేప ఆకారంలోనే ఉంటుంది. అయితే ముఖంలో గంభీర మగ సింహ లక్షణాలు కనిపిస్తాయి. ఈ బొమ్మను చూడగానే జూలు విదిల్చిన సింహం అంటే ఇదేననిపిస్తుంది. దీన్ని చెక్కేటప్పుడు సుకుమారం కంటే గాంభీర్యానికి ప్రాధాన్యమిచ్చారు. కళ్ళు అగ్ని గోళాల్లా మెరిసేలా చేసారు. కోరలు కూడా చాలా దూరం కనిపిస్తాయి. లిఫ్ట్ ద్వారా చేప తోక భాగం నుండి సింహం నోటిలోకి వెళ్ళి కోరల మధ్య నుండి సింగపూర్ పర్యటన కేంద్రాల సౌందర్యాన్ని వీక్షించవచ్చు. ఈ బొమ్మ చుట్టూ పార్కు అలరిస్తుంది. ఈ బొమ్మను పరీక్షగా చూస్తే సింగపూర్ నగరాన్ని పరిరక్షించటానికి రక్షక సింహాన్ని ప్రతిష్ఠించినట్లు ఉంటుంది. ఈ మృగరాజు రాజసాన్ని చూసే ఆ దేశ ఖజానా విభాగం వారు తమ కరెన్సీ నోట్లపై ఈ సింహపు బొమ్మ నమూనానే ముద్రించారు.

సింగపూర్‌లో మూడో సింహం కూడా ఉంది. అయితే దీనిని సింహం అనే కంటే సింహంపిల్ల అనటం సబబు. అందుకే దీని పక్కనే మెర్‌లైన్ కబ్ అని బోర్డు పెట్టారు. దీని ఎత్తు రెండు మీటర్లు. దీని పక్కనే నిలబడి ఫోటోలు తీసుకోవచ్చు. ఈ బొమ్మ చిరునవ్వులు చిందిస్తున్నట్లు ఉంటుంది. మెర్‌లైన్‌పార్కులోకి ప్రవేశించగానే ఇది దర్శనమిస్తుంది. అందుకే సింగపూర్ వెళితే ఒకటి కాదు మూడు సింహాల్ని చూస్తారు.

**– పుట్టా సోమన్న చౌదరి**

పెద్దకథ

రష్యన్ మూలం :
మరీయా ప్రిలెజాయెవా

# ప్రవాసం

అనువాదం, విస్తరణ:
ఎన్.వి. ఎస్. నాగభూషణాచార్యులు

అది 1907వ సంవత్సరం, డిసెంబరు మొదటివారం. ఫిన్లాండ్ ముఖ్యపట్టణం 'హెల్సింగ్ ఫార్జ్'కి డెబ్భైమైళ్ల దూరంలోగల ఒక మారుమూల పల్లెటూరు. అది ఎంత పల్లెటూరయినా, అక్కడో తోళ్ల కర్మాగారం ఉండటంతో ఊళ్లో కాస్త హడావిడి ఉంటుంది. ఆ ఊరికి ప్రతిరోజూ హెల్సింగ్ ఫార్జ్ నుంచి టపాబండి వస్తుంది. అందులో ప్రయాణికులొకరిద్దరు వస్తుంటారు.

ఆకాశంలో దట్టంగా మబ్బులు కమ్ముకున్నాయి. మంచుతునకలు పూలజల్లులా రాలిపడుతున్నాయి. ఆ ఊరికిగల ఒకే ఒక్క ప్రధాన వీధి నిండా మంచు పేరుకుని బురద బురదగా తయారయింది. అప్పుడే టపాబండి వచ్చి పోస్టాఫీసు దగ్గర ఆగింది. ఆ రోజు అందులోనుంచి ఇద్దరు ప్రయాణికులు దిగారు. అందులో ఒకరు ముసలిరైతు గొరెమీకిన్. హెల్సింగ్ ఫార్జ్‌లో ఉన్న కూతురింటికి వెళ్లి వస్తున్నాడు. ఆయన అల్లుడు అక్కడ ఒక చిన్న రొట్టెల దుకాణాన్ని నడుపుతున్నాడు. కూతురు ఇచ్చిన రొట్టెలతో నిండిన సంచిని చేతికి తగిలించుకుని ఊగుకుంటూ నడుస్తూ ఇంటికెళుతున్నాడు గొరెమీకిన్.

ఆయనతోపాటు బండి దిగిన ప్రయాణికురాలు ఆ ఊరికి కొత్తలా వుంది. రోడ్డు మీదికి వచ్చి, ఎటువెళ్లాలో తెలీక తటపటాయిస్తూ అలాగే నిలబడి వుండటం చూసి గొరెమీకిన్ "ఎవరింటికి వెళ్లాలమ్మా?" అంటూ పలకరించాడు ఆమె ముఖాన్ని పరిశీలనగా చూస్తూ. ప్రయాణమంతట్లోనూ ఆమె చలికా అన్నట్లు కోటుపైకూడా చిన్నదుప్పటి కప్పుకునే ఉంది. ఇప్పుడు తలపైన దుప్పటి లేకపోయినా, బొచ్చు టోపీ ముఖంపైకి లాక్కోవడం వల్ల ఆమె ముఖం సరిగ్గా కనపడలేదు. అయినా ఆమె అందగత్తేనన్నట్లు రూపురేఖలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. నవయవ్వనవతి కాకపోయినా ఆరోగ్యంగా, బలంగా, చక్కని శరీర ఆకృతితో యువతిలానే కనబడుతోంది. ఏమైనా ముసలాయన పలకరింపుకి ఆమె తెప్పరిల్లి, తోళ్ల కర్మాగారంలో పనిచేసే కార్మికుడు కుజ్నెత్సిన్ గారింటికి వెళ్లాలని చెప్పింది.

"కుజ్నెత్సిన్ నా మేనల్లుడే. వాడు నీకేమవుతాడమ్మా?" చనువుగా అడిగాడా ముసలాయన. తను అతని భార్యతరపు బంధువునని చెప్పిందామె. పేరేమిటని అడిగితే, 'నతాషా' అన్నది.

"సరే, నాతోపాటు రామ్మా. మా ఇంటి పక్కే వాడిల్లు" అంటూ దారితీశాడు గొరెమీకిన్.

ఆరోజు సెలవు కావడంవల్ల కుజ్నెత్సిన్ ఇంటి దగ్గరే ఉన్నాడు. ముసలాయన అతణ్ణి కేకేసి, ఇంటికి ఎవరో బంధువు వచ్చినట్లు చెప్పేడు. దాంతో 'బంధువా?'

అంటూ బయటికొచ్చిన కుజ్నెత్సిన్ ఆమె వంక అనుమానంగా చూశాడు. ఎంత గుర్తుతెచ్చుకున్నా ఆమె ఆనవాలు పట్టలేక పోయాడు.

అందువల్ల ఏమాత్రమూ మర్యాద పాటించకుండా "మిమ్మల్నెక్కడా చూసి నట్లు లేదే? ఏ ఊరు మీది? ఎలా బంధువులవుతారు?" అంటూ ప్రశ్నలపై ప్రశ్నలు కురిపించాడు.

ఎంతోదూరం నుంచి వచ్చిన తనను అతడలా కనీస మర్యాద ప్రదర్శించకుండా అలా నిలబెట్టే మాట్లాడుతున్నా, నతాషా మాత్రం పట్టించుకోకుండా, తన పక్కనే వింతగా చూస్తున్న ముసలాయనకు తెలీ కుండా ఒక విచిత్రమైన సంజ్ఞ చేసింది.

ఆ తర్వాత "మీరు నన్నెప్పుడూ చూడలే దులెండి. మీ ఇంటికి నేనెప్పుడూ రాలేదు. ఉద్యోగరీత్యా దూరప్రాంతం నుంచి మొన్ననే హెల్సింగ్‌ఫార్జ్ వచ్చాను. అక్క డ్నుంచి మా పిన్నికూతుర్ని, అదే మీ ఆవిణ్ణి చూద్దామని పనిగట్టుకునివచ్చాను" అంటూ అతని సంగతి పట్టించుకోకుండా చొరవగా ఇంట్లోకి వెళ్లింది.

ఆ సంజ్ఞను అర్థం చేసుకున్న కుజ్నెత్సిన్ "అలాగా? నాకు తెలీదు.. క్షమించండి" అంటూ ఆమె వెనకే లోపలికి వెళ్లేడు.

దాంతో ఆ ముసలాయన తనదారిన తను వెళ్లాడు.

ఆ ఆగంతకురాలి వెనకే లోపలికొచ్చిన కుజ్నెత్సిన్, ఆమెను ముందు వసారాలో ఒక కొయ్యకుర్చీలో కూర్చోబెట్టాడు.

ఆమె కూర్చున్నాక "ఇప్పుడు చెప్పండి.. ఎవరు మీరు? ఎందుకొచ్చారు?" అన్నాడు.

"నా పేరు నతాషా. మీ అతిథి 'అలెక్సీ' గారిని కలుసుకునేందుకు వచ్చాను" అందామె.

"అలాంటి పేరుగల వారెవరూ అతిథు లుగా మా ఇంట్లో లేరే! మీరు పొరబ డ్డారు. ఎవరి ఇంటికో వెళ్లబోయి, మా ఇంటి కొచ్చినట్లున్నారు" అన్నాడు కుజ్నెత్సిన్, ఎలాంటి తొట్రుపాటు లేకుండా.

ఆమెకు ఇలాంటి వ్యవహారాలు మామూలే అయినట్లుంది. అందువల్ల ఏమాత్రం తొణక్కుండా "అలా అంటారా? ఇంతకీ మీరు కుజ్నెత్సిన్‌గారేనా? మీ ఇంటి పేరు, తండ్రిపేరు ఫలానాయే కదా?" అని అడిగింది.

దానికి అవునన్నాడతను.

"సరే, అయితే నేనిక్కడే కొంతసేపు కూర్చుంటాను. మళ్లీ బండి ఓ గంటలో తిరుగు ప్రయాణమవుతుంది. నేనందులో హెల్సింగ్‌ఫార్జ్‌కు వెళ్ళిపోవాలి. అలెక్సీగారు మీ ఇంట్లో షెల్టర్ తీసుకుంటున్నట్లు నాకు తెలుసు. మీరు వెళ్లి ఆయనతో చెప్పండి, తనని కలుసుకోవడానికి నతాషా వచ్చిం దని. ఆలస్యం చెయ్యకండి.." అంటూ తొందర పెట్టిందామె.

"మీరేమిటో చెబుతున్నారు. మీరు చెప్పిన చిరునామా నాదే కానీ, అలెక్సీ అనే ఆయన సంగతి మాత్రం నాకు తెలీదు. ఒకవేళ మా మేనమామకు తెలుసేమో ఒకసారి ఆయన్ని కనుక్కొని వస్తాను. అం తవరకూ మీరిక్కడే కూర్చోండి" అంటూ కుజ్నెత్సిన్ ఆమె జవాబుకోసం ఎదురుచూ

## కొత్తగాలి...

**ఢిల్లీలో ఉల్లి వందైతే**
**మరి.. గల్లీల్లో**
**పాయల్ని కొనే భాగ్యమెందరికో?**
**ఇష్టాల్లో కష్టాలు ఇవే మరి!**

– పెన్మెత్స సూరిబాబు,
హైదరాబాద్

డకుండా, పక్కింటికెళ్లినట్లు వెళ్లాడు.

అటునించి దొడ్డిదోవన తన పెరట్లోకి వచ్చాడు. తర్వాత వంటింట్లోగల అటకవద్దకు వెళ్లాడు. దానిమీద రహస్యంగా షెల్టర్ తీసుకుంటున్న అలెక్సీకి ఈ విషయం చెప్పాడు.

"ఫర్వాలేదు, ఆమె మన కామ్రేడే. వెంటనే తీసుకురండి" అంటూ కుజ్నెత్సి న్‌ను పురమాయించాడు అలెక్సీ.

తను అటక మీద చేస్తున్న రాతపని పక్కనపెట్టి, నిచ్చెన వేసుకుని కిందకు దిగి వచ్చాడు.

ప్రయాణంవల్ల అలసి, దుమ్ము కొట్టుకుపోయి, వాడిన మల్లెపువ్వులా కనిపించింది నతాషా. ఆమెను కలిసి చాలారోజులవడం వల్ల ఉద్వేగంతో ఆమెను కౌగిలించుకుని కుశల ప్రశ్నలడిగాడు అలెక్సీ. అయితే తన పక్కనే కుజ్నెత్సిన్ ఉండటాన్ని గమనించనందుకు ఒక్కక్షణం సిగ్గుపడి "తప్పుగా అర్థం చేసుకోకు కామ్రేడ్! ఈమె నా భార్యే. నాలాగానే పార్టీలో పనిచేస్తోంది" అన్నాడు.

కుజ్నెత్సిన్ బొమ్మలా నిలబడి ఇదంతా చూస్తున్నవాడు కాస్తా తెప్పరిల్లి మందహాసం చేశాడు. ఆపై నతాషాను మెచ్చుకోలుగా చూసి అభినందనలు చెప్పాడు. ఇంకేవేవో ప్రశ్నలు ఆమెను అడుగుదామని నోటిదాకా వచ్చాయిగానీ, పార్టీ క్రమశిక్షణ సంగతి గుర్తొచ్చింది. వారిని మాట్లాడుకుంటూ వుండమని, టీ తెస్తానని అన్నాడు. అలాగే మరికాసేపట్లో భోజనం కూడా సిద్ధమవుతుందని చెప్పి వెళ్లిపోయాడు.

అప్పటికి కొంత స్థిమితపడిన నతాషా, అలెక్సీని ఉడికించేందుకు కొంచెం పరిహాసం నిండిన గొంతుతో "ఇల్యీచ్, నీకు సి.సి.(సెంట్రల్ కమిటీ) ఒక తాఖీదు పంపింది సుమా!" అంది.

"తాఖీదా? ఏమిటది నదేజ్దా?" కనుబొమలు ముడివేసి ప్రశ్నించాడు అలెక్సీ.

ఆమె వెంటనే తన దగ్గర రహస్యంగా దాచిన కాగితాల్లోంచి ఓ ఉత్తరాన్ని ఆయనకు అందించి "నువ్వు ప్రమాదభరితమైన ఫిన్లాండ్‌ను కూడా వదిలేసి తక్షణం విదేశాలకు వెళ్లిపోవాలి! అక్కడ నువ్వు సురక్షితంగా ఉంటూ పార్టీని నడపాలి. అలాగే ప్రొలెతారియ్ పార్టీపత్రికని కూడా అక్కణ్ణుంచే ప్రచురించాలి. తెలిసిందా?" అంది కొంటెగా నవ్వి.

"ప్రమాదమనేగా నేను హెల్సింగ్ ఫోర్జ్‌ని కూడా వదిలేసి, ఈ మారుమూల కుగ్రామంలో ఉండటం! మళ్లీ ఇప్పుడు విదేశాలకా?" అన్నాడు, ఆమె వేళాకోళాన్ని పట్టించుకోకుండా, ఆ ఉత్తరాన్ని మడిచి జేబులోకి పెట్టుకుంటూ.

"అవును. ఇది సి.సి. ఏకగ్రీవ నిర్ణయం! దీన్ని నువ్వు తప్పక పాటిస్తావని తెలుసు. నీ ప్రాణాలు పార్టీకి, విప్లవానికి ఎంతో అమూల్యమైనవి ఇల్యీచ్! నువ్వు తక్షణం వీలైతే రేపే హెల్సింగ్ ఫోర్జ్ వెళ్లి, అక్కణ్ణుంచి రైల్లో 'అబో' రేవు పట్టణం చేరుకోవాలి. అక్కడ రేవు కార్మికుడు కామ్రేడ్ గ్లుష్‌కోవ్‌ను నువ్వు 'బొగొయ్‌చూక్' పేరుతో కలుసుకోవాలి. అతడే నిన్ను సురక్షితంగా స్టాక్‌హోమ్ వెళ్లే పాసింజర్ స్టీమర్‌లో ఎక్కిస్తాడు. 'బొగొయ్‌చూక్' పేరుతోనే నీ పాస్‌పోర్టు తయారై ఈపాటికి అతనికి చేరి వుంటుంది. ఇదుగో గ్లుష్‌కోవ్ చిరునామా.." అంటూ ఆమె ఒక చిన్న కాగితంమీద అడ్రస్ రాసిచ్చింది.

అలెక్సీ ఆ కాగితాన్ని ఒకటికి రెండుసార్లు చదివి, మననం చేసుకుని చిన్నచిన్న ముక్కలు చేసి పొయ్యిలో పడేసి వచ్చాడు.

అన్యమనస్కంగా "సరే, కేంద్ర కమిటీ నిర్ణయాన్ని పాటించక తప్పదు కదా!" అంటూ అంగీకరించాడు.

ఇంతలో కుజ్నెత్సిన్ భార్య వచ్చింది.

తమ ఇంటికొచ్చిన అతిథిని పలకరించింది. తను తెచ్చిన రెండు టీ కప్పులు అక్కడపెట్టి వెళ్లిపోతూ, మరొక అయిదు నిమిషాల్లో భోజనం సిద్ధమవుతుందని చెప్పింది.

"మరి నువ్వెప్పుడొస్తావ్ స్వీడన్‌కు? " ఇల్యీచ్ ప్రశ్నించాడు.

"నువ్వు స్టీమరు ఎక్కినట్లు నిర్ధారణ చేసుకున్నాక, నేను బయలుదేరి వస్తాను. నిన్ను స్టాక్‌హోమ్‌లో కలుసుకుంటాను.. స్వీడిష్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీ ఆఫీసులో!" జవాబిచ్చింది నదేజ్దా.

రెండు క్షణాలాగి "టపా తెచ్చాను. జవాబులు రాయాల్సి వుంటే త్వరగా రాయి. నేను టపాబండిలో తిరిగి వెళ్లిపోవాలి" అని అందామె మళ్ళీ తనే.

"ఇంకోగంటలో బండి ఉందని తెలుసు కదా!" అంటూ అతనికి కొన్ని వార్తాపత్రికల నుండి సేకరించిన కటింగులు అందించింది.

అవి 'కాడెట్ల'కు చెందిన పత్రికల కటింగులు. 'కాన్‌స్టిట్యూషనల్ డెమోక్రాట్లు' అన్న పదాల మొదటి అక్షరాలతో 'కాడెట్' అనేది వచ్చింది. ఉదారవాద బూర్జువాలకు చెందిన పార్టీ అది. ప్రారంభంలో జార్ పాలనలో సంస్కరణలు కోరిన ఆ పార్టీ, క్రమేణా సామ్రాజ్యవాదుల పక్షాన చేరి విప్లవ ప్రతీఘాతకంగా తయారయింది. అనుమానించదగ్గవేవీ వాటిలో పైకి కనిపించవు. కానీ అచ్చు పంక్తుల మధ్య కనిపించని సిరాతో రాసిన అక్షరాలుంటాయి.

"సరే, నేను వీటిని చదివి సమాధానాలు రాస్తాను. దానికి కొంత సమయం పడుతుంది. నువ్విప్పుడు భోజనం చేసి త్వరగా బయలుదేరాలి కదా! ఈలోగా రాయడం పూర్తయిన వాటిని నీకిస్తాను. మిగిలిన వాటిని గ్లుష్‌కోవ్‌కిస్తాను. అతని దగ్గర నువ్వు తీసుకో. మరో విషయం 'ప్రొలెతారియ్' సంచిక తయారయింది. దాన్ని కూడా తీసుకెళ్లు. ఇక నువ్వు భోజనం చెయ్యి. నేను నా పని మొదలెడతాను" ఇల్యీచ్ అటక మీదికెళ్లి తన రాతపనికి ఉపక్రమించాడు.

నదేజ్దా వంటింట్లో చేరి సుష్టుగా తినసాగింది.

కొద్దిసేపట్లోనే నదేజ్దా భోజనం ముగించి, తనక్కావలసినవి సర్దుకుంది. బయలుదేరబోతూ ఇల్యీచ్ వద్ద వీడ్కోలు తీసుకుంది. "జాగ్రత్త ఇల్యీచ్! నీకు పదే పదే చెప్పనవసరం లేదనుకో. నిన్ను నిర్బంధించేందుకోసం ఒక బహిరంగ ఆదేశం జారీ చేసిన సంగతి తెలిసే వుంటుంది. నువ్విప్పుడు జార్‌కి అందరికన్నా ఎక్కువగా కావలసినవాడివి. జార్ కుక్కలు అంగుళం అంగుళమూ నీకోసం రష్యాలోనే కాదు, ఫిన్లాండులోనూ గాలిస్తున్నాయనేది నీకు తెలుసు గదా! ఒకవేళ అరెస్టే గనుక జరిగితే, అది జైలుశిక్షకే పరిమితం కాబోదని తెలిసిన సంగతే కదా! ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా ఒక్కోసారి ఎవరమూ ఏం చెయ్యలేమనుకో! అయినా పదే పదే చెప్పడం ఎందుకంటే.." గద్గద స్వరంతో ఆగిపోయిందామె.

"విచారించకు నదేజ్దా! నా జాగ్రత్తల విషయంలో బెంగపడకు. మనం తప్పక స్టాక్‌హోమ్‌లో కలుసుకుంటాం! రష్యా విముక్తిని తప్పక సాధిస్తాం! విప్లవం వర్ధిల్లాలి!" పిడికిలి బిగించాడు ఇల్యీచ్.

"విప్లవం వర్ధిల్లాలి!" తనూ పిడికిలి బిగించింది. మరొక్కసారి ఇద్దరూ కౌగిలించుకుని క్షణంలో విడిపోయారు.

నదేజ్దా ఆ ఇంటి నుండి బయటికి వచ్చి రహదారి వెంట వేగంగా నడవసాగింది.

పాఠకులు ఈసరికి మొదట పేర్కొన్న అలెక్సీ వాస్తవానికి అలెక్సీ కాదని.. ఇల్యీచ్ అనీ, అలాగే నతాషా నిజానికి నతాషా కాదని.. ఆమె అసలు పేరు నదేజ్దా అని గ్రహించే ఉంటారు. ఇల్యీచ్



అంటే ఎవరో కాదు, రష్యన్ సోషల్ డెమోక్రాటిక్ లేబర్ పార్టీ నాయకుడిగా ప్రసిద్ధికెక్కిన లెనిన్. ఆయన పూర్తిపేరు 'వ్లదిమీర్ ఇల్యీచ్ లెనిన్'. అలాగే నదేజ్దా అంటే లెనిన్‌భార్య. ఆమె పూర్తిపేరు 'నదేజ్దా కొన్ స్తంతీనొవ్నా క్రూప్‌స్కయా'. ఇక్కడినుంచి ఇల్యీచ్ పేరును లెనిన్‌గానే ఇవ్వడమైనది.

ఇక కథా సందర్భం ఏమంటే.. రష్యాలో పరమ నిరంకుశంగా పాలన సాగిస్తున్న జార్ ప్రభుత్వపు దారుణ అణచివేతను, బూర్జువా, భూస్వాముల దోపిడీని భరించలేక రైతాంగం అండతో శ్రామికవర్గం సాగించిన సార్వత్రిక రాజకీయ సమ్మె సాయుధ పోరాటంగా మారింది. అది 1905-07ల మధ్య రెండున్నరేళ్లకుపైగా వీరోచితంగా కొనసాగి, చివరికి ఓటమికి గురైంది.

విప్లవం ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడు విప్లవకారులపైకి సైన్యాన్ని ఫిరంగుల సాయంతో మోహరించి దారుణంగా అణచివేస్తూనే, మరోవైపు ప్రజల్లో చీలిక తెచ్చేందుకు మోసపూరిత ప్రజాస్వామిక వాగ్దానాలు గుమ్మరించింది జార్ ప్రభుత్వం. అంతేకాదు, జపాన్‌తో సంధి చేసుకుని, విదేశీ సామ్రాజ్యవాదుల సహాయం పొంది మరింత బలం పుంజుకుంది. దీంతో ఇనుమడించిన పాశవికతతో విరుచుకుపడి వేలాది విప్లవకారుల్ని ఊచకోత కోస్తూ, అమాయకుల్ని బందీలుగా పట్టుకుంటోంది. వారిపై దారుణ హింసాకాండ అమలు జరుపుతూ మంత్రి స్టోలీపిన్ బాటలో ప్రగతి నిరోధక పాలన సాగిస్తోంది. దీనికితోడు 'బ్లాక్‌హండ్రెడ్స్' అనే పేరుగల భూస్వాముల సాయుధ రౌడీమూకల దుశ్చర్యలు పెట్రేగిపోయాయి!

విదేశాల్లో ప్రవాస జీవితాన్ని గడుపుతున్న లెనిన్, స్వదేశంలో వివిధ పార్టీల ఆధ్వర్యంలో సాగుతోన్న విప్లవోద్యమానికి తగిన సూచనలూ సలహాలు ఇచ్చేందుకు, ఉద్యమాన్ని సమన్వయం చేసేందుకు మాతృదేశానికి వచ్చి తనవంతు కృషి చేశాడు. కానీ కొన్ని కారణాల వల్ల రెండున్నరేళ్ల పాటు కొనసాగిన విప్లవపోరాటం తాత్కాలికంగా ఓటమికి గురైంది. అలాంటి స్థితిలో ఆయన రష్యాకు ఎడంగా ఉన్న ఫిన్లాండులోని హెల్సింగ్‌ఫార్జ్‌లో, అనంతరం అక్కడ్నుంచి

దూరంగా ఉన్న ఆ మారుమూల పల్లెలో రహస్య జీవితం గడుపుతూనే కార్యక్రమాలు కొనసాగిస్తున్నాడు. ఆ తర్వాతేం జరిగిందో చూడండి!

★ ★ ★

హెల్సింగ్‌ఫోర్జ్ నుంచి అబోకి ఎక్స్‌ప్రెస్ రైలు వేగంగా వెడుతోంది. అబో స్టేషను ఇంకా చాలాదూరం ఉన్నందువల్ల ప్రయాణికులు ఎవరి కాలక్షేపాల్లో వారు మునిగిపోయి వున్నారు. మంచు దట్టంగా కురుస్తుండడంతో అన్ని పెట్టెల్లోనూ కిటికీ రెక్కలు మూసేసి ఉన్నాయి.

లెనిన్ కూర్చున్న కంపార్టుమెంట్ అంత రద్దీగా లేదు. కేవలం నలుగురు ప్రయాణికులే ఉన్నారు. లెనిన్‌కి ఎదురుగా ఓ

**కొత్తగాలి...**

**సేదదీర్చే పిల్లగాలి**
**సూక్తులైన కొత్తగాలి**
**నీకు స్ఫూర్తిగా వెలగాలి**
**నిత్యసత్యమై నిలవాలి**

– పి. హైమవతి,
దండేపల్లి, ఆదిలాబాద్ జిల్లా

భార్యాభర్తల జంట కూర్చుని కాలక్షేపానికి కార్డులు ఆడుకుంటున్నారు. వారి పక్కన ఒక వ్యక్తి సీరియస్‌గా పేపర్ చదువుకుంటున్నాడు.

కిటికీ పక్కగా కూర్చున్న లెనిన్ మూసి ఉన్న కిటికీ అద్దంలోంచి బయటకు చూస్తున్నాడన్న మాటేగానీ, ఆయన మనస్సు వేరే ఆలోచనలతో నిండిపోయి వుంది. విప్లవం ఓడిపోయింది, నిజమే. విప్లవంలో పాల్గొన్న వర్గాలన్నీ తీవ్రంగా నష్టపోయాయి. అదీ నిజమే. అంతమాత్రానికే, పార్టీలో మైనారిటీలైన 'మెన్షివిక్కులు' (మితవాదులు) చెప్పినట్లు కార్మికులు ఆయుధధారణ చేయడమే ఇంత నష్టానికి కారణమా? లేదు, లేదు. అలా భావించడం సరికాదు. ఏ విప్లవమైనా కష్టనష్టాలు లేకుండా జరుగుతుందా? దాదాపు రెండున్నరేళ్లపాటు సాగిన ఈ విప్లవం సామ్రాజ్యవాదయుగంలో జరిగిన మొదటి విప్లవం! ఈ మొదటి విప్లవం అసంఖ్యాక ప్రజల విప్లవంగా అభివృద్ధి చెందడమే బోల్షివిక్ ఎత్తుగడలు సరైనవనడానికి రుజువు.

బోల్షివిక్కులంటే మెజారిటీ విప్లవవాదులని అర్థం. లెనిన్ వీరికి నాయకుడు. అంతేకాదు, ఈ విప్లవోద్యమంలో ప్రపంచ చరిత్రలోనే మొదటిసారిగా కార్మికవర్గానికి, రైతాంగానికీ మధ్య బలమైన కూటమి ఏర్పడింది. ఇంకా చెప్పాలంటే కార్మికవర్గం ప్రజలకు నాయకత్వం వహించటం కూడా అదే మొదటిసారి. మొదటి అడుగులోనే కార్మికవర్గం తన నాయకత్వ పటిమను రుజువు చేసుకుని వీరోచితంగా పోరాడింది కూడా!

ఒక్కసారిగా కిలకిలమని నవ్వులు వినపడ్డంతో తన ఆలోచనలకు భంగం కలిగింది. ఎదుటి సీట్లవైపు దృష్టి సారించాడు లెనిన్. పేకాటలో భార్య గెలిచినట్లుంది. ఆమె తన చేతిలోని ముక్కల్ని సీటుపై పరచి విజయగర్వంతో భర్తను ఎగతాళి చేస్తూ "చూశావా, సునాయాసంగా నన్ను ఓడించేస్తానని నువ్వే ఓడిపోయావు!" అంటూ అమిత సంతోషంతో చప్పట్లు కొడుతోంది.

అయితే భర్త తన ఓటమిని ఒప్పుకోనట్లు, చేతిలోని పేకను అలానే పట్టుకుని "నువ్వు మోసం చేసి గెలిచావు. ఈసారి చూద్దాం, ఎవరు గెలుస్తారో?" అంటూ పేకను కింద పడేసి, మళ్లీ అంతా కలిపి, ముక్కలు పంచడం మొదలుపెట్టాడు.

ఈ తమాషాను చూసేందుకు నడవా పక్కనున్న సీట్లో కూర్చుని పత్రిక చదువుతోన్న వ్యక్తి, అందులోంచి మొహం బయట పెట్టి, ఆ దంపతుల వంక రెండు క్షణాలు చూసి, మళ్లీ పత్రికలోకి తల దూర్చేశాడు.

తిరిగి కిటికీవైపు దృష్టి సారించాడు లెనిన్. మంచు ఏకధాటిగా పూలజల్లులా పడుతూనేవుంది. మంచుతో నిండిపోయిన పొలాలన్నీ కలిసిపోయి మైదానంలాగ ఏక మొత్తంలా కనబడుతున్నాయి. చెట్లూ చేమలూ కూడా మంచుతో నిండి, తమ ఆకారాన్ని కోల్పోయి, తెల్లని జడలభూతాల్లా దర్శనమిస్తున్నాయి. తిరిగి ఆయన కళ్లు చూడటం మానేశాయి. మెదడు ఆలోచనల వైపు మళ్లింది.

తను ఎన్నో ఆశలు పెట్టుకున్న ఈ విప్లవం ఎందుకు ఓడిపోయింది? సీట్లో ఏదో ఇబ్బంది అనిపించి, సర్దుకుని కూర్చున్నాడు లెనిన్. జారిజాన్ని దెబ్బతీసేంత శక్తిమంతంగా విప్లవదాడి లేకపోయింది. మెన్షివిక్కులు కార్మిక శ్రేణుల్లో చీలికలు తెచ్చారు. వీటికి తోడు కార్మిక పోరాటాల్లో సమన్వయం లేదు. విప్లవ పోరాటాలు చెల్లాచెదురుగా సాగాయి. ఇక విప్లవంలో రైతాంగం కలిసి వచ్చినప్పటికీ వారి చర్యలు పలచగా సాగాయి. అంతేగాక వాటిలో వ్యవస్థీకరణగానీ, పట్టుదలకానీ లేవు. ఎక్కువమంది రైతులు రాజకీయంగా బాగా వెనకబడి వున్నారు. వారిలో ఇంకా 'చిన్నతండ్రి' పట్ల నమ్మకం పోలేదు. రష్యా ప్రజలు దేవుడిని తమ పెద్దతండ్రిగా, జార్‌ని చిన్నతండ్రిగా భావిస్తారు. 'డ్యూమా' (శాసనసభ) తమ ఇబ్బందులు తీరుస్తుందనీ ఆశించారు. కానీ ఆ చిన్నతండ్రి సంపన్నవర్గాల సీట్లను వారి జనాభా నిష్పత్తికన్నా ఎన్నో రెట్లు అధికంగా పెంచేశాడు.

మరోవైపు నానాజాతుల రాజ్యంగా పేరొందిన రష్యాలో తొలిసారిగా విప్లవం పేరుతో పీడితజాతుల మధ్య సామరస్యం నెలకొంటున్నది. సైన్యంలో కూడా కొంతవరకు ప్రభుత్వ వ్యతిరేకత ఏర్పడింది. కాని.. కాని.. అంతా తలకిందులైంది.

లెనిన్ ఆలోచనా ప్రవాహానికి ఒక్కసారిగా అడ్డుకట్ట పడింది. కిటికీవైపుగా తల పెట్టి ఆలోచిస్తున్న ఆయనకు ఎందుకో అనుమానం వచ్చింది. తను కూర్చున్న కోణంలో ఎలాంటిమార్పు చేయకుండానే అతినెమ్మదిగా తలను కొద్దిగా ఎడమవైపుకు తిప్పి, క్రీగంటితో నడవా పక్కనున్న సీటులో కూర్చున్న వ్యక్తివైపు చూశాడు. పత్రిక చదువుతున్నట్లు నటిస్తోన్న ఆ వ్యక్తి పత్రికపైనుంచి కళ్లజోడులోంచి తన కదలికల్నే గమనిస్తున్నాడు.

దాంతో అతన్ని కొద్దిగా ఆటపట్టిద్దామని కిటికీనుండి ఎడమవైపుకి తిరిగి, అతన్ని చూసి ఓ చిరునవ్వు విసిరాడు లెనిన్. ఈ అనుకోని పరిణామానికి ఆ వ్యక్తి గాబరాపడ్డాడు. ఎందుకైనా మంచిదని లేచి నిలబడ్డాడు. చదువుతున్న పత్రికను తను కూర్చున్న సీటుపై పడేసి, పక్కన పేకాట ఆడుతున్న వ్యక్తితో ఇప్పుడే వస్తానని చెప్పి నడవాలోకి వెళ్లాడు. కొద్దిసేపు నడవాలో ఓ పక్కగా నిలబడే కంపార్టుమెంటుకు గల గాజుపలకనుండి ఆ వ్యక్తి తననే గమనిస్తుండటం తలవంచుకుని కూర్చున్న లెనిన్ గ్రహించాడు. మరి కాసేపటికి ఆ గమనిస్తున్న వ్యక్తి అక్కడ లేడు.

లెనిన్ ఆ వ్యక్తి గాబరాపడ్డ ముఖాన్ని తలచుకుని నవ్వుకున్నాడు. ఎంతవేషం మార్చుకున్నా, గూఢచారులు తనని గుర్తుపట్టేశారన్నమాట! దీనర్థం అబో స్టేషన్‌లో తనకి ఘనస్వాగతం పలకడానికి పోలీసులు సిద్ధంగా ఉన్నారన్నమాట!

పోలీసులు తనకి కొత్తకాదు. తన విప్లవ

కృషి ప్రారంభమైన దగ్గర్నుంచి వారు అడుగడుగునా తారసపడుతూనే ఉన్నారు. వాళ్లకి తను ప్రతిసారీ టోకరా ఇస్తూనే వచ్చాడు. ఒకే ఒక్కసారి మాత్రం పట్టుబడి సైబీరియా ప్రవాసానికి వెళ్లాల్సి వచ్చింది. అయితే అది జరిగి అప్పుడే అర్ధ దశాబ్దం దాటిపోయింది. అప్పటి పరిస్థితి వేరు. రష్యన్ మొదటి విప్లవం ఓడిపోయిన నేటి పరిస్థితి వేరు. జార్ ఇప్పుడు పగబట్టి ఉన్నాడు. మొదటిసారిగా ఈ విప్లవం ద్వారా జార్‌కు ఓటమి భయం పట్టుకుంది. దాన్నుంచి ఎలాగోలా గట్టెక్కాక, తిరిగి అలాంటి పరిస్థితి తలెత్తకుండా కట్టుదిట్టమయిన ఏర్పాట్లు చేస్తున్నాడు. దొరికినవారిని దొరికినట్లు మృత్యు సన్నిధికి పంపిస్తున్నాడు. బొత్తిగా అమాయకులనుకున్నవాళ్లను మాత్రం తిరిగి విప్లవం పేరెత్తకుండా చేసేందుకు జైళ్లలో కుక్కి, కొరడాలకు పని కల్పిస్తున్నాడు.

ఒకప్పుడు రష్యాలోని మార్క్సిస్టులే సోషల్ డెమొక్రాట్లనే పేరుతో ప్రసిద్ధులు. వారు అంత ప్రమాదం లేని రాజకీయ పక్షం వాళ్లు. ఆ రోజుల్లో 'నరోద్నిక్కు'లే ప్రభుత్వం దృష్టిలో అత్యంత ప్రమాదకారులైన విప్లవకారులు. 'నరోద్'ల(ప్రజల)పట్ల అంకిత భావం కలవారయి వుండటం వలనే 'నరోద్నిక్కు'లనే పేరు వారికి స్థిరపడింది. వారు రైతాంగాన్ని విప్లవశక్తిగా భావించి విప్లవోద్యమాన్ని నడిపారు. మరి ఇప్పుడో.. సోషల్ డెమొక్రాట్లు! మరి తను.. అత్యంత.. అత్యంత ప్రమాదకారి! అలాంటి తనే పట్టుబడితే?

తను ప్రాణభయం వదిలేసే ఈ రంగంలోకి దిగాడు. కాని తన అన్నలాగా అంత తేలిగ్గా ప్రాణాల్ని వదలడు. తన అన్న 'అలెక్సాండర్ ఉల్యనొవ్' ఈ నరోద్నిక్కుల సంస్థ 'నరోద్నయావోల్యా' సభ్యుడే. నాటి జార్ మూడో అలెక్సాండర్‌పై హత్యాయత్నంలో ఉల్యానొవ్ కుట్రకేసును ఎదుర్కొని, 1887 మార్చి 1న నిర్బంధానికి గురై, ఉరికంబం ఎక్కాడు. ఇప్పుడు తన కృషి గమ్యం చేరే క్రమంలో ఉంది. విప్లవం ప్రస్తుతానికి ఓడిపోయినా, బోల్షివిక్కుల ఆధ్వర్యంలో ప్రజాతంత్ర శక్తుల్ని సమీకరించి, వారికి నాయకత్వం వహించగల సత్తా తనకుందని కార్మికవర్గం నిరూపించుకుంది. భవిష్యత్తు విజయానికి ఇది చాలా ముఖ్యమైనది!

లెనిన్ తన ఆలోచనల నుంచి తేరుకుని, సీట్లోనుంచి లేచి నిలబడ్డాడు. తన సీటు ఎదురుగా ఉన్న భార్యాభర్తలు పేకలో ఏదో కొత్తఆటలో నిమగ్నమై ఉన్నారు. నడవాలో చూస్తే గూఢచారి ఎక్కడా కనబడలేదు. ఇక తర్వాత వచ్చేదే అబో స్టేషన్. మధ్యలో ఒకట్రెండు చిన్న స్టేషన్లు ఉన్నప్పటికీ, వాటిలో ఎక్స్‌ప్రెస్ రైలు ఆగదు. అంచేత తన వలలో చిక్కిన పిట్ట ఇక తననుంచి జారిపోదనే నమ్మకంతో బహుశా కాలక్షేపం కోసం అతడు వేరే పెట్టెలోకి వెళ్లి ఉంటాడు.

ఇంకా అబో స్టేషన్‌కు గంటకు పైగా ప్రయాణం చేయాలి. ఈ లోపలే ఏదన్నా ప్రయత్నం చెయ్యాలి. లెనిన్ తాపీగా నడవాలోకి వెళ్లి గేటువద్ద నిలబడ్డాడు. ఒక్క క్షణం అటూ ఇటూ చూసి తలుపు నెమ్మదిగా తోశాడు. ఒక్కసారిగా మంచుగాలి బలంగా ఆయన మొహాన్ని బాదింది. ఓవర్‌కోటు కాలరుని మెడచుట్టూ అదుముకుని, బొచ్చుటోపీని మొహంమీదికి లాక్కుని అలవాటు పడేందుకు కొద్దిసేపు తలుపు తీసే ఉంచాడు. మళ్లీ ఎవరన్నా వస్తారేమోనని తలుపు మూసి, కాసేపటికి తలుపు మళ్లీ తెరిచాడు. ఇంతలో వేగంగా వెళ్లే రైలు నడకలో ఏదో మార్పు వచ్చినట్లుంది. రైలు పెట్టెలు టకటకమని శబ్దం చేశాయి. అవి కాస్త అటూ ఇటూ ఊగులా



డాయి. దాంతోపాటు రైలుచక్రాలు కిర కిరమని శబ్దం చెయ్యసాగాయి. ఏంటో తెలుసుకునేందుకు కొద్దిగా మొహం బయటకు పెట్టి చూశాడు లెనిన్. తను ఊహించింది నిజమే. రైలు మార్గం వంపు తిరిగి వుండటం వల్ల రైలు వేగాన్ని తగ్గించుకుంది. ఒకటి రెండు క్షణాలు తటపటాయించాడు గానీ, ఇక మార్గాంతరం కనబడలేదు. విప్లవ మార్గం తొక్కాక సాహసాలతో సావాసం చెయ్యక తప్పదు. అంతే, ఒక్కసారి అదను చూసుకుని దూకేశాడు!

గురిచూసి దిబ్బమీదికి దూకిన లెనిన్, దిబ్బమీదకాక పక్కనే ఉన్న గుంటలో పడ్డాడు. అదే మంచిదయింది. గుంటంతా మెత్తని మంచుతో నిండి వుంది. పడిపోయాక రెండు నిమిషాలు అలాగే కూర్చుండిపోయాడు. ఆయన గోధుమరంగు సూటు మంచులో మంచులా కలిసిపోయింది. రైలు దృష్టి పథంలోంచి పూర్తిగా కనుమరుగయ్యాక మంచు గుంటలోంచి మెల్లగా లేచి కాళ్లూ చేతులూ విదిలించుకుని, మంచు దులుపుకున్నాడు. దెబ్బలు అట్టే తగల్లేదు. ఫర్వాలేదు, నడవగలనని అనుకున్నాడు, రెండడుగులు వేసి.

అంతా చీకటి. ఆకాశంలోని నక్షత్రకాంతి మంచులో మిలమిల ప్రతిఫలిస్తోంది.

నేలంతా మంచుతో నిండిపోయి, దారికీ డొంకకూ తేడా తెలియడం లేదు. అంతా మంచు ఎడారిలా వుంది. మధ్యలో ఎత్తైన రైలుమార్గం మంచు ఎడారిని చీల్చిన దారపు పోగులా వుంది. ఈ రైలుమార్గం వెంటే నడవడం మంచిదనుకున్నాడు ఆయన. పట్టణం శివారు వచ్చాక అప్పుడు వేరే దారి చూసుకోవచ్చుననుకున్నాడు. మైలురాళ్లను చూస్తూ అబో ఇంకా పన్నెండు మైళ్లుందని తెలుసుకున్నాడు. సమయం ఎంతో లేదు. వేగంగా నడిస్తే తప్ప స్టీమరును అందుకోలేడు. ముందుగా అబోలో కామ్రేడ్ గ్లుష్‌కోవ్‌ని కలవాలి. ఇదంతా ఈ రోజు అవుతుందా? ఏమో.. ప్రయత్నించి చూద్దాం.. అనుకుంటూ వేగంగా నడవసాగాడు లెనిన్. అప్పుడాయనకి అకస్మాత్తుగా రైల్లో తనని వెంటాడిన గూఢచారి గుర్తొచ్చాడు. వలలో చిక్కిందనుకున్న చేప తీరా అందులో కనబడకపోయేసరికి అతడు పెట్టెనుంచి పెట్టెకి పిచ్చోడిలా పరుగులు తీసే దృశ్యాన్ని ఊహించుకుని తనివితీరా నవ్వుకున్నాడాయన.

ఎంతవేగంగా నడిచినా అబో నగరంలో కామ్రేడ్ గ్లుష్‌కోవ్‌ని కలుసుకునేసరికే స్టాక్‌హోమ్ వెళ్లే స్టీమర్ అప్పటికే రేవు దాటేసింది.

"తిరిగి మరో స్టీమర్ వచ్చేదాకా అబోలో వేచి వుండడానికి ఇక్కడి పరిస్థితులు బాగాలేవు. ఎప్పుడు, ఎవరు అరెస్టవుతారో.. గూఢచారుల కన్ను ఎవరిమీద పడుతుందో.. తెలీదు. అంచేత మనం వెంటనే బయలుదేరి పట్టణం నుంచి ముందు బయటపడాలి. దగ్గర్లోనే నాకు తెలిసిన ఒక బెస్తల గ్రామం వుంది. ఆ పల్లెలోని బెస్తలంతా మన సానుభూతిపరులే. అక్కడ మీరు పగలంతా విశ్రాంతి తీసుకుని, రేపురాత్రికి తిరిగి ప్రయాణం కావాలి. అక్కడి బెస్తల సాయంతో మీరు వేరే స్టీమరు ఎక్కే ఏర్పాటు చేస్తాను" చెప్పాడు ఫిన్నిష్ కామ్రేడ్ గ్లుష్‌కోవ్.

అసలే నడక, ఆపై ఆకలి.. అయినప్పటికీ ఇవన్నీ లెక్క చేసే పరిస్థితి లేదు. గ్లుష్‌కోవ్ ఇంట్లో లెనిన్ త్వరగా భోజనం కానిచ్చి, ఆ కామ్రేడ్ వెంట తెల్లవారుజామున రెండింటికి నడక ప్రారంభించాడు.

ఆ బెస్తల గ్రామం ఒక అఖాతంలో వుంది. ఆ గ్రామం చుట్టూ వందలకొద్దీ చిన్నచిన్న దీవులూ, ద్వీపకల్పాలూ ఉన్నాయి. మధ్యమధ్య సముద్రశాఖలూ, వంకలూ ఉన్నాయి. ఇవన్నీ సముద్రం దాకా వ్యాపించి ఉన్నాయి. అంతా మంచుతో నిండి ఉంది. ఆ ఫిన్నిష్ కామ్రేడ్‌తో పాటు లెనిన్ ఆ గ్రామం చేరేసరికి తెలతెలవారుతోంది. అంచేత నరసంచారం లేని ఆ దీవుల మధ్య కూడా వాళ్లిద్దరూ చాటుమాటుగానే ఆ గ్రామంలో తమకు కావలసిన ఇంటికి చేరుకున్నారు.

★ ★ ★

అర్ధరాత్రి పన్నెండు దాటి ఒంటిగంట కావచ్చింది. ఆఖాతంలోని ఆ బెస్తలగ్రామంలో జనమంతా నిద్రించారు. ఊరుకి ఒకవైపుగా ఉన్న ఒక గుడిసెలోంచి నలుగురు వ్యక్తులు నిశ్శబ్దంగా బయటికి వచ్చారు. నలుగురి వద్దా పొడవాటి కర్ర లున్నాయి. అపాయకరమైన వారి ప్రయాణంలో ఎదురయ్యే ప్రమాదాలను ఎదుర్కొనే సాధనాలు ఆ కర్రలే!

ఆ నలుగురూ ఒకరివెంట ఒకరు ముందుకు సాగుతున్నారు. వారిలో ఇద్దరు జాలరులు. వారిలో ఫిన్నిష్ కామ్రేడ్ గ్లుష్‌కోవ్, మరొకరు బొగొయ్‌చూక్ పేరుతో లెనిన్. ముందుగా ఒక జాలరి, తర్వాత గ్లుష్‌కోవ్, వెనక మరొక జాలరి, ఆఖరిగా లెనిన్- ఈ క్రమంలో వారు నడుస్తున్నారు. ఏమాత్రం ఏమరుపాటున ఉన్నా మృత్యువు అడుగడుగునా కబళించడానికి

సిద్ధంగా ఉన్న ఆ ప్రయాణ అనుభవాన్ని లెనిన్ తన జీవితాంతం మరచిపోలేదు.

ఆ జాలర్ల గ్రామ సమీపంలో గల దీవుల సమూహంలోని ఒక దీవి వద్దకు స్వీడిష్ హిమ విచ్ఛేదక స్టీమర్లు వచ్చి, కొద్దిసేపు ఆగుతాయి. ఆ సముద్ర మార్గంలో ప్రయాణించే నౌకలు వెళ్లడానికి సముద్రంపై గడ్డకట్టిన మంచుదిబ్బలను అవి పగులగొట్టి మార్గాన్ని ఏర్పరుస్తాయి. ఆ పనిలో అవి ఆ నౌకలతోపాటు ప్రయాణిస్తాయి. ఆ హిమ విచ్ఛేదక నౌకలలోని సిబ్బందితో అక్కడి జాలర్లకు పరిచయాలు ఉన్నాయి. కామ్రేడ్ బొగొయ్‌చూక్‌ను అలాంటి హిమవిచ్ఛేదక నౌకలలో ఒకదాంట్లో ఎక్కించి స్వీడన్ వెళ్లేందుకు సహకరిస్తామని ఆ జాలర్లు గ్లుష్‌కోవ్‌కు వాగ్దానం చేశారు. అందుకే ఈ కాలినడక. అయితే ఏమాత్రం పోలీసుల కంటపడకుండా ఉండేందుకు అత్యంత ప్రమాదభరితమైన ఆ ప్రయాణాన్ని పగటిపూటకాకుండా రాత్రివేళ చేస్తున్నారు. ఆ నౌకలు ఆగే దీవికి చేరుకోవడానికి మామూలు రోజుల్లో అయితే పడవలను ఉపయోగిస్తారు జాలరులు. కానీ ఇప్పుడు సముద్ర జలాలన్నీ మంచుదిబ్బలుగా ఏర్పడటంతో నడుచుకుంటూనే వెళ్లాలి. మధ్య మధ్య దిబ్బల్లో పగుళ్లున్నాయి. అంతేగాక కొన్నిచోట్ల మంచుబాగా గట్టిపడలేదు. అందువల్ల ఎంతో జాగ్రత్తగా వెళ్లాల్సి ఉంటుంది. ఎక్కడ పగుళ్లు ఏర్పడి దిగబడిపోతుందో తెలుసుకోవడానికే వారంతా పొడుగాటి కర్రలు పుచ్చుకున్నారు. పగుళ్ల మధ్యలోంచి సముద్రజలం పైకొచ్చి మెల్లగా ప్రవహిస్తోంది.

మేఘాలు కమ్ముకొని ఉన్నాయి. గాలి హోరు పెరిగిపోతోంది. ఆకాశం నుండి మంచుతునకలు జారిపడుతూ ముఖాలకు గుచ్చుకుంటున్నాయి. దూరంగా మంచు తుపానులో నౌకలు నడుస్తున్న దారి నుండి హెచ్చరిక కోసం చేసే బాకాల శబ్దాలు వారికి నెమ్మదిగా వినబడుతున్నాయి. ఆ చీకటి రాత్రిలో ప్రాణాలకు తెగించి, అడుగడుగునా ప్రమాదాలతో కూడిన ఆ దారిలో ప్రయాణిస్తున్నారు.

తాము స్టీమరు ఎక్కించబోయే వ్యక్తి ఎవరనేది నిజానికి ఆ జాలర్లకు తెలీదు. ఆయనపేరు బొగొయ్‌చూక్ అని గ్లుష్‌కోవ్ చెప్పాడుకానీ, అది ఆయన అసలు పేరు కాదని వారికి తెలుసు. జార్‌కు వ్యతిరేకంగా పోరాడుతున్న ఒక ప్రముఖ వ్యక్తి అని మాత్రమే వారు భావించారు. వారికి అది చాలు. జార్‌కు వ్యతిరేకంగా పోరాడే ఎవరికైనా సాయం చేసేందుకు వారు చేతనైనదంతా చేస్తారు. ఎందుకంటే తమ దేశమైన ఫిన్లాండును జార్ ఆక్రమించుకుని రష్యన్ సామ్రాజ్యంలో కలిపేసుకున్నాడు. స్వతంత్రంగా జీవించే తాము బానిసలుగా బతకాల్సివస్తోంది!

అయితే అలాంటి చీకటిరాత్రిలో గడ్డకట్టిన సముద్రాన్ని దాటడం ఎంత ప్రమాదమో లెనిన్‌కి నిజంగా తెలీదు. బృందంలో వెనుకగా నడుస్తున్న ఆయన కాళ్లకింద ఉన్న మంచుమీద దృష్టిని నిలుపుకుంటూనే, ముందు నడుస్తున్న మనిషిని అనుసరించి, ఆ మనిషి కనుమరుగవ్వకుండా చూసుకుంటూ సాగుతున్నాడు.

**భళే భలే!**

*19వ శతాబ్దానికి చెందిన ఫ్రెంచి నవలా రచయిత బాల్జాక్ రోజుకు దాదాపు యాభై కప్పుల కాఫీ తాగేవాడట! ఆయన సాయంత్రం ఆరింటికే పడుకుని తెల్లవారుజామున ఒంటి గంటకు లేచేవాడట. అప్పటి నుంచి ఉదయం 8 గంటల వరకూ రాసుకునేవాడట! తర్వాత ఇక పగటివేళ అసలు రాతపని జోలికి వెళ్లేవాడు కాదట.*

ఇంతలో అకస్మాత్తుగా ఆయన కాళ్లకింద నున్న మంచుగడ్డ కదిలి ఒకపెద్ద శబ్దం వచ్చింది. ఒక మంచు ఖండం ఓ పక్కకు ఒరిగిపోయి మెల్లగా ఆయనకాళ్ల కింద నుండి జారిపోసాగింది. ఆ పగులులోంచి నీరు ధారగా పైకి చిమ్ముతోంది. లెనిన్ చేతిలోని కర్రతో తనముందున్న చోటుని పొడిచి చూశాడు. అక్కడ గట్టిగా ఉన్నదేదీ తగల్లేదు. తనకాళ్ల నుండి మంచుఖండం నీళ్లలోకి పొంతం జారిపోకముందే, తనకు కొంచెం ఎడంగా తేలుతున్న ఒకపెద్ద మంచుఖండం మీదికి అసంకల్పితంగా దూకేశాడు లెనిన్. అదెలా జరిగిందో కూడా ఆయనకు గుర్తులేదు. తనవైపుకు

## కొత్తగాలి...



**గుడికంటే బడి పదిలం**
**బడికంటే గుడి పదిలం**
**ఆ రెంటిని కట్టిన**
**కాంట్రాక్టరు కడు పదిలం**

– నండూరి నాగేశ్వరరావు,
బేగంపేట, హైదరాబాద్

చాచబడిన చేతిని పట్టుకుని ఆయన గెంతేశాడు. ఈ ప్రమాదం నుంచి తప్పించుకున్నందుకు బెస్తలు ఆయనను భుజంపై చరిచి అభినందించారు. అయితే ఆ ఫిన్నిష్ మాటల అర్థం ఆయనకు తెలీదు. వాటిలో ఆయనకు తెలిసిన ఒకే ఒకమాట 'కామ్రేడ్' అనేదే. తాము స్టీమరు ఎక్కించాల్సిన రష్యన్ కామ్రేడ్ మంచుకిందపడి నీటిలో మునిగిపోయి చనిపోకుండా ఉన్నందుకు వారు చాలా ఆనందించారు. ఈ విధంగా ఆ బృందం గడ్డకట్టిన మంచుపైన నడుచుకుంటూ తాము వెళ్లాల్సిన దీవిని చేరుకున్నారు.

ఎక్కువ సమయం నిరీక్షించనవసరం లేకుండానే వారికి హిమ విచ్ఛేదక స్టీమరు దొరికింది. జాలరులు బొగొయ్‌చూక్‌ని తమ బంధువుగా పరిచయం చేసి, స్టాక్ హోమ్‌లో బతుకుతెరువు వెతుక్కునేందుకు వెడుతున్నాడని చెప్పారు. ఇటువంటి ప్రయాణికులు అడపాదడపా అలాంటి స్టీమర్లు ఎక్కడం మామూలే. పైగా ఇలాంటి స్టీమర్లలో పోలీసులు, కస్టమ్స్ వంటి బెడద కూడా అంతగా ఉండదు. అసలు అలాంటివేమీ ఉండవనే చెప్పాలి. తక్కువ ఛార్జీతో ప్రయాణించవచ్చు. వీటిలో ప్రయాణం వల్ల గమ్యం చేరుకోవడం కొంత ఆలస్యమైనా, సాహసోపేతమైన ప్రయాణం చేసిన అనుభవం దక్కుతుంది. అన్నిటికీ మించి సురక్షితం! స్టీమరు సిబ్బంది బొగొయ్‌చూక్‌ని స్టాక్ హోమ్‌లో దింపడానికి అంగీకరించారు.

జాలరులు స్టీమరు సిబ్బందితో మాట్లాడటానికి వెళ్ళినప్పుడు గ్లుష్‌కోవ్‌కు బొగొయ్‌చూక్‌తో చివరిసారిగా మాట్లాడే అవకాశం లభించింది. విప్లవం ఓడిపోవడం వల్ల నిరుత్సాహంగా ఉన్న గ్లుష్‌కోవ్ పార్టీ కార్యక్రమాల్లో కూడా ఈ మధ్య అంటీముట్టనట్లు ఉంటున్నాడు. పార్టీ అప్పజెప్పిన పనిని చిత్తశుద్ధితో చేస్తున్నాడుగానీ, తనంతట తానుగా మాత్రం ఏ కార్యక్రమాన్నీ చేపట్టే చొరవ చూపడం లేదు. అతడికి బొగొయ్‌చూక్‌ని చూసిన తర్వాత ఒకటే ఆశ్చర్యం కలిగింది. తనలాంటి యువకుడే ఇంత నిరుత్సాహంతో వుంటే, మధ్య వయస్సులో ఉన్న ఈ బొగొయ్‌చూక్ ఇంత ఉత్సాహంగా పార్టీకోసం ఎలా పనిచెయ్యగలుగుతున్నాడు? ఎందుకంటే ఇప్పుడు పరిస్థితులు చాలా దారుణంగా ఉన్నాయి. విప్లవం పేరెత్తడానికే ప్రజలు భయపడుతున్నారు. ఆశారేఖలు కనుచూపుమేర ఎక్కడా కనిపించడం లేదు. భవిష్యత్తులో

నైనా విప్లవం విజయం సాధిస్తుందా? తన జీవితకాలంలోనే జార్ ప్రభుత్వం అంతమయ్యే అవకాశం ఉందా?

గ్లుష్‌కోవ్‌కి తనలో చెలరేగిన సందేహాలను బొగొయ్‌చూక్‌ని అడిగి తెలుసుకోవాలని ఎంతో కోరికగా ఉంది. కానీ తీరా అలాంటివి అడిగితే ఏమంటాడోనని భయపడ్డాడు. పార్టీలో బొగొయ్‌చూక్ స్థాయి ఏదో నిజానికి గ్లుష్‌కోవ్‌కీ తెలీదుకానీ, అది ఉన్నతస్థాయేననీ, కనీసం సెంట్రల్ కమిటీ సభ్యుడైనా అయివుంటాడని ఊహించాడు. తన సందేహాలు చాలా ప్రాథమిక స్థాయికి చెందినవనీ, అంతటి ఉన్నతస్థాయి కామ్రేడ్‌ని వాటిని గురించి అడగడం హాస్యాస్పదమని భావించాడు గ్లుష్‌కోవ్.

గ్లుష్‌కోవ్ ద్వైదీభావాన్ని గమనించిన లెనిన్ "ఏమిటి కామ్రేడ్? ఏమన్నా అడగాలనుకుంటున్నారా? " అన్నాడు.

దాంతో ఇక గ్లుష్‌కోవ్ ఉండబట్టలేక "అవును కామ్రేడ్, నా బాధల్లా ఒక్కటే. ఇంతా ప్రయత్నం చేసినా మనం ఓడిపోయాం కదా! పరిస్థితులు మరింత భయకరంగా మారుతున్నాయి. మరి భవిష్యత్తులో మనకు విజయం లభించే అవకాశం ఉందంటారా? " అన్నాడు.

బొగొయ్‌చూక్ గ్లుష్‌కోవ్ భుజం తట్టాడు. "నిజం కామ్రేడ్! ఓడిపోవడం బాధాకరమే. అయితే దానివల్ల ఒనగూడిన లాభాల్ని కూడా మనం గమనించాలి. సమయం పరిపక్వమైనప్పుడు ఎలా ముందుకెళ్లాలో ఇప్పుడు మనకు తెలిసింది. అలాగే విప్లవం అగ్రభాగాన నిలబడి ఎలా ముందుకు సాగాలో, ముట్టడిలో ఉన్నప్పుడు ప్రజల్ని ఎలా నడపాలో నేర్చుకున్నాం. మరో ముఖ్యమైన విషయం ఏమంటే పరిస్థితులు ప్రతికూలించినప్పుడు ఎలాంటి క్రమమార్గంలో తిరోగమించాలో కూడా గ్రహించాం. అందువల్ల అతి సమీపకాలంలోనే ఇనుమడించిన శక్తితో విజృంభించి జార్‌ని గద్దెదింపడం ఖాయం! ఇంకో ముఖ్య విషయమేమంటే ఇప్పుడున్న రకరకాల పార్టీల నిజ స్వరూపమేమిటో ప్రజలు గ్రహించారు. వాటి బండారం బట్టబయలయింది. ఇక మనవల్లనే తమకు నిజంగా ప్రయోజనమవుతుందనే వాస్తవాన్ని శ్రామికవర్గంతో పాటు రైతాంగం కూడా గ్రహించింది. భవిష్యత్తులో మన విజయానికి ఈ ఒక్కఅంశమే గొప్పశక్తిని అందిస్తుంది"

లెనిన్ చేసిన ఈ హితబోధ గ్లుష్‌కోవ్‌కి టానిక్‌లా పనిచేసింది. అతడిలో పూర్వపు ఉత్సాహం తిరిగి ప్రవేశించింది. స్టీమర్ ఎక్కుతున్న లెనిన్‌కి హృదయపూర్వకంగా వీడ్కోలు పలికాడు గ్లుష్‌కోవ్. జాలర్లు కూడా తమ శ్రమ ఫలించినందుకు సంతోషంతో వీడ్కోలు పలికారు.

సురక్షితంగా స్టాక్‌హోమ్ చేరుకున్న లెనిన్, అక్కడ తన భార్య నదెజ్దా కోసం ఎక్కువ రోజులు నిరీక్షించకుండానే ఆమె వచ్చి ఆయన్ని కలిసింది. ఇద్దరూ కలిసి తమ కార్యకలాపాల్ని తిరిగి యథావిధిగా నడిపేందుకు ప్రశాంతమైన జెనీవా నగరాన్ని చేరుకున్నారు. ఆ నగరం అధ్యయనాలకీ, పత్రికా నిర్వహణకీ, తన దేశం నుండి వచ్చే పార్టీ కార్యకర్తలతో సంప్రదింపులు జరిపేందుకూ ఎంతో అనువుగా ఉన్నప్పటికీ తన మాతృదేశంలో ఉంటూ, తనకిష్టమైన కార్మికవర్గం మధ్యన ఉండి పనిచేసేటప్పుడు కలిగే సంతృప్తి, ఆనందం ఉండదు కదా! అయినా ఆరోజు ఎంతోదూరంలో లేదనీ లెనిన్‌కూ తెలుసు.

తనలోని ఉత్సాహాన్ని సహచరుల్లోనూ నింపాలి. వారిని భవిష్యత్తు విజయం కోసం సంసిద్ధుల్ని చెయ్యాలి! అందుకోసం తనకృషిని మరింత దృఢదీక్షతో సాగించేందుకు పూనుకున్నాడు లెనిన్. ©

ఎం. హనుమంతరావు

# గూఢార్థం

స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్ మణి, కృష్ణారావు మేస్టారి క్లాసు ఎలా జరుగుతుందో చూడటానికి వచ్చాడు. 'వేరే అర్జంటు పనిమీద బయటికి వెళ్తున్నాను. అరగంటలో వచ్చేస్తాను. అంతవరకూ కృష్ణారావు మేస్టారిక్లాసులో కాలక్షేపం చెయ్యండి. మీకు మా స్కూలూ కొత్తగాదూ, కృష్ణారావు మేస్టారూ కొత్త కాదు' అని చెప్పేసి హెడ్మాస్టర్ రంగరాజు హడావిడిగా వెళ్లిపోయాడు.

అందువల్ల ఆ సమయాన్ని క్లాసు తనిఖీతో సద్వినియోగం చేయక తప్పలేదు మణికి.

మణి లంచగొండి అని, అతనికి యివ్వాల్సింది యిస్తే పుచ్చుకొని వెళతాడు తప్ప ఎవరికీ ఏ అపకారం చేయడని జిల్లాలో అందరికీ తెలుసు. వ్యక్తిగా అతనికెవరూ విలువ యివ్వరు. మణి కూడా ఆ విషయంలో ఓ పద్ధతికి కట్టుబడే మనిషే. తనకు యివ్వాల్సిందేదో తన ముఖాన పారేస్తే, యితర విషయాలలో కలుగజేసుకోడు. హెడ్మాస్టర్ స్కూల్లో లేడే, అటెండెన్సు తక్కువగా ఉందే, పిల్లలకు చదువురావటం లేదే- యివన్నీ అతని దృష్టిలో ఆ స్కూలు సిబ్బంది వ్యక్తిగత విషయాలు. వాటిలో తను తలదూర్చటం మర్యాదకాదు. ఈ విద్యావ్యవస్థ ధౌమ్యుడు, ద్రోణుడు, కృపాచార్యుడు కలిసికూడా మార్చగలిగింది కాదనీ, కనుక తను నిమిత్తమాత్రుడినని ఆయన నమ్మకం. ప్రహ్లాదుడికి హరిభక్తిలాగా చాలా పిన్నవయసునుండే దీన్ని అలవరచుకొన్నాడు. అందువల్ల తన జీతం, లంచాలేవో చూసుకోటమే తప్ప, దానికిమించి ఉద్యోగబాధ్యతల విషయంలో ఎక్కువ ప్రమేయం పెట్టుకోడు. ఎవరేం చేసినా, తనను గౌరవించకపోయినా అసలు పట్టించుకోడు. 'సార్, సార్' అని అందరూ తనను గౌరవించాలన్న కండూతి అతనికి లేదు. అందువల్ల హెడ్మాస్టర్లూ, యితర మేస్టర్లూ తమ విధి నిర్వహణను తమకు నచ్చిన పద్ధతిలో చేసుకోవచ్చు.

హెడ్మాస్టర్ రంగరాజూ, ఇన్‌స్పెక్టర్ మణీ, కృష్ణారావు మేస్టారూ ముగ్గురూ చిరపరిచితులే. ముగ్గురూ రిటైరవబోతున్నవాళ్ళే. 'ఏరా, ఒరేయ్' అనుకోరుగాని, దాదాపు అంత చనువే ఉంది వారికి. ముగ్గుర్లోనూ కృష్ణారావు విద్యాధికుడు. మిగతావారికంటె యోగ్యుడనీ తమకు తెలుసు.

అయిదో తరగతి పిల్లలకు తెలుగు పాఠం చెప్తున్నాడు కృష్ణారావు.

మణి రాగానే, 'ఇన్‌స్పెక్టర్‌గారు వచ్చారు. లేచి నిలబడండి' అని ఆదేశించాడు పిల్లల్ని. దాదాపు సగంమంది ఆయన మాట శిరసావహించారు.

కృష్ణారావుగారు తన పాఠం ఆపి, 'పిల్లలను ఏమైనా అడుగుతారా?' అన్నాడు.

మణి అందుకు సిద్ధమై రాలేదుగానీ, సందర్భం వచ్చినప్పుడు అధికారి విధి నిర్వహణలో వెనుకంజ వేసినట్టు కనబడగూడదు కనుక గంభీరమైన ముద్ర ధరించాడు. పిల్లలను తను మామూలుగా ఎప్పుడూ అడిగే ఒకేఒక ప్రశ్న మరోసారి అడిగాడు. 'రామాయణ కథ నుంచి మనం నేర్చుకొనే నీతి ఏమిటి?' అన్నాడు. ఈ ప్రశ్న ఏ క్లాసువారినైనా, ఏ పిల్లలనైనా, ఏ ఉపాధ్యాయులనైనా, ఎప్పుడు అడిగినా ఏమాత్రం యిబ్బందిలేని సురక్షితమైన ప్రశ్న. రామాయణం విశ్వజనీనమైన మహాకావ్యం కదా!

'మంచి ప్రశ్న అడిగారు' అనే భావం వ్యక్తమయ్యేలా కృష్ణారావు కూడా తల పంకించాడు.

'దీనికి సమాధానం మేం చెప్తాం' అని నలుగురు పిల్లలు చేతులెత్తారు. ఇన్‌స్పెక్టర్‌గా అప్పటికే అయిదేళ్ళపైన అనుభవం ఉన్నవాడు మణి. అలా చేతులెత్తినవాళ్ళను అడిగితే జవాబు చెప్తేస్తారు. ఉత్కంఠ పోతుంది. పైగా అప్పుడు మరోప్రశ్న ఆలోచించి అడగాల్సి వస్తుంది. అలా అని మరీ ఆఖరు బెంచీలవాళ్ళను అడగటం ప్రమాదం. వాళ్ళేదో కొంటెజవాబో, పెంకిజవాబో యిస్తే అందరికీ యిబ్బందిగా ఉంటుంది.

అందుకే మధ్య బెంచీలో చివర కూర్చొని, కిటికీలోంచి ఆకాశంవైపు చూస్తున్న లావుపాటి కుర్రాడిని 'ఏమోయ్! నువ్వు చెప్పు!' అన్నాడు.

ఆ కుర్రాడి పేరు తేజ. నిజానికి ఆ తేజ ఇన్‌స్పెక్టర్‌గారి ప్రశ్నకు సమాధానమేమిటా అని

ఆలోచించటం లేదు. క్లాసులో పాఠాల విష యంలో తేజ తామరాకు మీద నీటిబొట్టులా ఉంటాడు, విధి నిర్వహణలో మణిగారిలాగే.

అతను కిటికీలోంచి స్కూలు అవతల ఉన్న తాలూకాఫీసు గోడవైపు చూస్తున్నాడు. గోడనానుకుని పెద్ద చెత్తకుండీ. దాని పక్కన రెండు ముసలి ఆవులు కుండీలోంచి చెత్తను కిందికి లాగుతున్నాయి. తాలుకాఫీసు గోడల మీద ఏవో పోస్టర్లు అంటిస్తున్నారు. అప్పుడే ఓ టెంపోలో బోలెడు సీతాఫలం పళ్ళబుట్టలు వచ్చాయి. అవి చూడగానే తేజకు నోరూరిపోయింది.

తన్మయత్వంతో అటు చూస్తుండగా, ఈ ముసలాయన ప్రశ్న. అదేమిటో సరిగా వినలేదు తేజ. అతడ్ని ఎరిగినవాళ్లెవరూ ప్రశ్నలూ వేయరు క్లాసులో. ఈయన కొత్తవాడు కాబట్టి 'నీ పేరేంటి?' అని అడుగుతున్నాడు అనుకొని 'వెంకట రవితేజ సుబ్రహ్మణ్యం' అని చెప్పాడు, పూర్తిగా ఈలోకంలోకి రాకుండానే.

పిల్లలు గొల్లుమని నవ్వారు.

వాళ్ళను వారిస్తూ, 'తేజా! నీపేరు బాగుంది. రామాయణం వల్ల మనం నేర్చుకొనే ముఖ్యమైన నీతి ఏమిటి?' అని మళ్ళీ అడిగాడు మణి.

అంత గంభీరమైన ప్రశ్నకు ముక్తసరిగా పొందికగా ఎలా సమాధానం చెప్పటమో తెలియనివాడిలాగా తేజ మళ్ళీ తాలూకాఫీసు గోడవైపు దృష్టి సారించాడు.

'నీకు తెలిసినంతవరకూ, తోచిన సమాధానం చెప్పు' అన్నాడు మేస్టారు, బుజ్జగింపుగా.

'స్మాల్ ఫామిలీ, హేపీ ఫామిలీ' అన్నాడు తేజ తడబడుతూ.

తాలూకాఫీసు గోడమీద పోస్టర్లలో తాటికాయంత అక్షరాలలో అదే కనిపించింది మరి. పిల్లలు మళ్ళీ గలగల నవ్వారు. సాధారణంగా, స్కూలు తనిఖీలలో మణి నిర్వికారంగా, స్థిమితంగా ఉండగలవాడే గానీ ఈ అసంబద్ధమైన సమాధానం విని పిల్లలతో పాటు కృష్ణారావు కూడా పక్కకు తిరిగి నవ్వుకుంటుంటే, ఆయనకు ఉక్రోషం వచ్చింది.

అయినా ఈ గ్రామీణ పాఠశాలల్లో సంయమనం కోల్పోతే కష్టం. ఏమంటే ఎవరి మనోభావాలు నొచ్చుకొంటాయో, ఏ పిల్లవాడి బంధువులు ఎంతపాటి రాజకీయనాయకులో ఎవరికెరుక? ఇది తెలుసు కనక మణి తమాయించుకొని, 'అసలామాటకు అర్థం తెలుసా?' అన్నాడు. గద్దించాననుకొన్నాడు గానీ, అనుభవజ్ఞుడు కావటం వల్ల ఆయన ప్రయత్నం లేకుండానే ప్రశ్న అతి సౌమ్యంగా వినబడింది.

'ఇంగ్లీషు' అన్నాడు తేజ క్లుప్తంగా.

'ఇంగ్లీషు మాటకు అర్థం నాకెలా తెలుస్తుంది?' అనీ, 'తెలుగు క్లాసులో ఇంగ్లీషు గురించి అడుగుతావేమిటి?' అనీ, 'ఇప్పటికి రెండు ప్రశ్నలకు జవాబులు చెప్పాను.. అది చాలదా?' అనీ, 'నాకు తెలిసింది యింతే' అనీ.. ఇలా రకరకాల భావాలు ఆ ఒక్కమాటలో ధ్వనించాయి.

ముందు కొంచెం మందలించుదామనుకొని కూడా, మణి కారణాంతరాల వల్ల ఆ ప్రయత్నం విరమించుకొన్నాడు.

'నేను చెప్తాను, నేను చెప్తాను' అంటూ చెయ్యెత్తి గెంతులేస్తున్న రెండుజళ్ళ పిల్లవేపు చేయి చూపించాడు. 'చిన్న కుటుంబం, చింతల్లేని కుటుంబం' అని అద్భుతంగా అనువదించిందా పిల్ల. ఈ కాలం పిల్లలు పిడుగులు కదా!

పిల్లలందరూ మళ్ళీ గొల్లున నవ్వారు. వాళ్ళతోపాటు మేస్టారు మళ్ళీ ముసిముసిగా నవ్వుకున్నారు.

మణి ముఖం జేవురించింది. 'ఎంత లంచగొండినయితే మాత్రం, నేను మంచిగా ఉంటాననే

# చతుర కేత

కదా, ఈయనకీ అవహేళన! పిల్లలనేమీ చేయలేనుగానీ, కావాలంటే ఈయనకు ట్రాన్స్‌ఫర్ చేయింగలనని తెలీదా?' అనుకొన్నాడు.

ఉపేక్షించి లాభం లేదని, 'ఏమిటిది మేస్టారూ! రామాయణం నీతి ఏమిటంటే కుటుంబ నియంత్రణ సందేశాన్ని వినిపిస్తున్నారు పిల్లలు! వీళ్ళకేం చదువొస్తున్నట్టు లేదు' అన్నాడు కటువుగా.

కృష్ణారావు మాట్లాడలేదు. తనను కాదన్నట్టు ఊరుకొన్నాడు మొదటిసారి.

మణికి యిది 'ప్రెస్టీజ్' వ్యవహారమైపోయింది. 'ఏం, ఏమీ మాట్లాడరూ?' అని రెట్టించి, పొరపాటు చేశాడు.

'ఈ విషయం మనం క్లాసు బయట చర్చించుకొంటే బావుంటుందేమో' అన్నాడు కృష్ణారావు గొంతు తగ్గించి.

మణి ఒప్పుకోలేదు.



'ఇందులో రహస్యమేంటి? మీరు చెప్పదలచుకొన్నదేదో యిక్కడే చెప్పండి' అన్నాడు విసుగ్గా.

'కనీసం ఆ వరండాలోకి వెళ్ళి మాట్లాడుకొందాం. పదండి' అని కృష్ణారావు, కొంచెం బలవంతంమీద మణిని ఒప్పించాడు.

ఇద్దరూ వరండాలోకి నడిచారు. కృష్ణారావు రెండుక్షణాలు గొంతు సవరించుకొని, మణి ప్రశ్నలకు నింపాదిగా జవాబిచ్చాడు.

'అయ్యా! మీరు చదువు, క్రమశిక్షణ గురించి అడిగారు. ముందు క్రమశిక్షణ గురించి చెబుతా. ఈ పిల్లలను ఏరకంగానైనా శిక్షిస్తే మా ఉద్యోగాలు ఊడిపోవటం ఖాయమనీ, వ్యవహారం ముదిరితే ముప్పు మీ ఉద్యోగాలదాకా రావచ్చుననీ మీరు మమ్మల్ని హెచ్చరిస్తున్నారా, లేదా? ఏరకమైన శిక్షకూ అవకాశం లేకుండా క్రమశిక్షణ నేర్పటం, మా ఊరి పాఠశాలలో రోజురోజుకూ కష్టమైపోతున్నదని విన్నవించుకొంటున్నాను. అయినా మీ ఆజ్ఞ ప్రకారం ప్రయత్నం గట్టిగానే చేస్తున్నాం అని కూడా మనవి.

పోతే మీరడిగిన ప్రశ్న -రామాయణంలో నీతి ఏమిటి? అని. ఇది అయిదో క్లాసు సిలబస్‌లోని ప్రశ్నకాదు. సిలబస్‌లో లేని ప్రశ్నలు అడగకూడదని కోర్టు తీర్పులున్నాయని మీకూ తెలుసు. అయినా అసాధారణమైన తెలివితేటలతో మా విద్యార్థి ఈ ప్రశ్నకు మంచి జవాబే చెప్పాడు?'

'అదేంటయ్యా? రామాయణం నీతికీ, చిన్న కుటుంబానికి సంబంధమేంటి?' అడిగాడు మణి.

'ఇన్‌స్పెక్టర్‌గారూ! ఇది ఆధునిక యుగం. ఈ యుగం పిల్లలు మనతరంలాగా పైపై అర్థంతో సరిపెట్టుకోరు. టీవీ చూసిచూసీ ప్రతి విషయానికీ గూఢార్థాలూ పట్టుకుంటారు. మా తేజ సమాధానమే చూడండి. నీ కుటుంబాన్ని పరిమితంగా ఉంచుకొంటే ఏ సమస్యలూ ఉండవనే అర్థాన్ని రామాయణం వ్యంగ్యంగా బోధించటం లేదూ? దశరథుడికి గనకా ఒకభార్య, ఒక కొడుకూ ఉంటే హాయిగా తన ఇష్టప్రకారం రాముడికే పట్టాభిషేకం చేసేవాడు. వనవాసం ప్రశ్నే ఉండేది కాదు. అది లేకపోతే సీతాపహరణం జరిగేది గాదు. ఎన్నో కష్టాలు, యుద్ధాలు తప్పేవి. అందరూ సుఖంగా ఉండేవారు. మా తేజ సమాధానం తప్పుకాదు. పైగా అందులో వయసుకు మించిన పరిణతి, పరిపక్వత ఉంది. అంతకంటే ముఖ్యం, ఏ ఇతిహాసం చూసినా, అందులో ఉన్న సామాజిక సందేశాన్ని పట్టుకోలేకపోతే, ఆ చదువు నిరర్థకమని తేజ చెప్పకనే చెప్పట్లేదూ? ఏమంటారు? ఇంతకంటే ముఖ్యమైన విషయం మరొకటి కూడా మనం దృష్టిలో ఉంచుకోవాలి!' అని క్షణం ఆగాడు కృష్ణారావు.

బిత్తరపోయిన మణి, ఏమిటది అన్నట్టు చూశాడు.

'తేజ, మండల ప్రెసిడెంట్‌గారికి స్వయానా చెల్లెలి కొడుకు. అతని మేనమామ మన మంత్రివర్యులకు సన్నిహితుడు. అలాంటి కుర్రాడు తప్పు జవాబులు చెప్తాడా? ఇంకా ...'

విషయం సంక్లిష్టం అవుతోందని గ్రహించాడు మణి. అతని చిరాకు మాయమైంది.

'సర్లెండి, ఇప్పుడదంతా ఎందుకు? పిల్లలకు బాగా చదువు చెప్పి, క్రమశిక్షణ గల పౌరులుగా తీర్చిదిద్దటం మన విధి అని మాత్రమే నా తాపత్రయం. దీనికి మనమంతా కలిసి కృషి చేయాలి' అన్నాడు మణి.

'చదువు విషయంలో తప్పకుండా మా కృషి యిలాగే కొనసాగిస్తాం. క్రమశిక్షణంటారా, అది ప్రస్తుతం పిల్లలే మాకు చక్కగా నేర్పుతున్నారు. సహనం, శాంతి, అహింసా, ఇంద్రియ నిగ్రహం, నిష్కామకర్మ యిలాంటి సద్గుణాలన్నీ పిల్లలవల్ల మాకు కొద్దో గొప్పో అబ్బుతూనే ఉన్నాయి. అదిగో.. హెడ్మాస్టర్‌గారు వచ్చేసినట్టున్నారు. మీరు గూడా వెళ్ళి పని త్వరగా పూర్తి చేసుకొని బయల్దేరితే మంచిది. మళ్ళీ గంటపైన ప్రయాణం మీకు. అసలే చలికాలం. పొద్దు తక్కువ రోజులు' అంటూ చిరునవ్వుతో ఇన్స్పెక్టర్ గారికి వీడ్కోలు చెప్పి, కోలాహలంగా ఉన్న క్లాసురూంలోకి నడిచాడు కృష్ణారావు. ©




మునిమాణిక్యం నరసింహారావు

# వక్రరేఖ

**కాంతం కథల రచయితగా మునిమాణిక్యం నరసింహారావు ప్రసిద్ధులు. మృదువైన హాస్యానికి, సంసారజీవితంలోని సున్నితమైన శృంగారానికీ చిరునామా ఆయన. నవ్వించ గల శక్తి వెనుక, గంభీరమైన భావనో, బరువైన జీవితమో ఉంటుంది, చార్లీచాప్లిన్ జీవితం లాగ. మునిమాణిక్యంవారి కథలు ఎంతగా మురిపిస్తాయో, ఆయన నవలలు అంత గంభీ రంగా ఉంటాయి. ఆయన నవలలు రాశారన్న విషయం చాలామందికి తెలియదు. విశ్వ నాథ సత్య నారాయణ పరిష్కర్తగా, ప్రస్తావన రచయితగా వెలువడిన మునిమాణిక్యం నవల 'వక్రరేఖ' విశేషాలు ఈనెల మీకోసం..**

వేంకట్రామ అండ్ కో వారు 1962లో పునర్ముద్రణగా ప్రచురించిన 'వక్రరేఖ' నవల అప్పటి ధర రూ. 1-25. అంతకు ముప్ఫైఏళ్ళ ముందే ఈ నవల తొలి ప్రచురణ జరిగింది. 'వక్రరేఖ' నవలా వస్తువుకు చరిత్రతో సంబంధం ఉన్నప్పటికీ ఓ సాంసారిక నవలలా, సాంఘిక సంబంధాల గుబాళింపుతో ఎంతో బిగువుగా సాగుతుంది.

చరిత్రని చదివించే విధానం గురించి విశ్వనాథ సత్యనారాయణగారు 'చరిత్రయందలి దివ్యార్థములు బుద్ధికెక్కనీయరు. ఆ యుద్ధమేసంవత్సరంలో? ఈ సంధి ఎప్పుడు? ఆ రాజెప్పుడు చచ్చెను?' అనేవాటికి ఎక్కువ ప్రాధాన్యమిస్తారని చెపుతూ చరిత్ర రచన జీవితపు నిగ్గులు తెలిసేటట్టుండాలని, ఆ పని ఈ నవల చేసిందని ప్రస్తావించారు.

'వక్రరేఖ' చరిత్రలా ఉండదు. ఆసక్తికరంగా చదివించే నవలలా ఉంటుంది. ఆ కాలంలో ఇటువంటి దృష్టి, నైపుణ్యం పరిశీలిస్తే, ఈ నవల చాలా ఆధునికమైందని చెప్పుకోవాలి. పైకి రాధ అనే అమ్మాయి కథలాగే అనిపిస్తుంది ఈ నవల. కొంచెం లోతుగా పరికిస్తే, తను చెప్పాలనుకున్న చరిత్రాంశానికి రాధని ఒక వాహికగా వాడుకున్నారు మునిమాణిక్యంవారు. 'వక్రరేఖ' బహ్మనీ సుల్తానుల చరిత్ర. 1347లో హసన్ సుల్తాన్ నుంచి బహ్మనీ సుల్తానుల అంత్యదశ వరకూ చెప్పిన కథ. రాజు తర్వాతి రాజు కథలా కాకుండా, కీలక అంశాల మీద, ప్రధాన పరిణామాల మీద కేంద్రీకృతమైన నవల.

గంగూ బ్రాహ్మణుడు కాశీనగర వాసి. సాముద్రికం, జ్యోతిష్యం, శకున శాస్త్రాలు బాగా తెలిసిన పండితుడు. ఢిల్లీ వెళ్లి తన పాండిత్య ప్రతిభతో మహమ్మదీయ చక్రవర్తి దగ్గర మంచిపేరు, ఆశ్రయమూ పొంది ధనవంతుడయ్యాడు. అతని వద్ద పనిచేసే సేవకుడు హసన్. అతనిక్కూడా గంగూ వల్లే రాజాశ్రయం లభించింది.


వక్రరేఖ

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

వేంకట్రామ అండ్ కో.,
విజయవాడ - మద్రాసు - హైదరాబాదు
1962

# మునిమాణిక్యం నరసింహారావు (1898 - 1973)



గుంటూరు జిల్లా, సంగం జాగర్లమూడిలో రుక్మిణమ్మ, సూర్యనారాయణ దంపతులకు 1898 మార్చి15న మునిమాణిక్యం నరసింహారావు జన్మించారు. విజయనగరం కళాశాలలో బీఏ చదివి, రాజమండ్రిలో టీచర్ ట్రైనింగ్ పూర్తి చేశారు. తర్వాత భీమవరం, గుంటూరు, మచిలీపట్నం, బచ్చన్న పేట, వేటపాలెంలో ఉపాధ్యాయుడిగా ముప్పై ఏళ్లకు పైగా పని చేశారు. ఆ వృత్తి నుండి విరమించిన తర్వాత హైదరాబాదు ఆకాశవాణి కేంద్రంలో పనిచేసి, తర్వాత ఆంధ్ర సారస్వత పరిషత్తు నడిపిన తెలుగు పండిత శిక్షణ కళాశాలలో ప్రధానోపాధ్యాయుడిగా చేశారు. బీఏ చదువుకునే రోజుల్లోనే 'సాహితీ సమితి' సభాపతి తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి ప్రోత్సాహంతో రచనలు ప్రారంభించారు. మొదట్లో కవి కావాలని పద్య రచన చేయసాగారు. అయితే శివశంకర శాస్త్రి, 'నువ్వు కవిత్వం రాయడం మాని, కథలు రాయడానికి పూనుకో. నీ కలం కథల్లో చురుకుగా పరుగెడుతుంది' అని సలహా ఇచ్చారట. అప్పట్నుంచీ ఆయన కథారచన ప్రారంభించారు. తర్వాత నవలలు, నాటికలు కూడా రాశారు.

పిల్లలకు, విద్యార్థులకు ఉపయోగపడే విధంగా 'వక్రరేఖ', 'అన్నయ్య మంత్రి', 'క్లింగ్ లింగుల కథ' మొదలగు నవలలను ఆయన రాశారు. ఆయన కలం నుండి జాలువారిన అనేక శ్రవ్య, దృశ్య నాటికలు ఆకాశవాణిలో వచ్చాయి. రంగస్థలం పైన ప్రదర్శనకు నోచుకున్నాయి. 'తిరుగుబాటు' అనే విప్లవ పంథాగల నాటకాన్ని ఆయన రాశారు. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం ఆ నాటకాన్ని వ్యతిరేకించినట్లు తెలుస్తుంది. ఆయన రాసిన 'వితండ వాదాలు', 'మంచివాళ్లు- మాటతీరు', 'మాట నేర్పరితనం', 'స్తుతి-ఆత్మస్తుతి', 'అప్పులు చేయటం-తీర్చటం', 'ఇల్లు-ఇల్లాలు', 'ఇంటావిడతో పోట్లాట', 'ప్రణయ కలహం', 'భార్యను లొంగదీసుకోవటం ఎలా?' తదితర రచనలు ఆసక్తిగా చక్కటి శైలితో చదివిస్తాయి. 'మన హాస్యం' పేరుతో తెలుగులో హాస్యరసం గురించి సమగ్రంగా రాశారు.

కుటుంబ జీవితంలోని కష్టసుఖాలు, దాంపత్యంలోని సౌందర్యాన్ని మునిమాణిక్యంవారు తన కథలలో ప్రస్ఫుటంగా చిత్రించారు. ఆయన సృష్టించిన మధ్య తరగతి ఇల్లాలు 'కాంతం' తెలుగు సాహిత్యంలో అజరామరం. ఆమె సాధుస్వరూపం తెలుగువారి హృదయాల్లో చల్లటి మల్లెపందిరిలా అల్లుకుంది.

కాంతం పాత్రకు చాలా వరకు మునిమాణిక్యం భార్య శేషగిరమ్మ అద్దం పడుతుందంటారు. ఆమె 1938లో చనిపోయారు. ఆ ఏడాదే పెద్ద కూతురు రుక్మిణి కూడా హఠాత్తుగా మరణించింది. అంతవరకూ హాస్య, శృంగార రసాలను పోషించిన మునిమాణిక్యం ఈ వియోగాలవల్ల 'కరుణరసాన్ని గొప్పగా పోషించారు. ఆ పరిస్థితులలో రూపొందినవే 'తిరుమాళిగ', 'రుక్కుతల్లి', 'దీక్షితులు' అనే నవలలు. తర్వాత ఆయన రాజ్యలక్ష్మమ్మను వివాహమాడారు. కాంతం మృతిని కథారూపంగా రాశారు. ఆ పరిస్థితి నుండి క్రమంగా పుంజుకుని, 'కాంతం వృద్ధాప్యం' రచించారు.

తెలుగు సాహిత్య ప్రపంచంలో కలకాలం నిలిచిపోయే సజీవ పాత్ర 'కాంతం'ను సృష్టించిన ఆయన 1973, ఫిబ్రవరి4న హైదరాబాదులో తుదిశ్వాస విడిచారు.

హసన్‌కి రాజుకాదగిన యోగం ఉందని గ్రహించి, ఆ విషయం అతనికి చెప్పి, రాజైనప్పుడు తనని మరచిపోవద్దని మాట తీసుకున్నాడు గంగూ. కాలక్రమంలో హసన్ సేనానియై దక్షిణాపథ జైత్రయాత్రకి వెళ్లాడు. అప్పటికే ముస్లిం చక్రవర్తి విపరీత చర్యలు భరింపరాని స్థాయికి చేరాయి. యుద్ధయాత్రలో కల్బురగి పట్టణాన్ని స్వాధీనపరచుకుని, స్వతంత్రం ప్రకటించుకుని, హసన్ రాజయ్యాడు. గంగూ బ్రాహ్మణుడిని హసన్ మరచిపోలేదు. కృతజ్ఞతగా తన పేరును హసన్‌గంగూగా మార్చుకున్నాడు. గంగూని తన వద్దకే పిలిపించుకున్నాడు. ఆనాటి రాజులకి అలవాటైన కొన్ని చెడ్డ పనులు హసన్‌క్కూడా అలవాటయ్యాయి. వాటివల్ల హిందువులకి కలుగుతున్న బాధ గంగూని వ్యాకులపరచింది. బాగా ఆలోచించిన గంగూ హసన్ సుల్తా

న్‌కి చెప్పి కొన్ని నిబంధనలు ఏర్పరిచాడు. సుల్తానుగానీ, అతని వంశస్థులుగానీ హిందువులకు కీడు చెయ్యకుండా ఉండటం, బ్రాహ్మణులతో వంశపారంపర్యంగా సఖ్యతకి కట్టుబడటం ఆ నిబంధనల్లో ముఖ్యమైనవి. ఆ ఒప్పందానికి ఇరు వంశాలు కట్టుపడి, పరస్పర స్నేహసహకారాలతో జీవించేలా ప్రమాణబద్ధులయ్యారు.

ఆ వంశపు సుల్తానులకి ఆనాటి నుండి బ్రాహ్మణ సుల్తానులని పేరు వచ్చింది. కాలక్రమాన బ్రాహ్మణ శబ్దం బహ్మనీగా మార్పు చెంది, బహమనీ సుల్తానులన్న పేరు స్థిరపడింది. 1347లో రాజైన హసన్ తర్వాత తొమ్మిదో సుల్తాన్ అహమ్మదు షా. 1422లో ఇతను తన రాజధానిని బీదర్ అని వ్యవహరించే అహమ్మదాబాదుకి మార్చాడు. అతని తర్వాత అల్లాయుద్దీన్, ఆ తర్వాత హుమయూన్ రాజ్యమేలారు. హుమయూన్ దుర్మార్గాన్ని అతని రాణులే భరించలేక విషంపెట్టి హతమార్చారు. రాజ్యానికి వారసులుగా ఇద్దరు మిగిలారు. పెద్దవాడు ఎనిమిదేళ్ళ నైజాంషా, చిన్నవాడు ఏడేళ్ళ మహమ్మద్‌షా. అన్నని హత్యచేయించి రాజ్యమేలిన మహమ్మదుషా కాలం నాటి కథే 'వక్రరేఖ'. ఇతని నుంచే బహమనీ సుల్తానుల ఆఖరిదశ ఆరంభమైంది.

మహమ్మదుషా కథని కేవలం అతని కథలాగే చెప్పలేదు మునిమాణిక్యం నరసింహారావుగారు. సుల్తానుతల్లి పెద్దరాణి, మంత్రులు గవాన్, జహాన్, గంగూ వంశస్థుడు హరశాస్త్రి, హరశాస్త్రి ఆదరించిన ఆడపిల్ల రాధ పాత్రలుగా ఆనాటి హిందు-మహమ్మదీయ సంబంధాలు, రాజకీయ స్థితిగతులు, ఇరువర్గాల మనోగతాలు ప్రస్ఫుటమయ్యేలా ఈ నవలా రచనని నడిపించారు. బహమనీ సుల్తానుల సామ్రాజ్య ఆద్యంతాలని, 138 పేజీల తక్కువ నిడివిలో మన ముందుంచారు. ఈ నవలలో చరిత్ర ఎంత ప్రధానమో, రాధ పాత్ర అంతే కీలకం. నిరంకుశంగా వ్యవహరించే సుల్తానులు, హస్తసాముద్రికానికి, జ్యోతిష్యానికి ఎలా లొంగేవారో, తద్వారా రాజకీయాలు ఎలా మలుపు తిరిగేవో చూపిస్తూనే, హరశాస్త్రి అంతటి ప్రతిభామూర్తికి కూడా రాధచేతిలోని 'వక్రరేఖ' అంతుపట్టని వైనం ద్వారా జీవన తాత్వికతకి నవలా రూపం ఇచ్చారు నరసింహారావుగారు.

విశ్వనాథవారు అన్నట్టు చరిత్రని ఆసక్తికరంగా మలచటమే ఈ నవలారచనలో మునిమాణిక్యం నరసింహారావుగారి ప్రధానోద్దేశం అనిపిస్తుంది. నిస్సారంగా అనిపించే చరిత్ర రచనని సారవంతం చేసే కిటుకులెన్నో 'వక్రరేఖ'లో ఉన్నాయి.

చరిత్ర చెప్పేటప్పుడు ఆయా వ్యక్తుల మానసిక తీరుతెన్నుల్ని వివరించటం ఎక్కువగా జరగదు. 'వక్రరేఖ'లో ఆ లోటు లేదు. హరశాస్త్రి, రాణి, ముఖ్యంగా రాధ మనోభావాలు ఎంతో విశ్లేషణతో ఉన్నాయి. ఇంక సుల్తాన్ మనోస్థితి మార్పులని, అతని మానసిక జాడ్యాల్ని, క్రౌర్యపు ఆటుపోట్లని చెప్పినతీరు 'వక్రరేఖ'ని ఇప్పటికీ ఆధునికనవల అనిపించే స్థాయిలో తీర్చిదిద్దాయి. కొన్ని వర్ణనల ఆధునికత్వం ఆశ్చర్యపరుస్తుంది. 'జహాన్ గుర్రమునాపి పశ్చిమ దిశవంక చూచెను. సూర్యుడప్పుడే ఖూనీచేసి వచ్చినవాని వలె దేహమంతయు రక్తము పూసికొనినట్లు ఎర్రగా నుండెను' అంటారు.

సుల్తాను రాక్షసరతికి బలైన రాధ గురించి.. 'తెల్లవారిన తర్వాత నల్లపడిన కాష్టమువోలె నమంగళాకృతి...' అంటారు. మనుషులలోని రాక్షస ప్రవృత్తి, మతద్వేషం, కక్ష, హత్యారీతుల గురించి కొద్ది వాక్యాలలోనే అనితర సాధ్యంగా వివరించిన తీరు రచనా పాదుపరి నైపుణ్యానికి అద్దంలా ఉన్నాయి.

మునిమాణిక్యంవారి నవలా వస్తువు ఎంపిక, నిర్వహణ ప్రత్యేకమైనవి. ఎక్కువ పాత్రలు, సమాంతరంగా సాగే బహుముఖ కథాతీరులాంటివి వీరి నవలల్లో తక్కువ. తక్కువ పాత్రలతో ఒకేదారిన, సూటిగా కథని నడిపిస్తారు. 'వక్రరేఖ'లోనే కాదు, వీరి మరో ప్రముఖ నవల... 'రుక్కుతల్లి'లోనూ ఇంతే. తల్లిపోయే నాటికి రుక్కుతల్లి వయసు పదమూడేళ్ళు. చెల్లెలు, తమ్ముళ్ళు, తండ్రి వీరందరి బాధ్యత తనదే. ఆమెకి కుటుంబం పట్ల ఉన్న అపరిమిత అనురాగమే 'రుక్కుతల్లి' నవల.

హాస్య రచయితగా పేరుపొందిన మునిమాణిక్యం నరసింహారావుగారి గంభీర చింతన ఆయన నవలల్లో కనిపిస్తుంది. గుండెల్ని పట్టుకునే దిగులు, మనిషి జీవితంలో ఇంత ఎగుడు దిగుడులున్నాయా? అని అనిపించేంత నాటకీయ సహజచిత్రణ ఆయన రచనలో కనిపిస్తుంది. జీవిత పొరల్లోని మానవతాఛాయల్ని ఆయన పట్టుకున్న తీరు విలక్షణమైంది. కాంతం కథల హాస్యమూర్తి, మునిమాణిక్యంగారి మరోరూపం చూడాలంటే ఆయన నవలల్ని చదవాల్సిందే.

**– వి. రాజారామమోహనరావు**

# మనసున ఉన్నదీ...

★ నవంబరు 'చతుర'లో కాశీ విశ్వనాథ్ నవల 'దత్తతకో తండ్రి!' బాగుంది. మాధవ రావు పాత్ర అద్భుతం. భానుమూర్తిలాంటి కసాయి కొడుకులెందరో? పనిమనిషి వీరమ్మ నిజంగా వీరవనిత. రామదాసులాంటి చదువుకున్న మూర్ఖులు, ప్రేమను జయించుకున్న జితేంద్రలు నేటి సమాజంలో కనిపిస్తుంటారు. 'కొత్తగాలి' బాగా ఆకట్టుకుంటోంది.

– వి.ఎస్. వెంగన్న, కొత్తచెరువు

★ నవంబరు 'చతుర' నవల కాశీ విశ్వనాథ్ 'దత్తతకో తండ్రి!' బాగుంది. కానీ చివరిలో మాధవరావు కొడుకు భానుమూర్తికి ఉద్యోగం పోయి, మనోరమ, రేఖల నుండి బతకడానికి ఒత్తిడివచ్చి, తండ్రి విలువ తెలిసేలా చేసివుంటే ఇంకా ఆకట్టుకునేది. చతుర ప్రపంచంలోని 'చేప.. ఉంగరం!' బాగుంది.

– జి. దివాకర్‌రావు,
కుంటిభద్ర, శ్రీకాకుళం జిల్లా

★ పరిణీతి చోప్రా ముఖచిత్రంగా వచ్చిన 'చతుర' విశేషంగా ఆకట్టుకుంది. ముఖ్యంగా 'దత్తతకో తండ్రి' నవలా శీర్షికే విభిన్నం. నూతన శీర్షిక 'నవలావలోకనం' చాలా బాగుంది. మనవాళ్లు రాసిన మంచి నవలలను చదవనివారికి వాటి గురించి తెలుసుకునే అవకాశం కలగడం అభినందనీయం! ఇక చతుర ప్రపంచంలో 'విచిత్ర విడాకులు' వింతల్లోకల్లా వింతగా అనిపించాయి.

– కరణం శివానందరావు, కర్నూలు

★ 'భలేభలే!' బాగా ఉంది. పెద్దనామాత్యులు కవిత్వం రాయడానికి అనువైన వాతావరణాన్ని పద్యరూపంలో వర్ణించిన విధం చదివితే నేటికీ ముచ్చటేస్తుంది. ఓ రచన సృష్టికి ఎంతమంది ఎన్నెన్ని రకాల పరిస్థితులను, అనువైన మార్గాలను ఎన్నుకుంటారో చదువుతుంటే నిజంగానే భలేగా ఉంది. కాశీవిశ్వనాథ్ నవల ఆకట్టుకుంది. రెండు పెద్దకథలను ఒకదారంతో పేనినట్లుంది. ఈ నవలలో ఆత్మహత్యలను నివారించడం ఒక ఎత్తయితే, చక్కని పరిష్కారాలను తెలియజెయ్యడం గొప్పగా ఉంది. సినిమాగా తీయవలసిన రచన అనిపించింది. మల్లాది రామకృష్ణ శాస్త్రి రచనతో 'నవలావలోకనం' ప్రారంభించడం శుభసూచకం. దీనిద్వారా మంచి నవలల గురించి తెలుసుకోగలుగుతాం.

– మంచాళ శ్రీలక్ష్మి, విశాఖ

★ పరిణీతి చోప్రా ముఖచిత్రంగా వచ్చిన నవంబరు 'చతుర' ఆద్యంతం ఏకబిగిన చదివింపజేసింది. 'దత్తతకో తండ్రి' నవల ఎంతగానో అలరించి, చక్కటి సినిమా చూసిన అనుభూతి కలిగించింది.

– పక్కి బాలకృష్ణారావు,
గరివిడి, విజయనగరం

★ చిరుదరహాసాల పరిణీతి చోప్రా ముఖచిత్రంతో వెలువడిన 'చతుర' చాలా బాగుంది. కాశీ విశ్వనాథ్ నవల 'దత్తతకో తండ్రి!' ఆమూలాగ్రం ఉత్కంఠతో చదివించింది. మల్లాది 'కృష్ణాతీరం' ఆహ్లాదకరంగా ఉంది.

– భాగ్యశ్రీ రాజేష్, నిర్మల్

★ ఆలివైపువాళ్లు ఆత్మబంధువులు, కన్నతల్లిదండ్రులు పరాయివాళ్లు అన్నట్లుగా ప్రవర్తించే కొడుకుల తీరును 'దత్తతకో తండ్రి!' నవలలో భానుమూర్తి పాత్రద్వారా కళ్లకు కట్టారు రచయిత. సొంతింట్లోనే తండ్రిని పనివాడుగా చిత్రీకరించిన తీరు కళ్లనీళ్లు పెట్టించింది. పరమ ఛాందసుడైన రామదాసులో మార్పు వచ్చింది. కానీ తండ్రిపట్ల భానుమూర్తి వైఖరిలో మార్పు రాకపోవటం నేటికాలపు కొడుకుల నైజాన్ని తేటతెల్లం చేసింది. 'చతుర' నవలలు సామాజిక స్ఫూర్తిని కలిగిస్తున్నాయి.

– ఎస్. విజయలక్ష్మి, ఒంగోలు

---


చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర,
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com
vipula.chatura@eenadu.net

అన్ని సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**వంకాయల చిరంజీవి**

ఇ. నెం. 80-30-13/2,
జయశ్రీ గార్డెన్స్- 4వ వీధి,
జె. యన్. రోడ్, రాజమండ్రి
పిన్: 533103

## చతురంగం - 32 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 బ | లు | 2 పృ | | 3 తీ | 4 ర | ము | | 5 జ | 6 ప్ర |
| క | | 7 రం | 8 భ | | వం | | 9 సం | త | తి |
| 10 రా | 11 ధ | | 12 ద్ర | 13 వం | | 14 మా | ఘం | | ఘ |
| | 15 ర | ద్ధు | | 16 తె | 17 నా | లి | | 18 కో | ట |
| 19 ప్రా | ణి | | 20 క | న | క | | 21 స | మా | న |
| భ | | 22 చె | ప్పు | | 23 ము | 24 ది | త | లు | |
| 25 వం | 26 గ | ర | | 27 మూ | | 28 శ | త | | 29 వా |
| | ద్దై | | 30 వే | స | 31 వి | | 32 ము | 33 స | లం |
| 34 తా | | 35 మీ | ట | | 36 ధా | త | | మ | |
| 37 వి | పి | నం | | 38 మే | త | | 39 తు | రం | గం |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 2. ఇందన మల్లికార్జున్‌రావు, ఏలూరు, 3. మేలనాతూరు జైవంత్, విజయవాడ, 4. వి. రామగిరి, బెంగళూరు, 5. ధరణి పార్థసారథి, హైదరాబాద్, 6. డా. శివభూషణం, కర్నూలు, 7. చుండూరు శకుంతల, బాచుపల్లి, 8. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 9. నియాజ్ అలి, హైదరాబాద్, 10. డి. కృష్ణకుమారి, ఎ.ఎస్.రావ్ నగర్, 11. వి.వి. సత్యనారాయణ శెట్టి, బైరాగిపట్టెడ, తిరుపతి, 12. జి. జయచంద్రగుప్త, కర్నూలు, 13. వి.వి. రమణారావు, మల్కాజిగిరి, 14. యు. ఝాన్సీలక్ష్మి, హైదరాబాద్, 15. తిప్పావఝుల వెంకటనారాయణ, మల్కాజిగిరి, 16. సి. జనార్దనసింగ్, నల్లకుంట, 17. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 18. గౌతమి శిష్ట్లా, హబ్సిగూడ, 19. ఆర్. భవ్య, ఎమ్మిగనూరు, 20. యు.యు.యు, ఎమ్మిగనూరు, 21. బిక్కునూరి రాజేశ్వర్, ఈద్‌గాం, ఆదిలాబాద్ జిల్లా, 22. తాజీ ప్రసాద్, చెన్నై, 23. జి.వి. రాఘవేంద్రరావు, మచిలీపట్నం, 24. డి. అశ్వత్థనారాయణ, పేరూరు, అనంతపురం జిల్లా, 25. షేక్ నజీర్‌బాషా, కోట, నెల్లూరు జిల్లా, 26. గేదెల రామారావు, ఏలూరు, 27. సి.జి.యస్. రావు, ఎ.ఎస్. రావ్ నగర్, 28. ధప్పూరి సుధాదేవి, సీతారాంబాగ్, హైదరాబాద్, 29. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 30. ఎస్. శ్రీహరి, బెంగళూరు, 31. ఎస్. నాగశ్వేత, బెంగళూరు, 32. పక్కి సుందరీ కృష్ణ, గరివిడి, విజయనగరం జిల్లా, 33. పక్కి శ్రీదేవి, మెట్టపల్లి, విజయనగరం జిల్లా, 34. పొన్నపల్లి సీతారత్నం, నర్సాపురం, 35. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, 36. శివలెంక చంద్రశేఖర్, మెహదీపట్నం, 37. మంచాళ లక్ష్మణరావు, విశాఖపట్నం, 38. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 39. ఈ. కృష్ణకుమారి, విజయవాడ, 40. బందెల శ్రీనాథ్‌బాబు, ఉయ్యూరు, 41. జి.వి. రాఘవేంద్రరావు, బెంగళూరు, 42. దేవరాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, 43. బిరుదు సురేష్‌బాబు, చీరాల, ప్రకాశం జిల్లా, 44. కొత్తపల్లి స్వరలయ, చీరాల, 45. నండూరి నాగేశ్వరరావు, బేగంపేట, 46. ఎమ్. రవికుమార్, జహీరాబాద్, మెదక్ జిల్లా, 47. కోలా సత్యనారాయణ, విశాఖపట్నం, 48. ఎస్.ఎస్. మోహన్‌నాయుడు, బంటుమిల్లి, కృష్ణా జిల్లా, 49. సిహెచ్.వి.ఎస్.ఎల్. రాజేశ్వరి, కాకినాడ, 50. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 51. ఆర్.వి.సిహెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 52. హెచ్.జె. సువర్ణ, కర్నూలు, 53. కరణం సుధీంద్రరావు, కర్నూలు, 54. సిరివెల్లి రవీంద్రకుమార్, కర్నూలు, 55. తల్లాప్రగడ మధుసూదనరావు, బెంగళూరు.

# చతురంగం - 33 ఆధారాలు

**అడ్డం**

1. చవితి తర్వాతి తిథి (3)
3. 'విశ్వదాభిరామ..' పద్యాలు ఈయనవే (3)
5. అమెరికా అంతరిక్ష పరిశోధనా సంస్థ పొట్టిపేరు ఇంగ్లీషులో (2)
7. ఎక్కువే కానీ తిరగబడింది (2)
9. విశ్రాంతి (3)
10. దేవనర్తకి, ఓ తెలుగు సినీతార (2)
12. సూర్యుడు (2)
14. బేసి కాదు (2)
15. సాధు జంతువే, తిరగబడింది (2)
16. తుమ్మెద (3)
18. ఎన్టీఆర్ జమునల చిత్రం... అటు నుంచి (2)
19. హాని (2)
20. తడబడిన తృణధాన్యం (3)
21. త్రాసు .. మరోరకంగా (3)
22. చోటు (2)
23. 'నమశ్శివాయ' మంత్రాన్ని ఇలా అంటారు, అనుష్క నటించిన సినిమా (4)
25. ఆస్ట్రేలియా జాతీయ జంతువు (3)
28. సింగారం (2)
30. హస్తి (3)
32. సీతాపతే తిరగబడ్డాడు (3)
35. గూఢచారి (2)
36. వినాయకుని భార్యల్లో ఒకరు (2)
37. నిలువు 9కి బహువచనం (3)
38. జగం (2)
39. పాలలో తోడేస్తే ... (3)

**నిలువు**

1. పంచిపెట్టడం (3)
2. హద్దు (2)
4. అరిషడ్వర్గాల్లో ఒకటి (2)
5. చంద్రబాబునాయుడి ఇంటి పేరు (2)
6. చక్రవర్తి కింద ఈ రాజు ఉంటాడు (5)
8. సగం (2)
9. పువ్వు (2)
11. శివుడు (3)
13. ఆశ్చర్యం (3)
14. దండ (2)
17. పదహారు అడ్డమే మరోరకంగా (3)
18. శ్రీకృష్ణుడే (3)
19. ముఖ్యం (3)
20. పదిహేను అడ్డమే మరోలా (2)
21. పరీక్షిత్తుని కాటేసిన నాగు (4)
22. రోడ్డు వేయాలంటే ఇది తప్పనిసరి (2)
24. ఉత్తరాంధ్ర ప్రఖ్యాత కథారచయిత పొట్టిపేరు (2)
26. ఇది లేందే బతకలేం (2)
27. మశకం (2)
29. రాచమల్లు రామచంద్రారెడ్డి పొట్టిపేరు (2)
30. వ్యవసాయం, సేద్యం (2)
31. నక్క (3)
33. వదలకుండా సన్నగా కురిసే వాన (3)
34. పెదవి (2)
35. ఓ హాస్యనటుడు (2)

***గమనిక :*** **చతురకు నవలలు, చతురకతలు, చతురోక్తులు, నిన్నటినిజం, చతురంగం, ప్రవేశిక కూపన్లు, ఇతర రచనలు పంపేవారు.. పారితోషికం, బహుమతులు పొందడంలో అసౌకర్యం కలగకుండా ఉండేందుకు విధిగా తమపూర్తి చిరునామా, పిన్‌కోడ్, వయసు, ఫోన్‌నంబరు స్పష్టంగా రాయాలి. తిరస్కృత రచనలు కావాలనుకునేవారు సొంత చిరునామాతో తగినన్ని స్టాంపులు అతికించిన కవరు జతచేయాల్సిందిగా మనవి. చందాదారులు కూడా తాము పంపే డి.డి. వెనుక భాగంలో తప్పకుండా తమ చిరునామా, ఫోన్ నెంబరు ఇవ్వాలి.**

# చతురంగం - 33

రూ.150/- బహుమతి

గడువు తేది : డిసెంబరు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | 4 | | ■ | 5 | 6 సా |
| | ■ | 7 | 8 | ■ | | ■ | 9 | | |
| 10 | 11 | ■ | 12 | 13 | ■ | 14 | | ■ | |
| ■ | 15 | | ■ | 16 భ్ర | 17 | | ■ | 18 | |
| 19 | | ■ | 20 | | | ■ | 21 | | |
| | ■ | 22 | | ■ | 23 | 24 | | | ■ |
| 25 | 26 | | ■ | 27 | ■ | 28 | కు | ■ | 29 |
| ■ | | ■ | 30 | | 31 | ■ | 32 | 33 | |
| 34 | ■ | 35 | | ■ | 36 | | ■ | | ■ |
| 37 | | | ■ | 38 | కం | ■ | 39 | | |

పంపినవారి పేరు: ---------------------------------------------

వయసు (     ) చిరునామా : ---------------------------------

---------------------------------------------------------------

------------------- పిన్ : ------------ ఫోన్ : ------------------



ఆధారాలు

## నిబంధనలు

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు.

★ చతురంగం, చతురప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం.

# ఛిద్రమైన బతుకు చిత్రం!

అన్నాళ్లూ తమతో వైరం పూనిన భూషణం తన తండ్రి వెంట రావడంతో ఆశ్చర్యపోయింది శకుంతల.

'ఈ భూషణానికీ మనకీ మాటల్లేవుగా.. ఎప్పుడు కలిశారూ?' అడిగిందామె తండ్రిని పక్కకు పిలిచి.

'నిన్నేలే. శుక్రోరం గొడ్ల సంతకెల్దామని నోరు తెరిచి అడిగాడు' అన్నాడు రంగయ్య.



'నాన్నా! ఎవరో ఒకర్ని తీసుకుని ఇలా వారానికి రెండురోజులొత్తే నేనొండి పెట్టలేను. ముగ్గురు పిల్లలతో, ఇంటింటికి తిరిగి చేసే పాల వ్యాపారంతో ఒళ్లు హూనమవుతోంది. మాకున్న కష్టాలు చాలనట్టు నువ్వొకడివి..' అందామె నిష్ఠూరంగా.

ఇంతకీ కూతురితో అన్నేసి మాటలుపడ్డ ఆ తండ్రి వ్యక్తిత్వం ఎలాంటిది? కొల్లేటివాసుల బతుకు చిత్రాన్ని అత్యద్భుతంగా చిత్రించిన అక్కినేని కుటుంబరావు నవల

**కొల్లేరు కంటనీరు**



**చతుర కొత్తసంవత్సర కానుక**

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. www.eenadu.net.

# అక్షరధార

వేల ఏళ్ల క్రితం మన ప్రాచీనులు మనిషి ప్రవర్తనా నియమావళిని నిర్దేశిస్తూ వాటిని శ్లోకబద్ధం చేశారు. అవి అన్ని కాలాలకి, అన్ని ప్రదేశాలకి చెందిన అందరికీ సమానంగా వర్తించే నిత్య సత్యాలు.

## ధర్మమే అత్యుత్తమం

ధర్మోహి పరమో లోకే ధర్మే సత్యం ప్రతిష్ఠితం ।
ధర్మ సంశ్రిత మేతచ్చ పితుర్వచన ముత్తమం ॥

భావం: ధర్మమే లోకంలో ప్రధానమైంది. ధర్మంలోనే సత్యం నిలిచి ఉంటుంది. అందులోనూ అత్యుత్తమమైనది తండ్రి మాటని గౌరవించడం.

## అహంకారమే బంధం

న నారీ న ధనం గేహం న
పుత్రా నచ సోదరాః
బంధనం ప్రాణినాం రాజన్!
అహంకారస్తు బంధకః

భావం: ఈ ప్రపంచంలో స్త్రీ, ధనం, సంతానం, తోడబుట్టిన వాళ్లు వాస్తవానికి బంధాలు కావు. మనిషికి తన అహంకారమే బంధమవుతుంది.

## ప్రశంస!

ప్రత్యక్షే గురవః స్తుత్యాః
పరోక్షే మిత్ర బాంధవాః
కర్మాంతే దాస భృత్యాశ్చ
న కదాచన పుత్రకాః

భావం: గురువుని వారి సమక్షంలో, బంధు మిత్రులని పరోక్షంలోను, సేవలకులని అప్పగించిన పని పూర్తి చేశాకే ప్రశంసించాలి. కుమారుని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ప్రశంసించకూడదు.

## నిరర్థకం!

పుస్తకేషు చ యా విద్యా
పరహస్తేషు యద్ధనం ।
ఉత్పన్నేషు చ కార్యేషు
నసా విద్యా నత తద్ధనమ్ ॥

భావం: పుస్తకాలకే పరిమితమైన విద్య, ఇతరుల వద్ద ఉన్న మన ధనం అవసరానికి పనికి రావు.

## గుణదోష వివక్ష!

గుణదోషౌ బుధో గృహ్ణన్
ఇందు క్ష్వేలా వివేశ్వరః
శిరసా శ్లాఘతే పూర్వం
పరం కంఠే నియచ్ఛతి

భావం: ఈశ్వరుడు పాల సముద్రంలో పుట్టిన కాలకూటాన్ని, చంద్రుడినీ స్వీకరించాడు. చంద్రుడ్ని శిరస్సు మీద ధరించాడు. విషాన్ని పైకి కనపడకుండా కంఠంలోనే పెట్టుకున్నాడు. పండితుడు కూడా ఇలాగే ఇతరులలోని సుగుణాలని శ్లాఘిస్తూ, దోషాలని దాచుకుంటాడు.

## ప్రయత్నం ప్రధానం!

యోజనానాం సహస్రాణి
యాతి గచ్ఛన్ పిపీలికః ।
అగచ్ఛన్ వైనతేయోపి
పదమేకం న గచ్ఛతి ॥

భావం: జీవరాసుల్లో చిన్నదైన చీమ ప్రయత్నించి నడక సాగిస్తే వేలమైళ్లు వెళ్లగలుగుతుంది. ఎంతో వేగంగా ఎగిరే గరుత్మంతుడైనా ఎగరకపోతే ఉన్నచోటనే ఉంటాడు. కార్యసాధనకు ప్రయత్నం అవసరం.

సేకరణ : లిపి

CHATURA Telugu Monthly, December 2013. Regd No. HD/965/2012-2014 RNI/32186/78